అదేమిటి? నువ్వు ఒక్కడివే తిరిగినట్లు మాట్లాడుతున్నావు? హిరణ్యకశిపుడు కూడా నీ కన్నా ఎక్కువగానే తిరిగాడు కదా! అన్నాడు విష్ణుమూర్తి.

నారదా! నేను ఎక్కడున్నా, ఏ లోకంలో ఉన్నా హిరణ్యకశిపుడు నా జాడ కనిపెట్టేస్తాడు. ఎక్కడ దాగితే అతడు కనిపెట్ట లేడో అక్కడ దాగాను అన్నాడు విష్ణుమూర్తి. అదెక్కడ స్వామీ? మీరు దాగింది ఎక్కడ? అని అడిగాడు నారద మహర్షి.

నారదా! నేను దాగింది హిరణ్యకశిపుని హృదయం లోనే. హిరణ్యకశిపుడు అహంకారి. తన కన్నా వేరైన ప్రదేశాలలో అన్వేషిస్తాడే గాని, తనలో తాను తల వంచి, అంతర్ముఖుడై చూడడు. అందుకనే నన్ను నేను దాచుకోవడానికి అదే అనువైన చోటు అని భావించి, అతని హృదయం లోనే ఒదిగి పోయాను అని రహస్యాన్ని విప్పి చెప్పాడు వైకుంఠ పతి.

**కృతకృత్యుడు**

పరమాత్మ జ్ఞానమును పొందిన వాడు కృతార్థు డవుతున్నాడు. ఆత్మయే పరమాత్మ అనే జ్ఞానము మహోన్నత మైంది. పరమాత్మ జ్ఞానమును పొందిన వాడు అంతకు మించి పొంద వలసింది ప్రపంచములో మరొకటి ఉండదు. పర అంటే ఉత్కృష్ట మైనది అని అర్థము ***(పరః సర్వ భూతేభ్యః ఉత్కృష్టం బ్రహ్మ)***. అట్టి పరమాత్మ జ్ఞానము ప్రాప్తించిన వాడు కృతకృత్యు డవుతున్నాడు.

కృత్యము అంటే కార్యము. కృతం అంటే చేయబడింది. ఏది కర్తవ్యమో అదే కృతం. కర్తవ్యము అంటూ మిగలకుండా చేయ వలసిన కార్యము లన్నీ చేసేసిన వాడు కృతకృత్యుడు ***(కృతం కృత్యం కర్తవ్యం యేన సః కృత కృత్యః)***. ఎలాగైతే స్వప్నంలో చేయ వలసిన కర్తవ్యా లన్నీ మేలుకోగానే చేసినట్లే అవుతున్నాయో, అలాగే భగవత్తత్త్వాన్ని తెలుసుకుంటే చేయ వలసిన కర్తవ్యా లన్నీ చేసినట్లే అవుతున్నాయి. అట్టి వాడు కృతకృత్యుడు అవుతున్నాడు ***( యత్ కర్తవ్యం తత్ సర్వం భగవత్తత్త్వే విదితే కృతం భవేత్ ఇత్యర్థః)***. ఈ విధంగా సమస్త కర్మలు జ్ఞానములో లయించి పోతున్నాయి *( 4 వ అ - 33 వ శ్లో )*. ఈ విధమైన అత్యంత రహస్యమైన బ్రహ్మాత్మ జ్ఞానమును బోధించి, అర్జునుణ్ణి కృతార్థుణ్ణి చేశాడు కరుణా సముద్రుడైన భగవంతుడు.

'అర్జునా! గుహ్యతమ మైన శాస్త్రాన్ని నీకు బోధించాను. పరమార్థ స్వరూపమైన పురుషోత్తమ తత్త్వమును నా ద్వారా శ్రవణం చేసి నువ్వు కృతార్థుడ వయ్యావు, కృతకృత్యుడ వయ్యావు' అని పలుకుతూ పదిహేనవ అధ్యాయాన్ని పరమేశ్వరుడు సమాప్తం చేస్తున్నాడు ***( ఏతత్ పరమార్థ తత్త్వం మత్తః శ్రుతవాన్ అసి తతః కృతార్థః త్వం భారత ఇతి )***.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం

యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే

పురుషోత్తమప్రాప్తి యోగో నామ పఞ్చదశోఽధ్యాయః

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు పురుషోత్తమప్రాప్తి యోగ మనే పదిహేనవ అధ్యాయము.**



# చైతన్య భగవద్గీత

## అథ షోడశోఽధ్యాయః - పదహారవ అధ్యాయము

## దైవాసుర సంపద్విభాగ యోగః - దైవాసుర సంపద్విభాగ యోగము

**చీకటి వెలుగులు**

ఎవరైనా, ఎక్కడైనా, ఎప్పుడైనా వెలుగునే వాంఛిస్తారు. ప్రకాశాన్నే కాంక్షిస్తారు. తేజమునే ఆహ్వానిస్తారు. చీకటి ఎవరి కైనా చికాకును కలిగిస్తుంది. చిడి పడేలా చేస్తుంది. కనుక, అందరూ వెలుగునే ఆదరిస్తారు. చీకటిని సర్వులూ చీదరించు కుంటారు.

కొందరికే పరిమితం కానిది, అందరూ ఆహ్వానించేది, ఆదరించేది వెలుగే అయినా, చీకటిలో ఉన్న వారికే వెలుగు యొక్క విలువ విశిష్టంగా తెలుస్తుంది. పంజరంలో బంధించ బడిన పక్షికే స్వేచ్ఛా విహారంలో ఉండే హాయి అవగత మవుతుంది. అనారోగ్యంతో అలమటించే వారికే ఆరోగ్యంలో ఉండే సుఖం అర్థ మవుతుంది. జనతకు దూరమై కారాగృహంలో కుమిలే ఖైదీకే జన సమూహంలో ఉండే జవము గోచర మవుతుంది. ఈ కారణం చేతనే, కేవలం వెలుగుల్ని మాత్రమే ఆరబోయడానికి ఆవిర్భవించిన శాస్త్రాలు అప్పుడప్పుడు, అక్కడక్కడ చీకట్లను కూడా చూపెడుతూ చర్చిస్తూ ఉంటాయి. దాని ఉద్దేశ్యం చీకటిలో పయనించ మని కాదు, చింతలలో శయనించ మనీ కాదు. ఏది పొంతమో, ఏది అంతమో పరిశీలించి అర్థం చేసుకోమని. విశ్లేషించుకొని ప్రయాణాన్ని సుగమం చేసుకోమని. శాస్త్రము వెలుగుల బాటలో అక్కడక్కడ నీడల్ని చూపిస్తూ నడక సాగించేది ఇందుకే.

అర్జునా! దుష్టులు, మూఢులు, నీచులు, మాయలో పడిన అవివేకులు - ఆసురీ సంపద కలిగిన ఈ అధములు ***(ఆసురం భావ మాశ్రితాః)*** నన్ను పొంద లేరు అన్నాడు ఏడవ అధ్యాయంలో భగవంతుడు *(7వ అ - 15 వ శ్లో)*.

తిమిరంలో దూరి తారాడుతూ, తచ్చాడుతూ ఉన్న ఆసురీ ప్రకృతి కల వారిని విజ్ఞాన యోగంలో ప్రవేశ పెట్టిన భగవానుడు, పునః తొమ్మిదవ అధ్యాయం పన్నెండవ శ్లోకంలో పరామర్శిస్తూ మోహంలో కూరుకు పోతారు అని హెచ్చరించాడు.

పార్థా! వీరి ఆశలు వ్యర్థం. వీరి కర్మలు అనర్థం. వీరి జ్ఞానం అసమర్థం. వీరిది రాక్షసీ ప్రకృతి. ఆసురీ ప్రకృతి. వీరు మోహ కూపంలో పడి పోతారు అంటూ రాక్షసులకు, అసురులకు మధ్య ఉండే స్వల్పమైన అంతరాన్ని కూడా స్పృశిస్తూ రాజవిద్యా రాజగుహ్య యోగంలో మళ్ళీ చీకటి తెరను ముందుకు తెచ్చాడు వాసుదేవుడు *(9 వ అ - 12 వ శ్లో)*.

చీకటి బ్రతుకులు ఇలా వ్యర్థ మైపోతూ ఉంటే, కాంతిమయ జీవితాలు ఎలా దేదీప్యమాన మవుతాయో చూడ మంటూ తొమ్మిదవ అధ్యాయం లోనే దైవీ ప్రకృతితో శోభించే మహాత్ములను కూడా పరిచయం చేశాడు.

పాండవా! మహాత్ములు దైవీ ప్రకృతిని ఆశ్రయిస్తారు ***(దైవీం ప్రకృతిం ఆశ్రితాః)***. నేను సర్వ భూతాలకు కారణ మని, నశించే వాడిని కానని వారికి తెలుసు. అందుచేతనే ఏకాగ్రచిత్తులై వారు నన్నే ఆరాధిస్తారు



అంటూ, రాజవిద్యా రాజగుహ్య యోగం లోనే వెలుగుల తోరణాలను దర్శింప చేశాడు (9 వ అ - 13 వ శ్లో). ఈ విధంగా తొమ్మిదవ అధ్యాయంలో దైవ ప్రకృతి, ఆసురీ ప్రకృతి, రాక్షస ప్రకృతి - ఈ మూడిటిని సూచించాడు.

**ఉభయ ప్రకృతులు**

సాధారణంగా మనకు వెలుగులు బాహ్యంలో విరబూస్తాయి. అందుకే కళ్ళు తెరచి బాహ్యాన్ని చూస్తాము. కళ్ళు మూస్తే అంతా చీకటిగా ఉంటుంది. అంతరంగ మంతా అంధకార మయంగా గోచరిస్తుంది. ఇది వాస్తవ మేనా? కాదు. మనకు అలా తెలుస్తూ ఉందే గాని వాస్తవం అలా లేదు. సత్యం మరో విధంగా ఉంది.

బాహ్యంలో వెలుగులు లేవు. బాహ్య మంతా చీకటిమయం. వెలుగు అనేది లోపలే ఉంది. అది మారని వెలుగు. ఆరని వెలుగు. ఒకవేళ బాహ్యంలో వెలుగులు ఉన్నట్లు అనిపించినా, వాస్తవానికి అవి ఆంతర్యంలో దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న ఆత్మ భాస్కరుని జ్ఞాన కిరణాలే (***తమేవ భాన్తం అనుభాతి సర్వం, తస్య భాసా సర్వ మిదం విభాతి*** - కఠోపనిషత్ ). ఈ విషయాన్ని పూర్వాధ్యాయం ఆరు మరియు పన్నెండవ శ్లోకాలలో సుదీర్ఘంగా చర్చించి, సుస్పష్టంగా దర్శించాము కనుక ప్రస్తుతం విస్తరించి చెప్పుకో నవసరం లేదని భావిస్తున్నాను.

ఇకపోతే, ఈ భిన్న ప్రకృతులు గల వారి ప్రయాణాలు ఏ దిక్కుగా ఉన్నాయి అని విచారిస్తే, దైవీ సంపద కల వారిది వెలుగు బాట. ఆసురీ సంపద కల వారిది చీకటి దారి. వెలుగు బాటలో పయనించే వారు అంతర్ముఖులై వెలు గున్న చోటికి పయనిస్తూ ఉంటే, చీకటి దారిలో చరించే వారు బహిర్ముఖులై అంధకారంలో అలమటిస్తూ ఉంటారు.

దైవీ సంపద కల వారు వెలుగు బాటలో ఉన్నారు కనుక మెల్ల మెల్లగా చైతన్యం వైపుకు సాగిపోతూ ఉంటారు. ఆసురీ సంపద కల వారు చీకటి దారిలో పడి పోతున్నారు కనుక, మార్గ మేదో అర్థం కాక నామరూపాలను వాటేసుకొని, వాటితో సహవాసం చేస్తూ వాటి మధ్యే జీవిస్తూ ఉంటారు.

దారి తప్పి, అడవిలో కంటకాల మధ్య చిక్కుకున్న వారిని మెల్లగా, ముళ్ళను విడిపించి, చేయి పట్టుకొని నడిపించి, సురక్షితంగా ఇల్లు చేర్చేది దైవ మార్గము. ఇంటిలో క్షేమంగా ఉన్న వారిని బలవంతంగా ఈడ్చుకొని పోయి చీకటి అరణ్యాల లోకి తోసేసేది ఆసురీ మార్గము.

దైవీ ప్రకృతిని ఆశ్రయించిన వారు ఊర్ధ్వ దృష్టి కలిగి ఆదిమూలాన్ని అన్వేషిస్తూ పై పైకి పోతూ ఉంటే, ఆసురీ ప్రకృతిని ఆశ్రయించిన వారు అధోదృష్టిని కలిగి కొమ్మలను పట్టుకొని జారుతూ పతనమై పోతారు. చీకటి గుహలో పడి పరిభ్రమిస్తూ ఉంటారు.

కనుక, జననమరణ సంసార చక్రము నుండి విడిపించి తరింప చేసేది దైవీ ప్రకృతి అయితే, సంసార సుడి గుండంలో పడదోసేది ఆసురీ ప్రకృతి. దైవీ ప్రకృతి మోక్ష హేతువైతే, ఆసురీ ప్రకృతి బంధహేతువు అవుతూ ఉంది (***సంసార మోక్షాయ దైవీ ప్రకృతిః నిబద్ధాయ ఆసురీ రాక్షసీ చ***). ఇక దేనిని తగిలించు కోవాలో, దేనిని తొలగించు కోవాలో ఎవరికి వారే నిర్ణయించుకోవాలి.

**నిత్య పోరాటము**

రెండు ఉండటం దోషం కాదు. కాని, అవి ఎందు కున్నవో అర్థం కావాలి. కళ్ళు రెండున్నాయి. రెండు కళ్ళు ఒకే పనిని చేస్తున్నాయి. అలా ఉండ గలిగితే రెండు ఉండటం దోషం కాదు. పైగా, ప్రగతికి సోపానా లవుతాయి. అలా కాకుండా రెండు ఉండి, అవి పరస్పర విరుద్ధమైన ప్రకృతులతో కొనసాగే టప్పుడు, ఆ రెండిటిలో ఏది శ్రేయస్సో దానిని ఉంచు కోవాలి. ఏది పతన హేతువో దానితో సంబంధం త్రెంచుకోవాలి.





ఒకవేళ రెండూ కలిసిపోయి ఏకమై ఉంటే; పాలను, నీళ్ళను వేరు చేసి హంస పాలను పానం చేసినట్లు, ఒక దాని నుండి మరొక దానిని వేరు చేసి మోక్ష హేతువు ఏదో దానిని సొంతం చేసుకోవాలి.

పండు సాత్వికాహారము. ఆరోగ్యప్రద మైంది కూడా. అలాంటి ఫలాహారాన్ని స్వీకరించే టప్పుడు కూడా అవసరం లేని దానిని పరిహరించి అవసరమైన దానిని గ్రహిస్తున్నాము. అరటిపండు అయితే, తొక్కను పడేసి పండును తింటున్నాం. మామిడి పండు అయితే, గుజ్జును తిని తొక్కను, పిక్కను పడేస్తున్నాం. తొక్కలు, పిక్కలు పండ్లతో కలిసి ఉన్నా, త్యజించ వలసిన వాటిని త్యజిస్తున్నాం. గ్రహించ వలసిన వాటిని గ్రహిస్తున్నాం. అదే విధంగా, ఒకే వ్యక్తిలో దైవీ ప్రకృతి, ఆసురీ ప్రకృతి రెండూ కలిసిపోయి ఉన్నప్పుడు, వివేకంతో, విచక్షణతో విచారించి, ప్రగతి హేతువైన దైవీ సంపద కొరకు ప్రయత్నించాలి. ఈ కార్యము జరగ నపుడు పరస్పర విరుద్ధ మైన ఆ ప్రకృతుల మధ్య సమరం ఆరంభ మవుతుంది. అందుకే రెండున్న చోట కలహా లుంటాయి. భయా లుంటాయి. బాధ లుంటాయి. బ్రతుకులు భారంగా మారుతూ ఉంటాయి.

ఇవే వ్యక్తి జీవితంలో నిత్య పోరాటా లవుతాయి. ఈ పోరాటాలే ప్రపంచంలో మనకు అనేక చోట్ల గోచరిస్తూ ఉంటాయి. కుళాయిల వద్ద ఉంటాయి. ఇళ్ళల్లో వ్యక్తుల మధ్య ఉంటాయి. కార్యాలయాలలో ఉద్యోగుల మధ్య ఉంటాయి. రాజకీయ పార్టీల మధ్య ఉంటాయి. వీధుల్లో వినిపిస్తాయి. క్లబ్బుల్లో కనిపిస్తాయి. అసెంబ్లీలో అగుపిస్తాయి. సంతలో వింత లనిపిస్తాయి.

కలహాలు ఎక్కడైనా కనిపించ నివ్వండి. అవి పుట్టేది మాత్రం వ్యక్తి లోనే. ఏ నది అయినా ఎక్కడో, ఒక కొండపై నుండి చిన్న ధారగా, లేదా పాయగా ఆరంభ మవుతుంది. ప్రవాహంలో కాలువలు, వాగులు, చిన్న చిన్న నదులు వచ్చి కలుస్తూ ఉంటాయి. ఒక దశలో విశాలమైన ఒక జీవనది కళ్ళ ముందు గంభీరంగా ప్రవహిస్తూ కనిపిస్తుంది.

వ్యక్తిలో పురుడు పోసుకున్న చిన్నపాటి ఘర్షణలు చిలికి చిలికి గాలివాన లవుతాయి. కాల క్రమేణ అవే సమర నదికి ప్రాణం పోస్తాయి. అనేక మంది ప్రాణాలు కోల్పోవ డానికి కారణ మవుతాయి. అది కళింగ యుద్ధము కావచ్చు. కురుక్షేత్ర సమరం కావచ్చు. లేదా రామరావణ సంగ్రామం కావచ్చు. పల్నాడులో పడగ విప్పినా, బొబ్బిలిలో బెబ్బులియై గాండ్రించినా, దాని ఉద్గమ స్థానము మాత్రం వ్యక్తి హృదయమే. సరస మైనా, విరస మైనా అక్కడి నుండే కదలాలి.

హృదయం కదన రంగమైతే, ఇక సంసార చక్రము పరిభ్రమిస్తూనే ఉంటుంది. సంసార సంతాపం తొలగా లన్నా, నిత్య వెలుగులతో బ్రతుకు విరాజిల్లా లన్నా, మోక్ష మార్గం సుగమం కావాలన్నా హృదయంలో రణం ఆగాలి. అప్పుడే సంసార ఋణ విముక్తి కలుగుతుంది.

పల్లవి : **రణమే బ్రతుకంతా**
**ఋణమే జీవన సంత**
**అంతా ఒకటే చింత**
**జగమంతా ఇదే వింత** ॥ రణమే ॥

చరణములు : **(1) పోయే పరువులు చేరే అరువులు**
**కరువులే జీవికి అంతా**
**ఆశల వేడుకలు నిరాశల ఏడుపులు**
**వీడవు జీవిత మంతా** ॥ రణమే ॥

(2) తుది ఊపిరి వీడే లోగా
ఆది ఎక్కడో తెలియాలి
ఆదిదేవుని అండ దొరికితే
రణము లన్నీ విజయాలే
ఋణము లన్నీ వీడుకోలే ॥ రణమే ॥

అంటూ బ్రతుకు ఋణాన్ని, జీవన రణాన్ని కళ్ళ ముందు ప్రదర్శిస్తూ, విజయ యాత్రను సాగించ మని సందేశ మిచ్చింది చైతన్య గీతిక.

## సమరం నుండి సన్నిధికి

కదన కలహాలకు దూరమైన బ్రతుకే కళకళ లాడుతుంది. సంఘర్షణల నుండి విడిపడిన మనస్సే సంతతానంద సంధాయక మవుతుంది. కొట్లాటల రణగొణ ధ్వనుల మధ్య గుడి గంటలు వినిపించవు. కుతంత్రాల కుతకుతల మధ్య మంత్రాలు ఫలించవు. ప్రమాదాల మధ్య ఎక్కడి ప్రమోదాలు? ఏవి ప్రసాదాలు?

ఆదిదేవుని అండ దొరకాలంటే అజ్ఞానం అంతం కావాలి. ఆనంద నిలయంలో అజ్ఞానికి ప్రవేశం ఉండదు. మోహం తొలగితేనే మోక్షము. అసమ్మూఢుడే ఆనంద మోహనుని ఆలయం లోకి ప్రవేశించ గలడు. సత్యాన్ని సందర్శించ గలడు.

**యో మా మేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్!**

'అర్జునా! మోహము నుండి విడిపడిన వాడే క్షరాక్షరముల కంటే అన్యమైన, అతీతమైన, ఉత్తమ మైన పురుషోత్తమ తత్త్వమును పొందుతాడు' - ఇది పూర్వాధ్యాయానికి ముగింపు పలుకుతూ మాధవుడు పలికిన మాట. కనుక ఆసురీ ప్రకృతిని ప్రతి ఒక్కరు దూరం చేసుకోవాలి. దైవీ సంపదను ప్రోగు చేసుకోవాలి. దైవీ సంపదను స్వీకరించాలి. ఆసురీ సంపదను పరిత్యజించాలి (***దైవ్యాః ఆదానాయ ప్రదర్శనం క్రియతే, ఇతరయోః పరివర్జనాయ***). ఈ కార్యాన్ని సాధించ డానికే తొమ్మిదవ అధ్యాయంలో సూచన ప్రాయంగా తెలియ చేయబడిన ఈ ఉభయ ప్రకృతులను విస్తరించి ఈ షోడశాధ్యాయము ప్రారంభింప బడుతూ ఉంది (***ప్రాణినాం ప్రకృతయః నవమే అధ్యాయే సూచితాః ! తాసాం విస్తరేణ ప్రదర్శనాయ అయం అధ్యాయః ఆరభ్యతే !***).

జలక్షీర న్యాయానుసారం ఆసురీ సంపదను విస్మరించి, దైవీ సంపదను స్మరించే వారు, సాధించే వారు పూర్వ అధ్యాయాంత శ్లోకంలో మనం చెప్పుకున్నట్లు బుద్ధిమంతు లవుతారు. కృతకృత్యు లవుతారు (***కృతకృత్యః భవేత్ !***).

కృతకృత్యు లయ్యే వారెవరు? కాలేని వారెవ్వరు? అనే సందేహం కలగటం సహజము. సామాన్యము. తత్త్వజ్ఞాన సముపార్జనకు ఎవడు అర్హుడు? ఎవడు అనర్హుడు? అధికారిని, అనధికారిని గూర్చి విచారిస్తే కదా నిర్ణయ మయ్యేది! ఆ ప్రయత్నం లోనే ఈ అధ్యాయము ఆరంభ మవుతూ ఉంది.

***భారో యో యేన వోఢవ్యః స ప్రాగా తోలితో యదా।***
***తదా ఽకస్తస్య వోఢేతి శక్యం కర్తుం నిరూపణమ్ ॥***

'ఎవడు ఏ బరువును మోయవలసి ఉన్నా, ముందు దానిని వాడు కదిలించ గలిగితే, అతడు మోయ గలడా, లేదా? అనేది నిర్ణయించ వచ్చు'.

అలాగే, వ్యక్తి అసమ్మూఢుడై కృతకృత్యుడు కావాలంటే ముందుగా దైవీ సంపదను కలిగి ఉండాలి. అట్టి దైవీ సంపదకు సంబంధించిన వివేకాన్ని మొదటి మూడు శ్లోకాలలో అనుగ్రహిస్తున్నాడు ఆదిదేవుడు.





**శ్రీ భగవానువాచ :**

**అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగ వ్యవస్థితిః।**
**దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్ ॥** 1

*అభయం-సత్త్వసంశుద్ధిః-జ్ఞానయోగ వ్యవస్థితిః*
*దానం-దమః-చ-యజ్ఞః-చ-స్వాధ్యాయః-తపః-ఆర్జవం*

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా! | దమః చ | = ఇంద్రియ నిగ్రహము |
| అభయం | = భయము లేని స్థితి | యజ్ఞః చ | = యజ్ఞము |
| సత్త్వ సంశుద్ధిః | = చిత్తశుద్ధి | స్వాధ్యాయః | = వేదాధ్యయనము |
| జ్ఞానయోగ వ్యవస్థితిః | = జ్ఞానము, యోగము నందు స్థిరత్వము | తపః | = తపస్సు |
| దానం | = దానము | ఆర్జవం | = ఋజుత్వము |

**శ్రీ భగవంతుడు చెబుతున్నాడు :**

**అర్జునా! అభయము, సత్త్వసంశుద్ధి, జ్ఞానయోగనిష్ఠ, దానశీలము, ఇంద్రియనిగ్రహము, యజ్ఞము, వేదాధ్యయనము, తపస్సు, ఋజుత్వము - ఇవి దైవీ సంపదతో జన్మించిన వారిలో కనిపిస్తాయి.**

**వ్యాఖ్య**

***అధశ్చోర్ధ్వం ప్రసృతాః తస్య శాఖాః*** - సంసార వృక్షము యొక్క కొమ్మలు క్రిందికి, పైకి వ్యాపించి ఉన్నాయని పూర్వాధ్యాయంలో చెప్పుకున్నాం. క్రిందికి విస్తరించేది ఆసురీ ప్రకృతి కాగా, పైకి ప్రాకి పోయేది దైవీ ప్రకృతి. అసమ్మూఢుడై కృతకృత్యుడు కావాలని అభిలషించే వాడు క్రిందికి వ్యాపిస్తున్న ఆసురీ సంబంధ మైన శాఖల్ని ఖండించి, ఊర్ధ్వంగా ప్రాకుతున్న దైవీ సంబంధమైన శాఖల్ని పెంపొందించుకుంటూ ఉన్నతంగా చరించి వృద్ధిని సాధించాలి.

మొదటి మూడు శ్లోకాలలో ముందుగా దైవీ సంపదకు సంబంధించిన లక్షణాలను చెబుతున్నాడు. ఈ మూడు శ్లోకాలలో అభయాది దైవ లక్షణాలు ఇరవై ఆరు చెప్పబడ్డాయి. వాస్తవానికి ఈ మూడు శ్లోకాలను కలిపి ఒకేసారి వ్యాఖ్యానించాలి. ఎందుకంటే, ఈ మూడు శ్లోకాలకు సంబంధించిన ఒకే క్రియా పదము మూడవ శ్లోకము ఉత్తరార్ధంలో ఉంది. ***భవన్తి సమ్పదం దైవీం అభిజాతస్య భారత!*** - 'అర్జునా! (ఈ ఇరవై ఆరు లక్షణాలు) దైవీ సంపదతో జన్మించిన వారికి సంభవిస్తాయి' అనే క్రియా పదము కలిగిన వాక్యము ఇరవై ఆరు లక్షణాలు కలిగిన మూడు శ్లోకాలకు కలిపి వర్తిస్తుంది. అవగాహనా సౌలభ్యం కొరకు నేను ఒక్కొక్క శ్లోకాన్ని వేరు చేసి వ్యాఖ్యానిస్తున్నాను. కాకపోతే, మూడవ శ్లోకం చివర వచ్చే క్రియాపదంతో కూడిన వాక్యాన్ని ప్రతి శ్లోకానికి పాఠకులు అన్వయించు కోవాలి. ప్రస్తుతం మొదటి శ్లోకంలో తొమ్మిది లక్షణాలను భగవంతుడు చెబుతున్నాడు. చదవండి.

### (1) అభయం

అభయం అంటే భయం లేక పోవడము (***అభయం అభీరుతా***). ఇంతకీ ఏది భయం? ఏది అభయం? భయం అనేది వ్యక్తి మనస్సు లోని ప్రతిచర్య. ప్రతిస్పందన. అంతేకాని, భయ మనేది ప్రత్యేకంగా ఒకటి లేదు. దుఃఖానికి కారణమైన దానిని చూడటం వల్ల కలిగే బాధయే భయం. అది లేక పోవడము అభయము.

భయపడటానికి ఏదో కారణము ఉంటుంది. అలా ఒక నిమిత్తం వల్ల ఏర్పడేదే భయం. ***బిభేత్యస్మా దితి భయం*** - 'దీని వలన భయపడతారు' అని భయాన్ని నిర్వచించాడు అమరసింహుడు. పారమార్థికంగా భయ కారణము ద్వైతమే నని నిర్ధారణ చేసింది ఉపనిషత్తు.

***యదా హ్యేవైష ఏతస్మి న్నుదర మంతరం కురుతే అథ తస్య భయం భవతి*** - ఎప్పుడైతే పరబ్రహ్మము నందు స్వల్ప మైనను ***(ఉదరం)*** భేదమును ***(అంతరం)*** భావించడం జరుగుతుందో, అప్పుడు భయం కలుగుతుంది అన్నది తైత్తిరీయోపనిషత్. ఎప్పుడైతే రెండవ వస్తువు ఉందో, అదే భయ కారణ మవుతుంది. భేదమే ***(అంతరం)*** భయ కారణము. స్వల్ప భేదమున్నా ***(ఉదరం)*** అది భయాన్ని సృష్టిస్తుంది. అది స్వల్పంగా ఉండి భయాన్ని కలిగించడము లేదు. అది వేరుగా ఉండటం చేత చూచే వాడు స్వల్పంగా, అల్పంగా మారి భయానికి లోనవు తున్నాడు. ఎప్పుడైతే ప్రపంచం చూచే వాని కన్నా వేరుగా తెలుస్తూ ఉందో, తాను కాని ప్రపంచం అనంతంగా అగుపిస్తూ ఉన్నందున, దానిని చూచే తాను స్వల్పంగా మారి పోతున్నాడు. ఇదే భయానికి కారణము. కనుక భేదమే భయ కారణము ***(ద్వితీయాద్వై భయం భవతి)***. భేదము భయ కారణ మైంది కనుక అభేదము అభయ రూపము. కనుక భయం లేని అభయ స్థితి కలగాలి అంటే, అద్వయ రూపుడైన బ్రహ్మము తానే అని తెలియాలి. బ్రహ్మాత్మ జ్ఞానము కలగాలి. ఇదే పారమార్థికంగా అభయ స్థితి. ఇది సిద్ధావస్థ. కాని, ప్రస్తుతము మనము అధ్యయనం చేస్తున్న దైవీ సంపద సిద్ధావస్థకు సంబంధించింది కాదు. సిద్ధావస్థను చేర డానికి, అసమ్మూఢత్వమును సంపాదించు కోవడానికి సంబంధించిన సాధక దశ. సాధక దశలో పారమార్థిక అభయ స్థితిని ఊహించడము సాధ్య పడదు. ఏవి భయ హేతువులో వాటిని అర్థం చేసుకొని, వాటి మూలంగా బుద్ధిలో ఏ విధమైన ప్రతిచర్యలు లేకుండా ఉండటమే ఇక్కడ సాధక దశ లోని అభయ స్థితి.

వ్యావహారికంగా జీవితంలో ఏర్పడే భయాలలో అతి ప్రధాన మైంది మృత్యు భయం. మరణం అనేది ప్రతి మనిషికీ ఉంది. కనుక, మరణ భయం అందరికీ ఉంటుంది. ఇంతకీ మృత్యు భీతి ఎవరికి? చచ్చిన వాళ్ళకా, బ్రతికున్న వాళ్ళకా? చచ్చిన వాడు ఎలాగూ లేడు కదా! లేని వానికి మృత్యు భీతి ఎలా ఉంటుంది? కనుక, ఉన్న వాళ్ళకే మరణ భయం ఉంటుంది. జీవించి ఉన్న వారికే ఉంటుంది. ఎంత వరకు ఉంటుంది? మరణం రానంత వరకు ఉంటుంది. అంటే, జీవించి ఉన్నంత వరకు ఉంటుంది. జీవితాంతం అనుక్షణం వెంటాడుతూ ఉంటుంది అని అర్థం. ఇంక అభయ మెప్పుడు? ఇలాంటి చోటే కాస్త విచారం అవసరమై ఉంటుంది ***(అతః విచారః కర్తవ్యః)***.

ఏదైనా, ఎప్పుడైనా తెలియ నపుడే భయం ఉంటుంది. చీకటిలో మనిషి ఎందుకు భయ పడతాడు? ఏదీ కనిపించదు కనుక. ఏదీ అర్థం కాదు కనుక. బాహ్యంలో వెలుతురు ఉంటే భయం ఎలా ఉండదో, విషయము సుస్పష్టంగా అర్థమైతే, ఆంతర్యంలో, అంటే బుద్ధిలో చీకటి ఉండదు కనుక, భయం ఉండదు. ఇప్పుడు విచారిద్దాం.

మనిషికి మరణ భయం ఎందుకు కలుగుతూ ఉంది? ప్రస్తుతం లేని మరణం భవిష్యత్తులో రాబోతుంది అనేది భయ కారణమా? లేక ప్రస్తుతం ఉన్న తాను భవిష్యత్తులో లేకుండా పోతా డేమో అనేది భయ హేతువా?

తానెప్పుడూ ఉండాలి అనేది మనిషిలో స్వతస్సిద్ధమైన ఆకాంక్ష. తాను లేకుండా పోవడాన్ని మనిషి ఊహించ లేడు, భరించ లేడు, అంగీకరించ లేడు. కనుక మరణం ప్రతి మనిషికి భయ హేతువు అవుతూ ఉంది. ఇంతకీ తాను ఉండే వాడా? పోయే వాడా? మరణ ధర్మం కలవాడా? అమరణ ధర్మ రూపుడా? అనేది ముందుగా స్పష్టం కావాలి.





పుట్టేది ఏదైనా గిట్టేందుకే. జ్ఞానం తప్ప. పుట్టేది ఏదైనా గిట్టేదే అయినపుడు, పుట్టిన శరీరము కూడా ఎలాగైనా, ఎప్పుడైనా గిట్టేదే. మరణ ధర్మం గల దేహం విషయంలో మనిషికి దిగు లెందుకు? తాను మరణ ధర్మం గల దేహమా? లేక దేహియా? తాను దేహియే కాని దేహము కాదు.

చావడానికి పుట్టిన దేహము చచ్చి తీరుతుంది. పుట్టుక తెలియని దేహి, లేదా ఆత్మ ఎప్పుడూ చావదు. చచ్చే దేహాన్ని గూర్చి దుఃఖించ డానికి తాను దేహం కాదు. తానైన ఆత్మను గూర్చి దుఃఖించడానికి ఆత్మకు మరణం లేదు. ఇక దుఃఖం దేనికి? దుఃఖం లేనపుడు భయం ఎక్కడుంది? భయం లేని స్థితి అభయమే కదా! ఇలా విచారించుకొని, భయాన్ని తొలగించుకొని అభయ స్థితిలో ఉండటము కన్నా మించిన భాగ్య మేముంటుంది? అదే సంపద. దైవీ సంపద.

ప్రధాన దుఃఖ కారణమైన మరణ భీతిని ఎలాగైతే విచారంలో నివృత్తి చేసుకున్నామో, అలాగే అవాంతర దుఃఖ కారణాల వల్ల ఏర్పడే భయాన్ని కూడా అవగాహనలో తొలగించుకొని, అభయానుభూతిలో ఆనందంగా జీవన యాత్రను కొనసాగించాలి. అదే దైవీ ప్రకృతి.

ప్రియాప్రియ వియోగ సంయోగ రూపమైన దుఃఖానికి కారణమైన వాటిని వీక్షించడం చేత సంభవించే విషాదమే భయాన్ని కలిగిస్తుంది. ప్రియ మైనది పోతుందేమో, అప్రియ మైనది పోదేమో, లేక వస్తుందేమో అనే ఆలోచనే దుఃఖానికి, తద్వారా భయానికి కారణ మవుతూ ఉంటుంది. దీని నుండి విడిపడటమే అభయము.

ఈ ప్రపంచం ధర్మాలతో నడుస్తూ ఉంది. నియతితో కొనసాగుతూ ఉంది. ఇక్కడ ఎప్పుడు ఏది ఎలా జరగాలో అలా జరుగుతుంది. అలా జరగడం వెనుక కారణా లున్నాయి. కారణా లుండి జరిగే టప్పుడు అవి అనివార్యాలే గాని అసంభవాలు కావు. అసంభవా లైతే ఎందుకు జరుగుతాయి? వీటన్నిటి వెనుక, జ్ఞాన స్వరూపుడు, ప్రేమ మయుడు అయిన పరమేశ్వరుడే ఉన్నాడనే సత్యం అర్థమైతే, భక్తు లైన వారికి భయాలు దూర మౌతాయి. అభయం సంపదయై ఆశీర్వదిస్తుంది.

### భయము - భక్తి

భయ భక్తులు అనేవి ఒక సమాసంగా తెలుస్తూ ఉన్నా, ఒక మూస లోనివి మాత్రం కావు. ఎవరి వలన ఎవరికి భయమో నాకు తెలియదు కాని, ఎవరినీ భయపెట్టని వ్యక్తి, ఎవరి భయానికీ కారణం కానటువంటి వ్యక్తి ఎవరైనా ఉన్నారా అంటే, ఆయన ఎవరో కాదు, భగవంతుడే. పరమేశ్వరుడే. భయ హేతువు కాని వాడు, అభయ ప్రదానం చేసే వాడు ఒక్క భగవంతుడే.

ధర్మ రూపంలో ఉన్నది దైవమే. కర్మస్వేచ్ఛ మనకు ఉంది. కాని కర్మఫలాలను పరమేశ్వరుడే ధర్మ రూపంలో ఉండి మనకు అందిస్తాడు. కర్మ లైతే మన చేతుల్లో ఉన్నాయి కాని, కర్మఫలాలు మన అధీనంలో లేవు. నేడు మనం చేసే కర్మలే మనకు తెలుసు. కాని, కర్మఫలాలు నేటి కర్మలకు మాత్రమే పరిమిత మైనవి కావు. గత జన్మలకు సంబంధించిన కర్మల యొక్క ఫలాలు కూడా నేడు మనకు అందుతూ ఉంటాయి. అందుకనే, జీవితంలో అనుకోని ఫలితాలను చూచి నపుడు మనమే విస్మయం చెందుతూ ఉంటాము.

నేను ఇంత భాగ్యానికి అర్హుడ నేనా? అని ఒక్కొక్కసారి మనల్ని మనమే ప్రశ్నించుకుంటూ ఉంటాము. నా లాంటి వాడికి ఈ దుర్గతి ఏమిటి? అని కొన్ని సమయాలలో దిగ్భ్రాంతి చెందుతూ ఉంటాము. ఈ ఉత్సాహ నిరుత్సాహాలకు, సుఖదుఃఖాలకు కారణం ఒక్కటే. పరమేశ్వరు డంటే ఏమిటో మనకు తెలియక పోవడమే. పరమేశ్వరునికి సంబంధించిన జ్ఞానం క్షుణ్ణంగా మనకు లేక పోవడమే.

ప్రియాప్రియా లనేవి మనం సృష్టించు కున్నవి. రాగద్వేషాలు మనం తయారు చేసుకున్నవి. ఇక్కడే భయాలు చేరు వవుతాయి. అభయం అదృశ్య మవుతుంది. ఏది మనకు ప్రాప్తించినా, అది ఈశ్వర ప్రసాద మని మనకు అర్థమైతే, ఏది వచ్చినా అది ప్రియం గానే ఉంటుంది. ప్రియ మైనది దుఃఖాన్ని కలిగించదు. దుఃఖము లేనపుడు భయం ఉండదు. భయం లేని స్థితి అభయమే కదా! అభయ రూపుడైన భగవంతునితో నిత్య సంబంధాన్ని ఏర్పరచు కోవడం వల్ల భయాలు దూర మవుతాయి. అభయం అనుగ్రహించ బడుతుంది. ఇంతకు మించిన సంపద ఏముంది? అందుకే ఇది దైవీ సంపద. భయాన్ని దూరం చేసే భక్తి సంపద.

ప్రపంచంలో సంపద లున్న వారు ఎందరో ఉన్నారు. వారందరు భయాల నుండి దూర మయ్యారా? పై పెచ్చు సంపదలే వారికి సంతాపాలను తెచ్చి పెడుతున్నాయి. సంపదలున్న వారికి తమ సంతానాన్ని చూచినా భయమే. ***పుత్రా దపి ధన భాజాం భీతిః*** - ధనవంతులకి పుత్రుల వల్ల కూడా భయమే అన్నారు భజగోవిందంలో శ్రీ ఆదిశంకరులు. సంపద లన్నీ భయహేతువు లవుతూ ఉంటే, దైవీ సంపద అభయ ప్రదానం చేస్తూ ఉంది. అందుకనే భక్తుల్ని చూచి భయం భయపడుతూ ఉంటుంది.

**మంచి కానిది మాయ యైనది**
**చెరిగి పోవునది భవ బంధము**
**ఒరిగి పోనిది కరిగి పోనిది**
**తరగనిది భక్తి అందము**
**భవ బంధాలు భయ రూపము**
**భక్తి అందాలు అభయము**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

భగవంతుడు అభయ రూపుడు. అందుచేత భక్తులు కూడా అభయ స్థితి లోనే ఉండాలి. ఎలా జీవిస్తామో, ఏమౌతామో అనే భయం తెలియని వారు భక్తులు. ఇంత కాలం ఎవరి అనుగ్రహ ప్రసాదంతో జీవించామో, భవిష్యత్తులో కూడా ఆ కరుణా ఛత్రము క్రిందే జీవిస్తాము. ఎలా జీవిస్తామో అనే ఆలోచన ఎందు కొస్తుంది? చీమలు బ్రతుకు తున్నాయి. దోమలు బ్రతుకు తున్నాయి. చేపలు ఈదుతూ బ్రతుకు తున్నాయి. గువ్వలు ఎగురుతూ బ్రతుకు తున్నాయి. అన్నిటిని బ్రతికించే వాడు మన బ్రతుకును చూసుకోడా? ఇదే అభయం. దైవీ సంపద గల వారికి తరగని ఐశ్వర్యము.

### (౨) సత్త్వ సంశుద్ధి

సత్త్వ సంశుద్ధి అంటే అంతఃకరణ శుద్ధి. బుద్ధి శుద్ధి పడి ఉండటము. ఇక్కడ శుద్ధి అని సరిపెట్టకుండా సంశుద్ధి అని ఉపసర్గను చేర్చి చెప్పడం చేత, చక్కగా శుద్ధిపడి ఉండటము అని అర్థము. పరిశుద్ధముగా, అత్యంత నిర్మలంగా ఉండట మని భావము ***( సత్త్వస్య అంతఃకరణస్య సంశుద్ధిః ).*** ఆచార వ్యవహారాల యందు పవిత్రంగా ఉండటమే సత్త్వ సంశుద్ధి. రజోగుణ, తమోగుణ ప్రభావాల నుండి విడిపడి, రాగద్వేషాలు లేని చిత్తమును, విక్షేపము లేని మనస్సును, పరిశుద్ధమైన బుద్ధిని కలిగి ఉండటమే సత్త్వ సంశుద్ధి. ఆంతర్యము ఎప్పుడైతే ఇలా శుద్ధి పడి ఉంటుందో, బాహ్య వ్యవహారాల యందు ప్రవర్తన పవిత్రంగా ఉంటుంది. ఇతరు లను మోసం చేయడం, అంటే స్వార్థ ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని పరులను వంచించడం, మాయ చేసి మోసగించడం, వ్యవహారాలలో అనివార్యంగా అసత్యము పలకడం, ఇవన్నీ అశుద్ధము. ఈ విధమైన





అపవిత్ర వ్యవహారము లేని పరిశుద్ధ జీవనమే సత్త్వ సంశుద్ధికి నిదర్శనము ***( సంవ్యవహారేషు పరవంచన మాయానృతాది పరివర్జనం శుద్ధభావేన వ్యవహారః ఇత్యర్థః ).*** ఇతరులను మోసం చేయడం పరవంచన అయితే, కపట వర్తనముతో, అసత్య భాషణముతో, ఆలోచనకు ఆచరణకు మధ్య అంతరాన్ని సృష్టించుకొని తనను తాను మోసగించు కోవడము మాయా జీవనము. బాహ్యాభ్యంతరాలలో, అంటే మనస్సులో, మనుగడలో ఇలాంటి పరిస్థితి లేకుండా ఉండటమే సత్త్వ సంశుద్ధి. జ్ఞానప్రాప్తికి ప్రధానమైన సుగుణము.

### (3) జ్ఞాన యోగ వ్యవస్థితి

జ్ఞానము నందు ***( జ్ఞాన )***, యోగము నందు ***( యోగ )***, స్థిరత్వమును ***( వ్యవస్థితిః )*** కలిగి ఉండటము జ్ఞానయోగ వ్యవస్థితి. ఇక్కడ 'స్థితి' అనకుండా 'వ్యవస్థితి' అనడం చేత జ్ఞానము నందు, యోగము నందు సుస్థిరత్వమును కలిగి ఉండటాన్ని సూచించడ మైంది. ఆత్మజ్ఞానమును సముపార్జించ డానికి కావలసిన పరినిష్ఠ ఈ లక్షణ వైశిష్ట్యము.

శాస్త్రము ద్వారా, ఆచార్యుని ద్వారా ఆత్మ తత్త్వమును, అనగా జీవ జగత్పరాత్మలకు సంబంధించిన జ్ఞానమును పొందుట, లేదా తెలుసుకొనుటయే జ్ఞానము ***( జ్ఞానం శాస్త్రతః ఆచార్యతశ్చ ఆత్మాది పదార్థానామ్ అవగమః ).*** ఈ విధంగా శాస్త్రాచార్యోపదేశం కారణంగా ప్రాప్తించిన జ్ఞానాన్ని, ఇంద్రియాలను వశ పరచుకొని, మనస్సును నిగ్రహించి అనుభవం లోకి తెచ్చుకోవడమే యోగము ***( అవగతానామ్ ఇంద్రియా ద్యుపసంహారేణ ఏకాగ్రతయా స్వాత్మ సంవేద్యతాపాదనం యోగః ).***

ఇక్కడ జ్ఞానం అనేది విషయ జ్ఞానము కాదు. అంటే విషయ ప్రపంచానికి సంబంధించిన జ్ఞానము కాదు. విషయికి సంబంధించిన జ్ఞానము. తెలుసుకొనే వానిని గూర్చి తెలిపే జ్ఞానము. ఇది వ్యక్తిగతం కాదు. వ్యక్తి స్వరూప జ్ఞానము. అదేదో మనకై మనం ఊహించు కునేది కాదు. లేదా విచిత్రంగా ఒకనాడు మనకు కలిగే అనుభవమూ కాదు. మరొకరు చెబితేనే ప్రాప్తించే జ్ఞానము. అందుకే ఈ విషయంలో ఆచార్యునిది అగ్రస్థాన మైంది. శాస్త్రం ప్రమాణ మైంది.

ప్రమ అంటే జ్ఞానం. ఏ విషయానికి సంబంధించిన విషయ మైనా జ్ఞానమే. సంగీత శాస్త్రానికి సంబంధించిన విషయ మైతే సంగీత జ్ఞానము. వాస్తుకు సంబంధించిన విషయ మైతే వాస్తు జ్ఞానము. ప్రపంచంలో ఇలాంటి జ్ఞానాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. అవన్నీ స్థిర మైనవి కావు. మార్పు చెందే లక్షణాలు కలవి. అందుచేత అవి బాధితాలు. ఆత్మజ్ఞానము అలాంటిది కాదు. అది అబాధిత జ్ఞానము. ఏ కాలం లోను, ఏ పరిస్థితి లోను, ఏ ప్రదేశం లోను, ఎవరి చేతను నిషేధింప బడుటకు వీలు లేని జ్ఞానము. అట్టి జ్ఞానము ఆచార్యుడు అందించే ప్రమాణం ద్వారానే కలగాలి. మరో మార్గం లేదు. ఈ మార్గమే సంప్రదాయము. శిష్టాచార సంప్రదాయము.

గురుముఖతః అందిన ఆత్మజ్ఞానము స్వరూప జ్ఞానము కావడం చేత, ఆత్మానుభూతి కలగటానికి బాహ్య, అంతరేంద్రియ నిగ్రహము, సంశయ నివృత్తికి మననము కొనసాగించి, చివరగా నిదిధ్యాసనలో స్థిర పడాలి ***( వ్యవస్థితిః వ్యవస్థానం తన్నిష్ఠతా ).*** ఇది యోగము. ధ్యానయోగము. ప్రతిబంధకాలు లేని జ్ఞానమును స్వానుభవానికి తెచ్చుకొనే అంతరంగ సాధన. ఈ విధంగా జ్ఞానము నందు, యోగము నందు వ్యవస్థానం, అంటే తదేక నిష్ఠ ప్రముఖమైన, సాత్త్వికమైన దైవ సంపద ***( ఏషా ప్రధానా దైవీ సాత్త్వికీ సంపత్ ).***

### (4) దానము

ఇవ్వ దగిన దానిని ***( దాతవ్యం )*** ఇవ్వడము దానము. దానగుణము ఒక విశిష్ట లక్షణము. దైవీ సంపదకు సంబంధించిన లక్షణము. ఈ లక్షణము విశిష్ట మైనది కనుక, దీనిని విశిష్టం గానే అర్థం చేసుకోవాలి.

ఎవరి కైనా ఏదైనా ఇచ్చే టప్పుడు, 'మన మేదో ఉన్న వాళ్ళం, లేని వారికి ఇవ్వ గలిగే శక్తి ఉన్న వాళ్ళం' అనే భావనతో ఇస్తే అది దానం క్రిందికి రాదు. అదొక ప్రదర్శనము మాత్రమే. నిజమే. ఉన్నది కనుకనే ఇస్తున్నాం. లేని దానిని ఎలా ఇస్తాం? కాకపోతే, 'ఇవ్వ వలసింది ఉంది; అది ఇవ్వదగిన వారి కొరకే ఉంది' అనే భావనతో ఇవ్వడమే దానగుణ వైభవం. ఇక్కడే దానము దైవ సంపద అవుతుంది.

దీనంగా బిచ్చగాడు యాచిస్తే, బిచ్చం పెట్టే తల్లులు అంతకన్నా దీనత్వాన్ని ప్రదర్శిస్తూ దానం చేయడం మన సంస్కృతి లోనే చూస్తాం. బిచ్చగానికి దానం చేసి, రెండు చేతులు జోడించి నమస్కరిస్తారు తల్లులు. పెట్టేది బిచ్చ గాడికే అయినా, బిచ్చగాడిలో భగవంతుని చూడటం వల్లనే తల్లులు నమస్కరిస్తారు. ఇది వారి వ్యక్తిగత ఆధ్యాత్మిక సౌజన్యం. కాని, ఇందులో మరొక కోణం కూడా ఉంది. సామాజిక స్పృహ కూడా అంతర్లీనంగా ఉంది. దానం పుచ్చుకున్న వాడు దీనుడుగా వెను దిరిగి పోకూడదు. దీనత్వంతో బిచ్చగాడు యాచించినా, దాత నమస్కార సంస్కారాన్ని ప్రదర్శించి, అతని లోని దీనత్వాన్ని దూరం చేయడం సామాజిక స్పృహతో సాగించిన నిర్వాకము.

ఏది దానం చేసినా, ఎవరు దానం చేసినా, దానం చేసిన వాడికి నష్టము కలుగుతుంది అనేది స్పష్టము. అయినా ఉదారులు దాన గుణాన్ని వీడరు. అది నిజంగా నష్టమే అయితే, కలవారు ఎవరైనా చేతులు ముడుచుకుంటారే గాని దాతృత్వంతో ముందుకు చాచ లేరు. కనుక, దానం చేయడంలో నష్టం లేదు. పైగా, ఏ లాభమూ ఇవ్వలేని సంతృప్తిని దానం ప్రసాదిస్తుంది. అందుకే మన సంస్కృతిలో దానం విశిష్టమైన గుణంగా పరిగణింప బడింది. దానం అంత గొప్పది కనుకనే, కొందరు రాజ్యాలను త్యజిస్తే, మరి కొందరు శరీరాలను సైతం పరోపకారార్థం త్యాగం చేశారు. అలాంటి త్యాగాల ఫలంగా వారు అమృతత్వాన్ని పొంది తరించి పోతే, ప్రపంచం వారిని త్యాగధనులుగా కీర్తించి నీరాజనాలు పడుతూనే ఉంది.

దానం చేయడంలో బాహ్యానికి వస్తు రూపేణ నష్టం కనిపించ వచ్చు గాని, బుద్ధిలో భావ రూపంలో నష్ట మనేదే లేదు. నష్ట పోయా మనే భావన లేక పోవడమే గాక, ఏదో అనిర్వచనీయ మైన తృప్తి, ఆనందము మనస్సులో నిండి పోతాయి. అదే దాన గుణ వైభవము.

*దానం యథా శక్తి సంవిభాగః అన్నాదీనాం -* భోజ్యమైన అన్నము మొదలైన పదార్థములను యథోచితంగా ఇతరులకు పంచి పెట్టడం దానం అని ఆచార్యుల వారు వ్యాఖ్యానించారు.

మన సంస్కృతిలో జ్ఞానదానం తరువాత, అన్నదానముకే ప్రాముఖ్యము. కారణము ఒక్కటే. సంతృప్తి పూర్ణత్వము అనే దానిని ఈ రెండిటి లోనే చూడ గలము. జ్ఞానం ప్రాప్తిస్తే, మనిషి ఆత్మవిదుడై, ఆప్తకాముడై, నిత్యతృప్తు డౌతాడు. అందుచేత జ్ఞానదానానికే అగ్రతాంబూలము.

ఇక అన్నదానం విషయాని కొస్తే, అన్నం జ్ఞానం లాగా నిత్యతృప్తిని పంచలేక పోయినా, ఆ సమయానికి పూర్ణత్వమును ప్రసాదించి, తాత్కాలికంగా నైనా సరే తృప్తి పరచి, మనిషి చేత 'చాలు - తృప్తిగా ఉన్నాను' అని అనిపిస్తుంది. జ్ఞానదాన, అన్నదానాలలో తప్ప మరొక చోట 'చాలు' అనే పదమును విన లేము.

ధనమును ఎంత ఇచ్చినా, మనిషి 'చాలు' అని అనడు. అనుకోడు. మరి కొంత వస్తే బాగుండును అని ఆశిస్తాడు. పదవి వచ్చిందని సంతోష పడినా, అంత కన్నా పెద్ద పదవి వచ్చి ఉంటే బాగుండేది అని అను కుంటాడే గాని, తృప్తి చెందడు. జ్ఞానానికి అందరూ అర్హులు కాక పోవచ్చు. కాని, ఆకలి అందరికీ ఉన్నందున, అన్నాన్ని ఆరగించడానికి అందరూ అర్హులే. కనుక అందరినీ అందరూ తృప్తిపరచ గలిగింది ఒక్క అన్నదానం లోనే. అందువల్ల దానాలలో అన్నదానానికి విశిష్ట స్థానం లభించింది. ఈ కారణం చేతనే ఉదారు లందరూ





కలిసి అన్నదాన సత్రాలు నిర్మించారు. నిత్యాన్నదాన సత్రాలు నేడు కూడా విశేషంగా నడుస్తున్నాయి. సంపన్నులు, వదాన్యులు అన్య ప్రాంతాల కెళ్ళి అక్కడ తీర్థ క్షేత్రాలలో అన్నపూర్ణా సదనాలను ఏర్పాటు చేసి యాత్రికులకు అన్న వసతులు కల్పించి పుణ్యాన్ని ప్రోగు చేసుకుంటూ తృప్తి చెందు తుంటారు. ధనం ఎందరి వద్ద నైనా ఉండ వచ్చు. ధనవంతు లందరూ దానవంతులు కాలేరు. దానప్రియులు కాలేరు. దాన మనేది గుణ ప్రధాన మైనదే గాని ధనప్రధాన మైనది కాదు. అందుచేత దానగుణము దైవ సంపద కల వారి లోనే ఉంటుంది.

దాన మనే ఈ ప్రధాన లక్షణములో ముఖ్యంగా ఒక్క వాస్తవాన్ని సాధకులు గుర్తించాలి. ఇక్కడే దాన క్రియ దైవ దర్శనంగా మారుతుంది. దానం అనేది కేవలం ఒకరు మరొకరికి ఇచ్చేది కాదు. అలా చూస్తే, దానం ఇచ్చే వాడు, దానం పుచ్చుకొనే వాడు ఇద్దరే ఉంటారు. కాని, దానం అనేది ఇచ్చేది కాదు. సమర్పించేది. అలాగే పుచ్చుకొనేది కాదు. ప్రసాదంగా స్వీకరించేది. ఇది దానం విషయములో సంప్రదాయం మనకు నేర్పిన సదాచారము.

దాన మనేది ఇవ్వడము, పుచ్చుకోవడము మాత్రమే అనుకుంటే, ఇచ్చేవాడు, పుచ్చుకొనే వాడు ఇద్దరే ఉంటారు. దానాన్ని సమర్పణంగా భావిస్తే, ఆ ఇరువురితో పాటు మూడవ వ్యక్తి కూడా ఉంటాడు. వాస్తవానికి అతడు వ్యక్తి కాదు, అద్భుతమైన శక్తి. అతడే భగవంతుడు. గ్రహీత, అనుగ్రహీత మధ్య అదృశ్యంగా నిలబడి, ఇచ్చే వానిలో కర్తృత్వాన్ని, పుచ్చుకొనే వానిలో భోక్తృత్వాన్ని లేకుండా చేసి ఉభయులను ఆశీర్వదించే పరమేశ్వరుడు. ఇలా దాన మనే కార్యంలో దైవం ప్రవేశిస్తూ ఉన్నందున, దాన మనేది దైవ సంపదగా పరిగణింప బడింది.

### (5) దమము

దమము అంటే ఇంద్రియ నిగ్రహము. ముఖ్యంగా ఈ సందర్భములో బాహ్యేంద్రియ నిగ్రహము *(దమః చ బాహ్య కరణానామ్ ఉపశమః ).* ఇంద్రియాలను విషయాల నుండి విరమింప చేయడము. ఇది దమము. మరి, అంతరేంద్రియ నిగ్రహం విషయ మేమిటి అనే సంశయం కలగ వచ్చు. అది శమము. మనో నిగ్రహానికి సంబంధించింది. అది అంతఃకరణ ఉపశాంతి కనుక, దానిని 'శాన్తి' అనే పద్నాల్గవ లక్షణంలో చెబుతాడు *(అంతఃకరణస్య ఉపశమం శాంతిం వక్ష్యతి ).* హనుమంతుడు రచించిన పైశాచ భాష్యం మాత్రము దమమును అంతఃకరణము యొక్క ఉపరతిగా వ్యాఖ్యానించింది. అందుచేత 'శాంతి' లక్షణాన్ని ఇంద్రియ నిగ్రహంగా అభివర్ణించింది. ఎలాగైనా, ఇంద్రియ మనస్సులు రెండూ నియమింప బడటమే ప్రధానమైన విషయము.

ప్రస్తుతం దమము అంటే శ్రోత్రాది జ్ఞానేంద్రియాలను నియమించడము అని అర్థము. ఇంద్రియాలను, అంటే నేత్రాది ఇంద్రియాలను, కేవలం మాంస, రుధిర చర్మాదుల సముదాయంగా భావించడానికి వీలు లేదు. మనోశక్తి ఈ ఇంద్రియాల ద్వారానే బాహ్యం లోకి ప్రసరిస్తూ ఉంటుంది.

ఇంద్రియాలను ఇంద్రియ విషయాల నుండి వెనుకకు మరలించడమే దమము. యోగశాస్త్రంలో దీనినే ప్రత్యాహార మంటారు. మనస్సులో ఎలాంటి మార్పులు కలుగుతూ ఉంటాయో, అలాంటి మార్పులే ఇంద్రియా లకు కూడా కలుగుతూ ఉంటాయి. కోపము అనేది మనో వికారము. కాని, మనం పరిశీలించి చూస్తే, కోప మొచ్చిన వ్యక్తి కళ్ళు ఎర్రబడతాయి. ఇంద్రియ మనస్సులు అన్నీ గుణ వికారాలే కనుక, గుణ కార్య మైనది ఏదీ గుణ లక్షణాలైన పరిణామాలకు విలక్షణంగా ఉండ లేదు. కాకపోతే, ప్రత్యక్షంగా మనస్సును నిగ్రహించే అవకాశము లేనపుడు, ముందుగా ఇంద్రియాలను నియమించ గలిగితే, ఆ తరువాత మెల్లగా చిత్తమును నిరోధించ వచ్చు. అందుచేత శమము కన్నా ముందు దమము చెప్పబడింది. దమము అనేది నిగ్రహం కావడం చేత అది దైవ సంపద లక్షణము.

ఇంద్రియాలు ఎప్పుడైనా ప్రేయో మార్గంలో పయనిస్తాయే గాని, శ్రేయో మార్గంలో చరించవు. వాటికి కావలసిన విషయాల్ని కోరుకుంటాయే గాని, మన అవసరాల్ని పట్టించుకోవు. అవి సుఖ పడటానికి ఏవి భోగ్యాలో వాటిని పట్టించుకుంటాయే గాని, మనం హాయిగా ఉండటానికి ఏవి యోగ్యాలో వాటిని గూర్చి చెప్పినా పట్టించుకోవు.

అందుచేత ఇంద్రియాల విషయంలో సాధకులు జాగరూకులై ఉండాలి. పాండిత్యాలు పలాయనం చిత్తగించేది ఇక్కడే.

***లోకము లన్నియున్ గడియ లోన జయించిన వాడ వింద్రియ నీకము జిత్తమున్ గెలువ నేరవు*** - 'తండ్రీ! లోకా లన్నిటినీ క్షణాలలో జయించావు. కానీ, బాహ్య శత్రువుల్ని జయించిన నీవు, నీ అంతశ్శత్రువు లైన ఇంద్రియ మనస్సులను జయించ లేక ఓడి పోయావు' అన్నాడు భాగవతంలో ప్రహ్లాదుడు.

పాము గది లోకి ప్రవేశించిందని తెలియ గానే ఆ గదిలో ఉండే వారు ఎలా జీవిస్తారు? ఇంద్రియాల విషయంలో అందరూ అలా జాగరూకులై ఉండాలి. పాముకు పండిత పామర తారతమ్యం ఉంటుందా? ఇంద్రియాలకూ అంతే. ఈ వాస్తవాన్ని గ్రహించి సర్వులూ ఇంద్రియాలను నియమించి దమమును పాటించాలి. ఇది అందరికీ సాధ్య పడదు. ఎవరి కైతే సాధ్య పడుతుందో వారు దైవీ సంపదను కలిగి యున్నారని అర్థము.

**(6) యజ్ఞము**

యజ్ఞము అంటే ఇక్కడ శ్రౌత యజ్ఞములు, స్మార్త యజ్ఞములు, రెండూ అని అర్థము. వేదోక్త మైన అగ్నిహోత్రాది యజ్ఞములు శ్రౌత యజ్ఞములు. అంటే శ్రుతుల చేత ప్రతిపాదించ బడినవి ***(యజ్ఞః చ శ్రౌతః అగ్ని హోత్రాది).***

అలాగే దేవ పూజాదికాలు స్మార్త యజ్ఞాలు. అంటే స్మృతులు, పురాణాదుల చేత ప్రతిపాదించ బడినవి. పూజ, ధ్యానము, జపము, సంకీర్తనము మొదలైన వన్నీ స్మార్తములే. దైవ సంబంధమైన, అలౌకిక మైన ఈ పవిత్ర కార్యాలను అందరూ అనుష్ఠించ లేరు. ఆచరించ లేరు. ఎవరిలో అయితే దైవ సంపద ఉంటుందో వారే యజ్ఞాది కార్యాలు నిర్వహించ గలుగుతారు. కనుక, యజ్ఞము అనే ఈ ఆరవ లక్షణము కూడా దైవీ సంపదలో చేరి పోయింది.

**(7) స్వాధ్యాయము**

'అధ్యాయః' అంటే అధ్యయనము, లేదా వేదాధ్యయనము అని అర్థము. 'స్వ' అంటే తాను, లేదా ఆత్మ అని అర్థము. స్వాధ్యాయము అంటే తనకు సంబంధించిన విషయమును అధ్యయనము చేయుట. తనకు సంబంధించిన విషయము అంటే, ఆత్మ విషయమే కనుక, ఆత్మ విషయమును తెలిపే శ్రుతులను, అంటే వేదాలను అధ్యయనం చేయడము స్వాధ్యాయము అవుతుంది ***(ఋగ్వేదాది అధ్యయనం స్వాధ్యాయః).***

ఈ విధంగా స్వాధ్యాయము యొక్క అర్థమును స్వీకరిస్తే, వేదాంతము లైన ఉపనిషత్తులే గాక, ఆత్మ విషయాన్ని ఎరుక పరచే భగవద్గీత, బ్రహ్మసూత్రాలు, రామాయణ, భారత, భాగవత గ్రంథములు, అష్టాదశ పురాణాలు మొదలైన గ్రంథాలను శ్రద్ధతో పఠించడం స్వాధ్యాయమే అవుతుంది.

***పురుషార్థ ఉపదేశత్వాత్ శ్రుతీనామ్*** - మానవుడు సాధించ వలసిన వివిధ పురుషార్థములకు సంబంధించిన సాధనలను శ్రుతులు ఉపదేశిస్తాయి కనుక సర్వులకు శ్రుతులే ప్రమాణములు, శరణ్యములు అన్నారు తైత్తిరీయోపనిష ద్భాష్యంలో శ్రీ శంకరాచార్యులు. కనుక వేదాధ్యయనము ముముక్షువులకు అనివార్యము.





ఆచార్య సన్నిధిలో వేదాధ్యయనమును పూర్తి చేసుకొనిన శిష్యునికి గురువు తైత్తిరీయ శిక్షావల్లిలో ఇలా ఉపదేశించాడు.

***సత్యం వద. ధర్మం చర. స్వాధ్యాయా న్మా ప్రమదః*** - సత్యమునే పలుకు. ధర్మమునే అనుష్ఠించు. స్వాధ్యాయ మును విడువకు అని ఆదేశించాడు. ***స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్*** - స్వాధ్యాయ ప్రవచనముల నుండి ఎట్టి పరిస్థితుల లోను తప్పుకోకు అని ఆజ్ఞాపించాడు. అంటే స్వాధ్యాయ మనేది అను నిత్యము అవశ్యం అనుష్ఠేయము అని అర్థము. అందుచేతనే శ్రీ ఆదిశంకరులు సాధన పంచకం లోని నలభై ఉపదేశాలలో ప్రథమోపదేశము ***వేదో నిత్య మధీయతాం*** - వేదమును ప్రతి నిత్యము అధ్యయనం చెయ్యాలి అన్నారు.

శ్రుతి, స్మృతి, పురాణాది గ్రంథాలు ప్రామాణికాలు కనుక, అలౌకిక విషయ సంబంధ మైనవి కనుక వాటిని అధ్యయనం చేయడం వల్ల దృష్టాదృష్ట ఫలాలు ప్రాప్తిస్తాయి. వేదాధ్యయనం పూర్తి కాగానే మనస్సు ఎంతో ప్రశాంతంగా ఉంటుంది. ఇది దృష్టఫలం. వేదాధ్యయనం అలౌకిక కర్మ కనుక, దానికి లభించే అలౌకిక ఫలం, ఈశ్వరానుగ్రహం ఏదైతే ఉందో అది అదృష్ట ఫలం. ***స్వాధ్యాయః వేదాధ్యయనం అదృష్టార్థః*** అన్నారు భాష్యకారులు శ్రీశంకరులు. స్వాధ్యాయాన్ని అందుకనే బ్రహ్మయజ్ఞముగా అభివర్ణించారు ఆనందగిరి.

ఈ సందర్భములో మీకు ఒక సందేహం అంకురించి ఉంటుంది. పారాయణం అధ్యయనం క్రిందికి రాదా? అని. ఏ పారాయణం? అనేది శంక. దీనిని విస్తరించి చెప్పడం కన్నా, ఆత్మ విషయాన్ని, అంటే బ్రహ్మాత్మ జ్ఞానాన్ని ప్రతిపాదించే శ్రుతి స్మృతి పురాణాదులలో పారాయణానికి అనుకూలంగా ఉన్న వన్నీ అధ్యయనం క్రిందికే వస్తా యనేది నా ప్రగాఢ విశ్వాసము అని నిశ్చయంగా చెప్పగలను.

మరి, విష్ణుసహస్రనామం? విష్ణుసహస్రనామమే కాదు, శివసహస్రనామం, లలితాసహస్రనామం మొద లైన వన్నీ అధ్యయనం క్రిందికి వచ్చే పారాయణాలే. అయితే వ్యక్తులు, అంటే మహాత్ముల చరిత్రలు నిత్యము పఠించడము స్వాధ్యాయ మవుతుందా? కాదు. అలా కావడానికి వీల్లేదు.

ఈ విషయాన్నే ఇటీవల ఒక భక్తుడు నా వద్ద ప్రస్తావిస్తూ, 'నేను చెప్పేది మీరు రచించిన భక్తుల చరిత్రలు గల చంద్రభాగా తరంగాల విషయము స్వామీ!' అన్నాడు. నేను అతనికి స్పష్టంగా వివరించి చెప్పాను. 'చంద్రభాగా తరంగాలు పఠించ దగిన గ్రంథమే గాని పారాయణ గ్రంథము కాదు' అని నొక్కి వక్కాణించాను. 'చంద్రభాగా తరంగాలు గ్రంథంలో మహాత్ముల చరిత్రలు ఉన్నాయి. చదువుకో. అర్థం చేసుకో. అందులో సద్విషయాల్ని గ్రహించు. అనుసరించ దగినవి అనుసరించు. ఆచరించు. అంతేగాని, రోజూ మహాత్ముల గాథల్ని చదవడ మెందుకు? ఒకవేళ నీకు స్మృతి సరిగా లేకపోతే, విషయం జ్ఞాపకం రాకపోతే, మళ్ళీ ఒకసారి గ్రంథాన్ని తెరచి చూసుకో; అదీ నీకు అవసర మనిపిస్తే. అంతేగాని, ప్రతి రోజూ దానిని పారాయణం చేయడం దేనికి? చేస్తే చేసుకో. కాని, నువ్వు ముముక్షువుగా ఏ ఫలితాన్ని ఊహిస్తున్నావో, అది మాత్రం చరిత్రలు పారాయణం చేయడం వల్ల రాదని శాస్త్రీయంగా విశ్వసించే వారిలో నేనూ ఒకణ్ణి' అని చెప్పాను.

ఇది కలియుగం. మాటలే మంత్రాలుగా ప్రచారాలు విరివిగా సాగే కాలం. విచారానికి నోచుకోని విషయాలే బహుళ ప్రచారాలకు నోచుకుంటున్న విషమ సమయం. ముముక్షువు లైన వారు సంప్రదాయ గాడిలో సాగి పోవడమే శ్రేయస్కరం అని నా అభిప్రాయం. అభిమతం. అయినా ఎవరి ఇష్టాలు వారివి. ఎవ్వరూ ఎవరికీ అడ్డు లేరు.

**ప్రమాణ భూతాయాః శ్రుతేః పురుషస్య ఇవ వ్యాజానుపపత్తేః**

'శ్రుతులు, లేదా వేదాలు ప్రమాణ భూతాలు కనుక, మానవుల మాటల లాగా వ్యాజములు కావు' అని

శ్రీశంకరాచార్య స్వామి బృహదారణ్యకోపనిషత్ భాష్యంలో అనుగ్రహ వాక్యాన్ని ప్రసాదించారు *(4 - 4 - 7).*

'వ్యాజము' అనే పదాన్ని సర్వులూ గ్రహించ డానికి వీలుగా కొద్దిగా విశద పరుస్తాను. **వ్యజ్యతే క్షిప్యతే అనేన ఇతి వ్యాజః -** స్వప్రయోజనాన్ని కాంక్షించి ఒక దానికి బదులుగా మరొకటి చేయుట వ్యాజము. ఇతరులను మోసం చేయుట వ్యాజము. ఇతరులను మోసం చేయడమే ఫలముగా కలిగిన కపట వర్తనము అని అమర సింహుని అమృత వివరణము. కనుక, మోక్షాన్ని ప్రగాఢంగా కాంక్షించే ముముక్షువులకు, మతులను కలిగిన మనుషుల భావాలకు బానిసలు కాకుండా, శ్రుతులను వివరించే యతులను, గురువులను ఆశ్రయించమని సంప్రదాయ సందేశము.

స్వాధ్యాయము పరివర్తనను తెచ్చి ప్రవర్తనను తీర్చి దిద్దడమే గాక బ్రతుకునే అందంగా మలుపు త్రిప్పుతుంది. దానితో పాటు, అధ్యయన పరునిలో ఒక వైపు జ్ఞానాన్ని పెంపొందిస్తూ, మరొక వైపు ఋషి ఋణం నుండి విముక్తుణ్ణి చేస్తుంది. ముముక్షువు మోక్షాలయంలో ప్రవేశించ డానికి ప్రధాన ద్వారము స్వాధ్యాయమే. అందుచేత స్వాధ్యాయము దైవ సంపద అయింది.

**(8) తపస్సు**

తపింప చేసేది తపస్సు ***( తపతీతి తపః , తప సంతాపే ).*** భగవంతుని కొరకు, మోక్షము కొరకు, ధర్మము కొరకు తపించడం తపస్సు. తపస్సు కాయిక మని, వాచిక మని, మానస మని మూడు విధాలు. ఈ విషయాలను తరువాత అధ్యాయంలో భగవానుడు సమగ్రంగా చర్చిస్తాడు. తపస్సు సర్వ కల్మషాలను పోగొడుతుంది. దేహేంద్రియ మనోబుద్ధులను శుద్ధి చేసి వ్యక్తిని పవిత్రుణ్ణి చేస్తుంది ***( తపసా కిల్బిషం హన్తి ).*** శ్రీమద్రామాయణము సమస్తమూ తపస్సు యొక్క స్వరూపము. ***తపః స్వాధ్యాయ నిరతం*** అనే శ్లోకం తోనే రామాయణం ఆరంభ మవుతుంది. తపస్సు అనే పదంతో బాలకాండము ప్రారంభమై ***ప్రవర్ధతామ్ -*** వృద్ధి చెందు గాక! అనే పదముతో రామాయణము యుద్ధకాండము సమాప్త మవుతుంది. తపస్సు అనేది కేవలం తపించడమే కాదు. తపస్సు జ్ఞాన ప్రధాన మైంది. తపస్సు చేతనే సృష్టి కార్యాన్ని బ్రహ్మదేవుడు చేసినట్లు తైత్తిరీయ శ్రుతి ***( తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ ).*** ఏడవ లక్షణమైన స్వాధ్యాయాన్ని, ఎనిమిదవ లక్షణమైన ఈ తపస్సును కలిపి క్రియాయోగంగా యోగదర్శనంలో సూత్రబద్ధం చేశాడు పతంజలి మహర్షి ***( సూ॥ తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని క్రియాయోగః -*** సాధన పాదము - ప్రథమ సూత్రము ). అందుచేత విశిష్ట సాధన అయిన తపస్సు దైవీ సంపదకు సంబంధించినది.

**(9) ఆర్జవమ్**

ఆర్జవము అంటే ఋజు భావము. ఋజు వర్తనము. ఎల్లప్పుడు ఋజుత్వమును కలిగి ఉండటము ఆర్జవము ***( ఆర్జవమ్ ఋజుత్వం సర్వదా ).*** కుటిలత్వము లేక పోవడమే ఋజుత్వము. ఈ విషయాన్ని క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగంలో అమానిత్వాది జ్ఞాన లక్షణాలను చర్చించి నప్పుడు చెప్పు కున్నాము. ఆలోచనలో గాని, మాటలో గాని, క్రియలో గాని ఏ విధమైన వక్రత లేకుండా ఉండటము ఆర్జవము. త్రికరణ శుద్ధితో వర్తించడము ఋజుత్వము. మాయ తెలియని జీవనము. సరళమైన స్వభావము. కనుక, ఆర్జవము దైవ సంపద.

*దైవీ ప్రకృతికి సంబంధించిన మరో పది లక్షణాలను తరువాత శ్లోకంలో చెబుతున్నాడు.*

**అహింసా సత్య మక్రోధ స్త్యాగః శాన్తి రపైశునమ్ ।**
**దయా భూతే ష్వలోలుప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్ ॥** 2





***అహింసా-సత్యం-అక్రోధః-త్యాగః-శాంతిః-అపైశునం***
***దయా-భూతేషు-అలోలుప్త్వం-మార్దవం-హ్రీః-అచాపలం***

| | | | |
|---|---|---|---|
| అహింసా | = అహింసయు | భూతేషు | = భూతముల యందు |
| సత్యం | = సత్యము | దయా | = దయ |
| అక్రోధః | = క్రోధము లేకుండుట | అలోలుప్త్వం | = లోలత్వము లేకుండుట |
| త్యాగః | = త్యాగము | మార్దవం | = మృదుత్వము |
| శాంతిః | = శాంత స్వభావము | హ్రీః | = సిగ్గు |
| అపైశునం | = చాడీలు చెప్ప కుండుట | అచాపలం | = చపలత్వము లేకుండుట |

**అర్జునా! అహింస, సత్యము, క్రోధము లేకుండుట, త్యాగము, శాంతస్వభావము, చాడీలు చెప్పకుండుట, ప్రాణుల యందు దయ, అసంగత్వము, మృదుత్వము, సిగ్గు, చపలత్వము లేకుండుట - దైవీ సంపదతో జన్మించిన వారిలో ఇవి కనిపిస్తాయి.**

**వ్యాఖ్య**

**(10) అహింస**

పీడించడము హింస. అలా పీడించక పోవడం, హింసించక పోవడం అహింస. త్రికరణ శుద్ధిగా పరులను బాధించకుండా ఉండటము అహింస అవుతుంది ***( అహింసా అహింసనమ్ పీడా వర్జనమ్ ).***

పరులను పీడించకుండా ఉండటము అహింస అంటున్నాము. మరి, తనను తాను హింసించుకో వచ్చా? ఆత్మ పీడనం, లేదా ఆత్మహింస ఉచిత మేనా? కానే కాదు. అహింస అనేది అందుకే వ్రత మైంది. అహింసా పరుడు పరులనే కాదు, తనను కూడా తాను హింసించుకో లేడు. హింసించడ మనే గుణము ఉన్నప్పుడు మాత్రమే తనను తాను హింసించుకో గలడు. తనను తాను హింసించుకొనే వాడు పరులను హింసించకుండా ఎలా ఉంటాడు?

మనిషి లోని ద్వంద్వ వైఖరి బుద్ధిలో ఘర్షణను సృష్టిస్తుంది. వ్యక్తిని దారుణంగా బాధిస్తుంది. అదంతా హింసే. కనుక, అహింసను పూర్ణ స్థాయిలో ఆచరించ గలిగే వాడు జ్ఞాని ఒక్కడే. సాధకులు పరమ పవిత్రమైన ఈ అహింస అనే దైవ లక్షణాన్ని వ్రత రూపంగా స్వీకరించి, త్రికరణ శుద్ధితో అనుష్ఠించాలి.

హింసించడ మంటే కత్తులతో గాయ పరచడమే కాదు, కర్కశమైన వాక్కులతో బాధించడము కూడా హింసే. మనిషిని బాకులతో పొడవ నవసరం లేదు. ఎత్తి పొడుపు మాటలతో బాధించడం కూడా హింసే. మరొక అడుగు ముందు కేస్తే, చేతల ద్వారా, మాటల ద్వారా హింసించడమే కాదు, హింసించాలి అనే భావనను కలిగి ఉండటము కూడా హింసే. మనస్సు లోని సంకల్పాలే మనిషిలో కర్మలుగా వ్యక్త మవుతా యనే సత్యాన్ని సాధకులు మరువ కూడదు.

మనో వాక్కాయ కర్మల ద్వారా ఏ విధమైన హింస జరగకుండా చూసుకోవడము అహింస అవుతుంది. ఇది కేవలం మానవుల విషయం లోనే గాక, సర్వ ప్రాణుల యందును కలిగి ఉండాలి. అప్పుడే అహింసకు పరమార్థం. పశుపక్ష్యాదులనే కాకుండా వృక్ష లతాదులను కూడా కష్టపెట్ట కూడదు. అది కూడా హింసే. వాటిలో కూడా ప్రాణ ముంది అన్నది శాస్త్రం.

నేటి జీవన స్థితి గతులను దృష్టిలో పెట్టుకొని విశ్లేషిస్తే, పర్యావరణ సమస్యలు, వన్యప్రాణి సంరక్షణ

మొదలైన విషయాలపై ఎంతెంత పెద్ద చర్చలు జరుగుతూ ఉన్నాయో మనకు తెలుసు. కాని, మన పూర్వీకులకు ఇవి సమస్యలే కావు. వీటిని గూర్చి చర్చించ వలసిన అవసరమే వారికి లేక పోయింది. కారణం, వారి జీవితాలలో గొప్ప ఐశ్వర్యం ఉండింది. విశిష్టమైన సంపద ఉండింది. అదే దైవ సంపద. అహింసా ప్రవృత్తి. అందుచేతనే, దైవీ ప్రకృతికి సంబంధించిన అహింసను ఉత్తమ మైన ధర్మంగా వేదం అభివర్ణించింది ***(అహింసా పరమో ధర్మః)***.

హింసా ప్రవృత్తి వల్ల మనిషి శాంతిని కోల్పోతాడు. ప్రశాంతతకు దూర మవుతాడు. హితులను అహితులుగా మార్చేది హింస అయితే, అహితుల్ని సైతం హితులుగా, సన్నిహితులుగా చేసేది అహింస. అహింసా వ్రతాన్ని పాలించే మహాత్ముల సన్నిధిలో మానవులే కాదు, జంతువులు సైతం వైరాన్ని మరచి పోతాయి అని యోగ దర్శనంలో అద్భుతంగా ప్రవచించాడు పతంజలి మహర్షి.

**సూ॥ అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః** *(2 వ పా - 35 వ సూ )*

వ్యక్తిలో అహింస సుస్థిర మైనపుడు, అట్టి మహాత్ముని సన్నిధిలో సహజ శత్రుత్వము కలిగిన మార్జాల మూషికాదులు, సర్పమయూరాదులు, మయూర శునకాదులు, మృగ వ్యాఘ్రాదులు పరస్పర వైరుధ్యాల కారణంగా ప్రాప్తించిన భయ క్రోధాదుల నుండి సంపూర్ణంగా విముక్తిని పొందుతాయి. అహింసా ప్రవృత్తి వైభవాన్ని చెప్పడానికి ఇంతకు మించి ఏమి కావాలి? అందుకే అహింసను దైవ సంపదగా గీతా శాస్త్రం వర్ణిస్తూ ఉంది.

**(11) సత్యము**

ఇక్కడ సత్యము అంటే సత్య భాషణము. యథార్థ భాషణము. ఉన్న దున్నట్లు భాషించడము. కల్తీ లేని, కల్పన గాని విషయాలను మాట్లాడటము. అందులో అసత్యము, అబద్ధము లేకుండా ఉండటము సత్య భాషణము ***( సత్యమ్, అప్రియ అనృత వర్జితం యథా భూతార్థ వచనమ్ )***.

అహింసను సత్యము అంటి పెట్టుకుని ఉంటుంది. ప్రాణులకు ఏ విధమైన హింస కలగకుండా భాషించడము సత్య భాషణము. సత్యము యథార్థంగా ఉండటమే కాదు, ప్రియంగా కూడా ఉండాలి. ప్రియంగా ఉండాలి కదా అని అసత్యాన్ని జోడించ కూడదు. లేనిపోనివి కల్పించ కూడదు. కపోల కల్పితాలు సత్యాలు కాలేవు. సత్య భాషణము అంటే ఏమిటో, అది ఎలా ఉండాలో మన ధర్మ శాస్త్రాలు సుస్పష్టంగా ప్రవచించాయి.

***సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్***
***న బ్రూయాత్ సత్యం అప్రియమ్***
***ప్రియం చ అనృతం న బ్రూయాత్ ॥***

సత్యమునే భాషించాలి. అది కూడా ప్రియంగా ఉండాలి. అప్రియంగా ఉండే దానిని, అది సత్యమే అయినా చెప్పకూడదు (ప్రత్యేకతలు చర్చనీయాంశాలు కావు). ప్రియంగా ఉందని సత్యము కాని దానిని, అసత్యమైన దానిని భాషించ కూడదు.

అనర్థ ఫలాల నిచ్చే విషయాలను ఆచరించడం దేనికి? అసత్య భాషణం అనర్థాన్ని సృష్టిస్తుంది. వ్యక్తి విలువలను హరిస్తుంది. బ్రతుకును ఓటమి వైపు నడిపిస్తుంది. అసత్యపరునికి ఏనాడైనా అపజయం తప్పదు. అందుకనే వేదమాత ***సత్య మేవ జయతే*** అన్నది.

భాషించే విషయము సత్యముగా, ప్రియంగా ఉండటమే గాక, ఉపయుక్తంగా కూడా ఉండాలి. ఇది





చాలా ప్రధానమైన విషయము. ఈ రోజుల్లో ఇద్దరు కలిస్తే చాలు. 'రండి. ఏదో ఒకటి చెప్పుకుందాం' అని మొదలెడతారు. ఇంతకు మించిన దురదృష్టం మరొక టుంటుందని నేను అనుకోను.

చెప్ప వలసింది చెప్పడం కర్తవ్యము. చెప్పుకో దగింది చెప్పుకోవడం ప్రగతి సూచకం. ఏదో ఒకటి చెప్పుకోవడం అప్రస్తుతం. అనర్థ దాయకం. ఏదో ఒకటి చెప్పుకోవాలి. ఇదొక దురద. నోటి దురద. అజ్ఞాన బురద. ఏదో ఒకటి ఏమి చెప్పుకుంటారు? పరులను గూర్చి చర్చించు కోవడం తప్పు! పరులను గూర్చి చర్చించు కోవడానికి మనకు వాళ్ళను గూర్చి ఏమి తెలుసు గనుక? యథార్థం చెప్పాలంటే వాళ్ళను గూర్చి వాళ్ళకే తెలియదు. ఇక మనకు తెలిసే దేముంటుంది? ఇతరుల విషయాలను అలా ఉంచండి. మనల్ని గూర్చి మనకు తెలుసా? మనల్ని గూర్చే మనకు తెలియ నపుడు, ఇతరులను గూర్చి మనకు ఏమి తెలుస్తుంది? తెలియని దానిని పరస్పరం భాషించుకొని పోషించుకొనే దేముంటుంది? ఈర్ష్యలను, అసూయలను వ్యక్తం చేసుకొని బుద్ధుల్ని పాడు చేసుకోవడం తప్పు!

కనుక అప్రస్తుత ప్రసంగాలు అనర్థాలను సృష్టిస్తాయి. అవసరాలను దృష్టిలో ఉంచుకొని ఋజుత్వంతో భాషించ గలిగితే, అట్టి భాషణము సత్య భాషణం అవడమే గాక, ప్రియం గాను, అందం గాను, ఆహ్లాదకరం గాను ఉంటుంది.

సత్య భాషణము అనేది సామాన్యమైన విషయం కాదు. నాయనా! కాకులకు పెడుతూ ఉండు. ఒక రోజు హంసలు నిన్ను సమీపిస్తాయి అని చెప్పే వారు మన పెద్దలు. సత్య భాషణము కష్టమే అయినా, జాగ్రత్తగా ఆలోచిస్తూ ఆచరించ గలిగితే, అది జీవితంలో అద్భుతమైన ఫలితాలను అందిస్తుంది.

సత్య భాషణం చేసే వ్యక్తికి కాల క్రమేణ వాక్శుద్ధి ఏర్పడుతుంది. ఆ తరువాత, వాక్శక్తి కలుగుతుంది. అతడు ఏది పలికితే అది జరిగి తీరుతుంది. అతడు నోటితో ఆశీర్వదిస్తే చాలు. అన్నీ శుభాలే జరుగుతాయి.

*ఆరోగ్యం ప్రాప్నుహి* - నాయనా! నువ్వు ఆరోగ్యాన్ని పొందెదవు గాక! అని సత్యవాది పలికాడు అంటే, అట్టి ఆశీర్వాదాన్ని అందుకొనిన అదృష్టవంతుడు తప్పక ఆరోగ్యవంతుడు అవుతాడు. సత్య స్వరూపులు, సత్యవాదు లైన కొందరు మహాత్ములు ***దీర్ఘ సుమంగళీ భవ!*** అని నమస్కరించిన తల్లులను ఆశీర్వదిస్తే, ఆ తల్లుల భర్తలు మృత్యు ముఖంలో ప్రవేశించే స్థితిలో పునర్జీవితులై, ఆయురారోగ్యాలతో చాలా కాలం వర్ధిల్లి నట్లు ఎన్నో సత్య కథనాలు మన సంస్కృతిలో ఆవిష్కృత మయ్యాయి.

**సూ ॥ సత్య ప్రతిష్ఠాయాం క్రియా ఫలాశ్రయత్వమ్ ।**

సత్యములో సుప్రతిష్ఠు లైతే, అతని భాషణములు ఫలాశ్రయా లవుతాయి. సత్య ప్రతిష్ఠ కల మహాత్ముల వాక్కులు నిష్ఫలం కావు. అవి అమోఘంగా, అద్భుతంగా ఫలప్రద మవుతాయి అని పతంజలి రాజయోగము.

**(12) అక్రోధము**

క్రోధము రాకుండా చూసుకోవడము అక్రోధము. దీనిని కూడా సూక్ష్మంగా అర్థం చేసుకోవాలి. క్రోధము లేకుండా చూసుకోవడము అక్రోధమా? లేక, క్రోధము రాకుండా జాగ్రత్త పడటము అక్రోధమా?

క్రోధము అసలే లేకుండా పోవడ మనేది ఆత్మజ్ఞాని, బ్రహ్మవిదుడైన స్థితప్రజ్ఞునికే సాధ్యం. ప్రస్తుతం మనం దైవీ సంపదకు సంబంధించిన లక్షణాలను గురించి చర్చించు కుంటున్నాం. ఇది సాధనావస్థకు సంబంధించిన విషయమే గాని, సిద్ధావస్థకు సంబంధించింది కాదు. సాధకుడు క్రోధము రాకుండా జాగ్రత్త పడ గలడే గాని, సంపూర్ణంగా క్రోధంపై విజయాన్ని సాధించ లేడు. కనుక క్రోధం కలిగే అవకాశం ఉన్నప్పుడు,

అవగాహనతో, ముందు జాగ్రత్తతో క్రోధాన్ని రానివ్వకుండా చూసుకొని, మనస్సు లోని ప్రశాంతతను భగ్నం కాకుండా రక్షించు కోవడమే ఇక్కడ అక్రోధము.

***పరైః అకృష్టస్య అభిహతస్య వా ప్రాప్తస్య క్రోధస్య ఉపశమనమ్ అక్రోధః*** - ఇతరులు దూషించినా, తిట్టినా, కొట్టినా, బాధించినా, రావడానికి అవకాశం ఉన్న క్రోధాన్ని రాకుండా చేసుకోవడం, లేదా వేగాన్ని తగ్గించు కోవడము, అలా ఉపశమించేటట్లు చూసుకోవడము అక్రోధము. ఈ సుగుణము జీవితంలో తిమిరాన్ని తరిమి తేజస్సును నింపుతుంది. అందుచేత ఇది దైవ సంపద.

***క్రోధః ప్రాణ హరః*** - క్రోధము ప్రాణమును హరిస్తుంది అన్నది శ్రీమద్రామాయణము. అంటే, విషతుల్య మైనది అని అర్థము. క్రోధము పాము కాటు వలె విషయుక్తము. మానవుని మూర్తిమత్వమును క్రోధం చావు దెబ్బ కొడుతుంది. క్రోధం ముందు వెనుకలు చూడదు. పెద్ద చిన్న అని ఆలోచించదు. ఏ భాష మాట్లాడు తుందో అర్థం కాదు. పట్టు తప్పి ప్రవర్తిస్తుంది. ఆ తరువాత మనిషిని పశ్చాత్తాపంతో కుమిలి పోయేలా, కుంచుకు పోయేలా చేస్తుంది.

క్రోధం యొక్క కోరల్లో చిక్కి ఎన్నో కుటుంబాలు ముక్కలై పోయాయి. మరెన్నో సంబంధ బాంధవ్యాలు తెగి పోయాయి. క్రోధము దూరాలను సృష్టిస్తుంది. భారాలను పెంచుతుంది. మనల్ని మనం మరచి పోయేలా చేస్తుంది. మానవత్వాన్ని దెబ్బ కొడుతుంది. మనిషిలో పశుత్వాన్ని తెచ్చి పెడుతుంది. పశువులా ప్రవర్తించేలా శాసిస్తుంది. క్రోధంతో ఊగిపోయే మనిషిలో ఈ లక్షణా లన్నీ స్పష్టంగా కనిపిస్తాయి. 'నాకు కోప మొస్తే నేను మనిషినే కాను' అని కోపోద్రిక్తు డైన మనిషి పలుకుతూ ఉండటం మనం వింటూనే ఉంటాము. క్రోధం వస్తే తాను మనిషిగా మిగల లేడని, పశువును, మృగాన్ని సైతం మించి పోతాడని తానే చెప్పే టప్పుడు, మనకు మరొక నిదర్శనం ఎందుకు?

క్రోధం అసుర లక్షణము. అక్రోధం దైవ సంపద. క్రోధాన్ని ప్రేరేపించే పరిస్థితులు ఆసన్న మైనపుడు అవగాహనతో అక్రోధాన్ని కలిగి, క్రోధం నుండి బయట పడాలి అన్నది శాస్త్రం.

***క్రుద్ధే స్మేర ముఖావధారణ మథావిష్టే ప్రసాదక్రమో ।***
***వ్యాక్రోశే వినయోక్తి రాత్మ దురితో చ్ఛేదోత్సవ స్తాడనే ॥***

ఇతరులు మనపై కోపాన్ని ప్రకటించి నపుడు వారికి చిరునవ్వుతో కనిపించడం ***( క్రుద్ధే స్మేర ముఖావ ధారణం )***, పరులు క్రోధంతో వాళ్ళను వాళ్ళు మరచి నపుడు ఊరడించడము లేదా ఓదార్చే ప్రయత్నము చేయడము ***(ఆవిష్టే ప్రసాదక్రమః)***, పరులు కోపంతో తిట్టి నపుడు వారితో వినయంగా, వినమ్రంగా పలకడము ***(వ్యాక్రోశే వినయోక్తిః)***, ఒకవేళ అన్యులు కొడితే, గతంలో చేసిన పాపానికి మూల్యం చెల్లించడం జరిగిందని తనను తాను శాంతింప చేసుకోవడం - ఈ విషయాలను దృష్టిలో ఉంచుకొని ఉచితానుచితాలను పరిశీలించి ప్రవర్తించ గలిగితే అక్రోధ మనే దైవ సంపదను సాధించుకో వచ్చు.

**(13) త్యాగము**

'త్యజ్' అనే ధాతువు నుండి త్యాగము అనే పదము సంభవించింది. త్యజ్ అంటే విడిచి పెట్టడము, వదిలించు కోవడము, విడిపించు కోవడము ***(త్యజతి, త్యక్త)***. 'త్యాగః' అంటే విడిచి పెట్టడము, లేదా దానము అని కూడా అర్థము.

ప్రస్తుతము త్యాగము అనే పదానికి దానము అనే అర్థమును గ్రహించ డానికి వీలు లేదు. దానమును





దైవ సంపదలో నాల్గవ లక్షణముగా చెప్పడం జరిగింది కనుక ఇక్కడ త్యాగ మంటే విడిచి పెట్టడ మనే భావమునే గ్రహించాలి అన్నది భాష్యం ***( త్యాగః సన్న్యాసః, పూర్వం దానస్య ఉక్తత్వాత్ )***.

మోక్షము అనేది సాధకులకు ఏకైక గమ్యము. మోక్షము అనే అమృతత్వము త్యాగము లేనిదే సాధ్యం కాదు. అందుచేత, విడిచి పెట్టడము అనే అర్థాన్ని స్ఫురించే త్యాగ లక్షణమును దైవీ సంపదలో చేర్చడం జరిగింది.

***త్యాగే నైకే అమృతత్వ మానశుః*** - త్యాగము అనే ఒక్క దాని చేతనే మోక్షమును పొందుతారు అన్నది కైవల్యోపనిషత్తు. ఇక్కడ త్యాగము అనేది యోగ నిష్ఠాద్వయంలో సమాన పాత్రను ధరించి ఉంది. సర్వసంగ పరిత్యాగము అనేది జ్ఞానయోగ నిష్ఠలో ప్రధాన మైతే, విషయత్యాగము, సంగత్యాగము, కర్మఫల త్యాగము అనేవి కర్మయోగ నిష్ఠలో ప్రధానము. కనుక, ప్రవృత్తి రూపమైన కర్మయోగము నందు గాని, నివృత్తి రూపమైన జ్ఞానయోగము నందు గాని త్యాగము ప్రముఖ పాత్రను పోషిస్తూ ఉంది.

***సూ॥ తత్తు విషయ త్యాగాత్, సంగత్యాగాచ్చ !*** - విషయాల యందు మమ బుద్ధి లేకుండా ఉండటము, అలాగే వ్యక్తుల యందు అసంగ బుద్ధిని కలిగి ఉండటము త్యాగము అని నారద భక్తి సూత్ర ప్రబోధము *(సూ॥ 35)*.

త్యాగము అనేది ఒకే పద మైనా, ముముక్షువులు దానిలో ముఖ్యంగా రెండు విషయాలను దర్శించాలి. ఒకటి విడి పడటము; రెండవది ముడి పడటము. విషయ ప్రపంచము నుండి విడి పడటము త్యాగము అనేది మనకు అర్థమైంది. అలా విడి పడటం దేనికి? పరమాత్మతో ముడి పడటానికి. ఇంతవరకు ప్రపంచమును, వస్తువులను, విషయాలను, వ్యక్తులను, సంబంధ బాంధవ్యాలను ఆశ్రయించుకొనిన బుద్ధి, సమస్త ఆశ్రయా లను విడిచి పెట్టి, పరమాత్మనే అనన్య భావంతో ఆశ్రయించడం జరుగుతూ ఉంది. దీనినే అనన్య భక్తిగా గీతాచార్యుడు తొమ్మిదవ అధ్యాయం లోను *(9 వ అ - 22 వ శ్లో)*, పదకొండవ అధ్యాయం లోను *(11 వ అ - 54 వ శ్లో)* ప్రవచించాడు. సర్వాశ్రయాలను త్యాగం చేసి పరమాత్మనే ఆశ్రయించడం అనన్యత అని నారద మహర్షి కూడా ప్రబోధించాడు ***( సూ॥ అన్యాశ్రయాణాం త్యాగః అనన్యతా*** - *నారద భక్తి సూత్రములు ; 10)*.

కనుక అటు కర్మయోగికి గాని, ఇటు జ్ఞానయోగికి గాని త్యాగ లక్షణము అనే దైవ సంపద పుష్కలంగా ఉండాలి. ఈ త్యాగ లక్షణము కర్మయోగంలో కర్మఫల త్యాగంగా గోచరిస్తే, జ్ఞానయోగంలో సర్వసంగ పరిత్యాగముగా కనిపిస్తుంది. కనుక నిష్ఠాద్వయం లోని యోగు లిరువురూ త్యాగులే.

త్యాగి సమస్తములో ఉన్నట్లు కనిపించినా, సమస్తము నుండి విడిపడి ఉంటాడు. అండనే ఉన్నా అంటు కోడు. చెంతనే ఉన్నా చేదుకోడు. ఉన్నదానిపై మక్కువ లేని వాడు, లేని దానిపై కోరిక కదలని వాడు త్యాగి. యోగాసక్తే గాని భోగాసక్తి లేని వాడు. సంసారంలో ఉన్నా తనలో సంసారము లేని వాడు కర్మయోగి అయితే, సన్యాసములో ఉన్నా తాను సన్యసించా ననే భావన అదృశ్యమైన వాడు సన్యాసి. ఇదే త్యాగము. ఈ త్యాగమునే గీత ప్రముఖంగా ప్రబోధిస్తూ ఉంది. గీతార్థమే త్యాగము. 'గీత' అనే పదము లోని అక్షరార్థం కూడా త్యాగమునే సూచిస్తూ ఉంది.

***గీ కారం త్యాగ రూపం స్యాత్ తత్త్వబోధం తకారకమ్ ।***
***గీతావాక్య మిదం తత్త్వం జ్ఞేయం సర్వ ముముక్షుభిః ॥***

'గీ' అంటే త్యాగము. 'త' అంటే తత్త్వ జ్ఞానము. ఈ విధంగా త్యాగమును, తత్త్వ జ్ఞానమును బోధించడమే 'గీత' అనే పదము యొక్క పరమార్థ మని ముముక్షువులు గ్రహించాలి.

త్యాగ మార్గంలో పయనించి, తత్త్వ సౌధాన్ని అధిరోహించి, ఆప్తకాములై, ఆత్మవిదులై తరించి పోండి అనేదే గీతా సందేశము.

**(14) శాంతి**

చిత్తము ఉపశమించడమే శాంతి. విషయాల నుండి విరమించిన చిత్తము ఉపరతిని పొందడమే శాంతి ***( శాంతిః అంతఃకరణస్య ఉపశమః ).*** మనస్సు లోని రాగద్వేషాది మల దోషమే చిత్త అశాంతికి కారణము. రాగద్వేషాలు నిండిన మనస్సు ప్రశాంతంగా ఉండ లేదు. రాగవృత్తి ప్రవృత్తి వైపు పురికొల్పి మనస్సులో అలజడిని రేపుతూ ఉంటే, నివారించే మార్గంలో ద్వేష వృత్తి బుద్ధిని కలత పెడుతూ ఉంటుంది. రాగద్వేషాలను తృప్తి పరచడం ఎవ్వరికీ సాధ్యం కాదు. ఒక రాగవృత్తిని తృప్తి పరిస్తే, దానిని వెంబడించి మరి కొన్ని తలెత్తుతూ ఉంటాయి. ఒక ద్వేష వృత్తిని ఉపశమింప చేస్తే మరి కొన్ని ఉద్యమిస్తూ ఉంటాయి.

మనిషి స్వరూపమే శాంతి. రాగద్వేషాలు మనస్సును ప్రేరేపించి, బహిర్ముఖం గావించి స్వరూపానికి దూరంగా తీసుకొని పోతాయి. అంతటితో ఆగవు. స్వరూప శాంతికి దూరం చేయడమే గాక, ఎక్కడైతే శాంతి లభించే అవకాశమే లేదో అట్టి అనిత్య విషయ ప్రపంచంలో శాంతి కొరకు అన్వేషిస్తూ పరితపించేలా చేస్తాయి. ఆ విధంగా మనస్సును సదా అశాంతికి గురి చేస్తూ ఉంటాయి.

రాగద్వేషాలకు సంబంధించిన వృత్తులు మనస్సులో అశాంతిని సృష్టిస్తూ ఉంటాయి. కలత పెట్టే వృత్తులు లేనపుడు మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. ఆకాశంలో చంద్రుడు చల్లగా ప్రకాశిస్తూ ఉంటాడు. మబ్బులు గగనంలో కదుల్తూ ఉంటాయి. చంద్రుడు మబ్బుల మధ్య దూరి, మళ్ళీ మబ్బుల నుండి బయటికి వస్తున్నట్లు మనకు కనిపిస్తూ ఉంటుంది. చలించేది మేఘాలే గాని చంద్రుడు కాడు. మేఘాలు లేని ఆకాశంలో చంద్రుడు నిశ్చలంగా ప్రకాశిస్తూ కనిపిస్తాడు.

మేఘాలను తొలగిస్తే చంద్రుడు ప్రకాశించినట్లు, అచలమై శోభించినట్లు, రాగద్వేషాలు తటస్థ పడి, వృత్తులు ఉపశమిస్తే చిత్తము విక్షేపమును వదలి శాంతిని పొందుతుంది. అదే చిత్తోపశాంతి. అంతఃకరణ ఉపశమము. కనుక శాంతి అనే దైవ సంపద త్యాగము తరువాత చెప్ప బడింది. రాగద్వేష ప్రేరితమైన మనోవృత్తులను వదలడ మనే త్యాగము జరిగితే, ఆ తరువాత శాంతి అంతఃకరణములో నిలుస్తుంది. కనుకనే ***త్యాగాత్ శాంతిః అనంతరమ్*** - త్యాగము తరువాతే శాంతి ప్రాప్తిస్తుందని పన్నెండవ అధ్యాయంలో ప్రబోధించాడు గీతాచార్యుడు *(12 వ అ - 12 వ శ్లో).*

**(15) అపైశునము**

పరుల దోషాలను, లేదా లోపాలను వారి పరోక్షంలో ప్రస్తావించడం, లేదా ఎత్తి చూపి ఏకరవు పెట్టడము పైశునము. అట్టి పిశునత్వము లేకుండా ఉండటము అపైశునము ***( అపైశునమ్ అపిశునతా. పరస్మై పరరంధ్ర ప్రకటీకరణం పైశునం తదభావః అపైశునం ).*** కొండెములు చెప్పే అలవాటు, చాడీలు చెప్పే గుణము పైశునము. ఇది అసుర లక్షణము. దీనికి విరుద్ధ మైనది అపైశునము. అది దైవీ సంపద. ఋజు వర్తనము.

'నక్క బొక్కలు వెతుకును - కుక్క చెప్పులు వెతుకును' అనేది సామెత. పిశునత్వము అనే దుర్గుణానికి అలవాటు పడిన వాడికి చాడీలే పకోడీలు. ఎవరి విషయమునో తీసికొని వారి పరోక్షములో మరొక వ్యక్తితో వారి ప్రవర్తనమును గూర్చి గాని, వారి వ్యక్తిగత విషయాలను గూర్చి గాని, వారి ఆలోచనా విధానమును గూర్చి గాని నిందలు మోపుతూ చెప్పక పోతే కొందరికి తినింది జీర్ణం కాదు. మరి కొందరికి నిద్ర పట్టదు. ఇదే పైశునము.





ఈ ప్రపంచంలో దోషాలు లేని వారెవరు? ఎవరి దోషాలు వారి కున్నాయి. అలాంటపుడు, ఇతరులను ఆడి పోసుకోవడంలో వేడుక ఏముంది? దీనిని కాస్త లోతుగా విచారిస్తే, ఇతరులకు చెడు చేయాలి అనే భావన చాడీలు చెప్పే వ్యక్తిలో ఉన్నట్లు ఎవరి కైనా అర్థ మవుతుంది. ఒకరికి చెడు చేసి మనం పొందే దేముంటుంది? ఏ ప్రయోజనము లేక పోయినా, పైగా దాని వల్ల పరులకు హాని కలుగుతూ ఉంది అని తెలుస్తూ ఉన్నా, ఈ పైశున వృత్తిని మనిషి ఎందుకు సాగిస్తాడు అంటే ఏం చెప్పగలం? ఇతరులు హాయిగా ఉంటే చూచి సహించ లేని మానసిక దౌర్బల్యమే ఈ పైశునత్వానికి పునాది. కనుక అసూయా ద్వేషాలే పైశునము వెనుక ప్రధాన కారణాలుగా తెలుస్తాయి.

కట్టెలో ఉండే అగ్ని కట్టెనే దహిస్తుంది. ఏ వ్యక్తిలో ఈర్ష్యాద్వేషాలు ఉంటాయో, అవి ఆ వ్యక్తి బుద్ధినే పాడు చేస్తాయి. బ్రతుకును నికృష్టంగా మారుస్తాయి. ఇలా చూచి నపుడు, సమస్య ఎక్కడో లేదు. కొండెములు చెప్పే వాడి లోనే ఉంది. ఏ క్షణంలో అయినా అంతఃకరణమును దగ్ధం చేయడానికి సిద్ధంగా ఉండే ద్వేషాగ్నిని ప్రేమ జలంతో ఆర్పుకోవడానికి బదులు, పరులపై చాడీలు చెప్పడ మనే చిదుగులను తోడు చేసుకోవడం వల్ల ఎవరికి నష్టం?

చాడీ లన్నీ చాటు గానే సాగుతాయి. ఎవరిని గూర్చి చెడుగా ప్రచారం జరుగుతూ ఉందో ఆ వ్యక్తికి మాత్రం వినిపించే అవకాశం లేదు కదా! ఇతని మాటల సెగలు అతనిని సోకవు కదా! మరి, ఎవరికి నష్టం? చెప్పే వాడు, వినే వాడు - వీరిద్దరే పైశునములో మునిగి ఉన్నారు కనుక వీరికే నష్టం. ఇద్దరి మనస్సులూ పాడు అవుతాయి.

ఇతరులను గూర్చి చెడుగా మాట్లాడ టానికి మనం చెప్పే చాడీలకు ఋజువు లెక్కడున్నాయి? ఏ ఋజువులు లేక పోయినా పని గట్టుకొని దోషాలను ఆరోపిస్తూ వ్యర్థ వచనాలు పలకడం పైశునము. అసుర లక్షణము.

విచారించి అర్థం చేసుకుంటే, ఇతరులను వారి పరోక్షంలో నిందించడం వెనుక మనలో నిగూఢంగా దాగి ఉన్న ఈర్ష్యాసూయలకు ఋజువులు దొరుకుతాయి. అలా మన దోషాలను మనం చూసుకొని, వాటిని సవరించుకొని శుద్ధి చేసుకొనే కార్యక్రమంలో నిమగ్నమై ఉంటే, అన్యుల దోషాలు మనకు కనిపించవు కూడా. కనిపించ నపుడు ఇక కలవరించే దేముంటుంది? పలవరించే దేముంటుంది? ఏదీ ఉండదు. అపైశునం, అంటే ఇతరుల దోషాలను ఏకరవు పెట్టని లక్షణం ఒక్కటే ఉంటుంది. ఈ విశిష్ట లక్షణం ఎవరిలో ఉంటుందో వారే దైవ సంపద కల వారు.

మోపే వారు నిందలు ఎందరో
మోసే వాడివి కాబోకు
కాకి కూతలు ఎవరికి మధురము?
కోకిల రవమే కమనీయము
సహనమె సంపద పగయే ఆపద
సద్గతి కిదియే సోపానము
రామ రామ జయ రాజారామ్
రామ రామ జయ సీతారామ్

అని రామజోగి చిట్కా.

### (16) భూతదయ

ఆర్తుల యందు, దీనుల యందు, దుఃఖితుల యందు చూపే కృపయే దయ *(దయా కృపా భూతేషు దుఃఖి తేషు)*. వేడికి పాత్ర లోని పాలు పొంగినట్లు, అవగాహనా వేడికి హృదయం లోని ప్రేమ పొంగడమే దయ. దయ అనేది దైవగుణము. భగవంతుడు దయా స్వరూపుడు. ప్రతి వ్యక్తి హృదయంలో భగవానుడు ఉన్నాడు *(18 వ అ - 61 వ శ్లో)*. ఎలా ఉన్నాడు? దయా రూపంలో ఉన్నాడు. 'హృదయము' అనే నాలుగు అక్షరాల పదంలో మధ్య నున్న రెండక్షరాలు 'దయ'. అది ఈశ్వర స్వరూపము. అది అందరి హృదయం లోనూ ఉంది. అది అర్థం కాక, పరమాత్మకు నాపై దయ లేదు అంటూ ఉంటారు. దయ అనేది వచ్చేది కాదు. ఉన్నదే. మన హృదయంలో దయా రూపంలో భగవంతుడే ఉన్నాడు. ఆయన దయ తోనే గుండె కొట్టు కుంటోంది. ఆయన దయ తోనే కళ్ళు చూస్తున్నాయి. దయ ప్రత్యేకంగా రావడ మేమిటి? వచ్చే ఉంది. వచ్చి మన లోనే ఉంది. అలా ఉందనే జ్ఞానమే మనకు రావాలి.

ఈ విధమైన జ్ఞానము ఎవరికి కలిగితే వారిలో దయా సంపద ఉంటుంది. దయ అనే దైవ సంపద ఉంటుంది. పరమేశ్వరుడు మన హృదయంలో నిలిచి నిర్హేతుకంగా మనపై దయా వృష్టిని కురిపిస్తున్నాడు. దయామయుడు మన లోనే ఉండగా, మనలో దయ లేకపోవడ మేమిటి?

కత్తితో పండు కోసే టప్పుడు, కూరగాయలు తరిగే టప్పుడు కొన్ని సమయాలలో చేతికి గాయ మవుతుంది. అలాగే ఏదైనా వేడిగా ఉన్న పాత్రను తెలియకుండా ముట్టుకు న్నప్పుడు చేయి కాలుతుంది. అలాంటి సమయాలలో హృదయంలో ఉన్న దయ పైకి ఎలా పొంగుతుందో మనం ప్రత్యక్షంగా వీక్షించ వచ్చు. గాయమైన చేతిని, లేదా కాలిన చేతిని నోటితో చల్లగా, మెల్లగా గాలిని ఊదుతూ అనునయించే దృశ్యాన్ని చూస్తే, వ్యక్తి లోని దయ ఎలా వ్యక్త మౌతూ ఉందో అర్థ మవుతుంది. అదే దయను ఇతరులపై చూప గలిగితే అది భూతదయ అవుతుంది.

ప్రస్తుత శ్లోకంలో ప్రథమంగా మనం అహింస అనే దైవ లక్షణాన్ని చెప్పుకున్నాం. ఇతరులను కష్ట పెట్టకుండా ఉండటము అహింస అయితే, ఇతరులను ప్రయత్న పూర్వకంగా సుఖ పెట్టడం దయ అవుతుంది. అహింస, దయ అనే దివ్య గుణాలు మనిషికి రెండు కళ్ళ లాంటివి. అవి మనిషి లోని ప్రేమకు ప్రతిరూపాలు.

మేఘంలో ఉండే జలం వర్షించి నపుడు తారతమ్యాలు చూడకుండా సర్వులను ఎలా సంతృప్తి పరుస్తుందో, హృదయం లోని ప్రేమ దయా రూపంలో వ్యక్త మైనపుడు సర్వ ప్రాణులపై ఒకే విధంగా ప్రసరిస్తుంది. దైవీ సంపద గల పుణ్యాత్ముడు కేవలం మానవులనే కాదు, సర్వ ప్రాణులను తన దయామృతంతో తడుపుతాడు. దీనులపై దయ చూపి వారిని ఆదుకుంటాడు. ఆర్తులను అక్కున చేర్చు కుంటాడు. పశుపక్ష్యా దులను సైతం సేవిస్తాడు. ఆకలితో అలమటిస్తున్న మానవులపై దయను ఎలా ప్రసరింప చేస్తాడో, నీరు లేక ఎండి పోతున్న మొక్కలపై కూడా అదే దయను కురిపిస్తాడు. కనుకనే దయామయు డైన పరమేశ్వరుని రూపంగా శోభిస్తున్న దయను దైవ సంపదగా భావించాలి.

### (17) అలోలుప్త్వం

లోలుప్త్వము అంటే విక్రియ, లేదా మార్పు. అంటే చలించడము అని అర్థము. అలోలుప్త్వము అంటే అవిక్రియ, లేదా వికారము లేని స్థితి. విషయాల మధ్యే ఉన్నా, ఇంద్రియాలు ఏ విధమైన వికారము లేకుండా ఉండటాన్ని అలోలుప్త్వం అంటారు *(అలోలుప్త్వం ఇంద్రియాణాం విషయ సన్నిధౌ అవిక్రియా)*.

అలోలుప్త్వం అనే పదానికి అలోలత్వం అనే పాఠాంతరము కూడా ఉంది. విషయాల యందు ఆసక్తి





ఉండటాన్ని విషయ లోలత్వం అంటాము. స్త్రీ వ్యామోహం ఉన్న వ్యక్తిని స్త్రీ లోలుడు అంటాము. వేణుగానము నందు ఆసక్తి గల వానిని వేణుగాన లోలుడు అంటాము. లోలత్వం, లేదా లోలుప్త్వం అంటే ఇదే. అది లేకుండా ఉండటము అలోలత్వం, లేదా అలోలుప్త్వం. ఇది దైవీ సంపదకు సంబంధించినది.

ప్రేరేపించే విషయాలు ఎదురుగా లేనపుడు వాటి యందు ఇంద్రియ లోలత్వం వ్యక్తికి లేక పోవచ్చు. ఇది సర్వ సామాన్యం. కాని, వికార హేతువు లైన విషయాలు, అంటే ఇంద్రియాలను ప్రేరేపించే విషయాలు కనిపిస్తూ ఉండినా, అంటే వాటిని అనుభవించే అవకాశము అందుబాటులో ఉండినా, అనుభవించడం అనేది అలా ఉంచి, కనీసం మనస్సులో ఏ విధమైన వికారం లేకుండా, ఇంద్రియ నియమం కలిగి ఉండటము అలోలత్వం. ఇది మహిమాన్వితమైన దైవ సంపద. రంభ తన అందచందాలను ఒలక బోస్తూ ప్రేరేపించినా ఏ మాత్రం మొక్కవోని నిగ్రహంతో తిరస్కరించిన శుకబ్రహ్మలో దివ్యంగా శోభించింది ఈ అలోలుప్త్వమే. ఊర్వశి తన సౌందర్యాన్ని ప్రదర్శిస్తూ ఊరించినా, ఉలుకు పలుకు లేక నిరసించిన అర్జునునిలో కనిపించింది కూడా ఈ అలోలత్వమే. ఇది సాధకులు అవశ్యం సాధించ దగిన దివ్య సంపద. దైవీ సంపద.

### (18) మార్దవము

మార్దవము అంటే మృదుత్వము. మృదువైన స్వభావము. క్రౌర్యం లేకుండా ఉండటము మార్దవము *(మార్దవం మృదుతా అక్రౌర్యం)*. సున్నితమైన మనస్తత్వము. పువ్వు లాంటి సున్నితమైన, మెత్త నైన హృదయ మును సాధకులు కలిగి ఉండాలి. మాటలలో మృదుత్వం ఉండాలి. మాటలలో మృదుత్వము అంటే, మాటలు ప్రేమ పలుకులై ఉండాలి. కరుణా పూరితంగా ఉండాలి. కఠినంగా, కర్కశంగా భాషించకుండా, సున్నితంగా, మృదువుగా మాట్లాడాలి. అదే మార్దవ మంటే.

ఒక్క మాట లోనే కాదు. మనస్సు కూడా మృదువుగా ఉండాలి. ఆచార వ్యవహారాలలో మృదుత్వము ఉండాలి. మృదువుగా ఉండే పువ్వుల్ని అందరూ ప్రేమిస్తారు. అలాగే మృదు స్వభావులను సర్వులు ఆదరిస్తారు. ఇదే మార్దవము. సర్వామోద మైన దైవీ సంపద.

ఇక్కడ మరొక విషయాన్ని కూడా జ్ఞాపకం పెట్టుకోవాలి. కొందరు మృదువుగా మాట్లాడుతారు. కాని, మనస్సులో చాలా కఠినంగా ఉంటారు. కొందరేమో మాటలో కర్కశంగా ఉంటారు. కాని, వారి మనస్సు చాలా సున్నితంగా ఉంటుంది. అలాంటి వారి విషయంలో, 'పాపం మాట అలా ఉంటుందే గాని మనస్సు చాలా మంచి దండి' అంటూ కొందరు వ్యాఖ్యానిస్తూ ఉంటారు.

మొదటి వారు కపటులు. ఆలోచించ దగిన వారు కారు. ఇక, రెండవ వారు నిష్కల్మషులే గాని, మనస్సుతో పాటు మాటలో కూడా మృదుత్వాన్ని పొంద గలిగితే తప్పక దైవ సంపదను సాధించిన వారు అవుతారు. మృదు స్వభావులే మాధవ ప్రియులు.

### (19) లజ్జ

లజ్జ పడటము కూడా దైవ గుణము అంటున్నాడు. లజ్జ పడటము అంటే సిగ్గు పడటము అని అర్థము. దానినే హ్రీః అంటారు. హ్రీ శబ్దము సిగ్గును సూచిస్తుంది *(హ్రీ లజ్జాయామ్)*.

సిగ్గు అనే గుణము ప్రతి ఒక్కరిలో కొద్దో, గొప్పో ఉంటుంది. ఎందుకు సిగ్గు పడుతున్నారు? అని చూచి నప్పుడే మనిషి మనిషికి అంతరము కనిపిస్తుంది. సిగ్గు పడే వాళ్ళను మనం చూస్తూ ఉంటాము. కాని అది వాంఛనీయమా, కాదా అనేది సిగ్గు పడే వాళ్ళకు తెలుసో, తెలియదో మనకు అర్థం కాదు.

'ఎందుకలా సిగ్గు పడతావు? కొత్త వాళ్ళెవ రున్నారు? అందరూ మన వాళ్ళే కదా! ముందుకు రా!' అంటూ కొందరు వ్యాఖ్యానిస్తూ ఉండటము మనకు వినపడుతూనే ఉంటుంది. 'చాలా మంచి గాత్ర మండి. చక్కగా పాడుతుంది. కాకపోతే కాస్త సిగ్గు ఎక్కువ' అని కొందరు అంటూ ఉంటారు. 'మిమ్మల్ని అడగాలనే మీ వద్దకు వచ్చాడండి. కాని సిగ్గుతో అడగలేక పోయాడు' అని మరి కొందరు చెబుతూ ఉంటారు. పూర్వపు రోజుల్లో అయితే పెళ్ళి చూపులలో, పెళ్ళి పీటల మీద ఇరు వైపుల సిగ్గు తొణికిస లాడుతూ ఉండేది.

మనకు తెలిసిన, మనం చూస్తున్న ఇలాంటి సిగ్గుల ముగ్గుల్ని గూర్చి కాదు భగవంతుడు చెబుతున్నది. గీతాచార్యుడు సిగ్గును, లేదా లజ్జను దైవీ సంపదగా వర్ణిస్తున్నాడు అంటే, అది సామాన్యులలో మనకు కనిపించే సాధారణ మైన సిగ్గు కాదు. దైవ మార్గంలో చరించే ఉన్నతులు ఆంతరంగికంగా అనుభవించే సంకోచానికి సంబంధించిన బిడియము.

అకార్యమును, అంటే చేయ కూడని కార్యమును చేయవలసి వచ్చినపుడు, అట్టి అకార్యాచరణము నందు చిత్తానికి కలిగే సంకోచము ఇక్కడ **హ్రీః** లేక లజ్జగా చెప్పబడుతూ ఉంది. వ్యక్తి ఔన్నత్యాన్ని తెలుపుతూ ఉన్నందున, లజ్జ పడే ఆ ప్రత్యేక పరిస్థితులలో వ్యక్తులలో పరివర్తనకు అవకాశము ఉన్నందున, సిగ్గు పడటం, లేదా లజ్జ పడటము దైవ సంపదగా పేర్కొన బడింది.

'అలాంటి వాడు ఇలాంటి పని చేశాడు. సిగ్గు కూడా లేదు. లజ్జ లేని బ్రతుకు' అనే లోక నిందలు క్రొత్తవి కావు. చేయ కూడనివి చేసి నపుడు, 'ఇలా ఎందుకు చేశానా?' అని సిగ్గు పడటం మానవత్వము. కాని, మనం చూస్తున్న **హ్రీః** అలాంటిది కూడా కాదు. చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకోవడం కాదు. చేయక ముందే సిగ్గు పడి కార్యాచరణము నుండి విరమించడము. అందుకే ఇది దైవ లక్షణము. దోష రహిత జీవనము.

ఆశించి నంతగా సాధనలో పురోగతిని సాధించలేక పోయాను, అనుకున్నంతగా మారలేక పోయాను అని తనలో తాను సిగ్గు పడటము; తన లోని ఔన్నత్యాన్ని గుర్తించిన వారు తనను స్తుతించి నపుడు సంతసించ డానికి బదులుగా, అలాంటి స్తుతుల నుండి సిగ్గుతో తప్పుకోవడము - ఇవన్నీ **హ్రీః** అనే దైవ సంపద క్రిందికే వస్తాయి.

### (20) అచాపలము

చాపలము అంటే చపలత్వము, చంచల స్వభావము అని అర్థము. అట్టి చపలత్వము లేకుండా ఉండటము అచాపలము. చాపలము అంటే చంచలము, అస్థిరము అని అర్థము కనుక *(చపలశ్చాఞ్చలోఽస్థిరః)* అచాపలము అంటే చంచలత్వము లేక పోవడము, స్థిరత్వము కలిగి ఉండటము అని అర్థము.

***అసతి ప్రయోజనే వాక్పాణి పాదాదీనామ్ అవ్యాపారయితృత్వమ్ అచాపలమ్*** - కరచరణాదులతో, వాక్కుతో ఏ విధమైన ప్రయోజనము లేని కార్యాలను చేయకుండా ఉండటము అచాపలము అని శ్రీ శంకర భాష్యము.

మనిషిలో నిర్నిమిత్త వ్యాపారాలు సాగు తున్నాయి అంటే అతనిలో రజోగుణము మోతాదు ఎక్కువగా ఉందని అర్థము. అందుకే చపలత్వము. వ్యర్థ చేష్ట లన్నీ చపలత్వము క్రిందికే వస్తాయి. ఏమిటి అతని అలవాటు? ఒక్క క్షణం కూడా కుదురుగా ఒక చోట కూర్చో డెందుకని? అని పెద్దలు అంటూ ఉండటం మనకు తెలుసు.

కొందరు ఒక చోట ఉండ లేరు. కొన్ని క్షణాలు స్థిరంగా కూర్చోలేరు. ఒకవేళ బలవంతంగా కూర్చో పెట్టినా, కాళ్ళు చేతులు, కళ్ళు కదిలిస్తూ నైనా ఉంటారు. క్షణం కదలకుండా కూర్చోలేని ప్రబుద్ధులు





ధ్యానంలో స్థిరంగా ఎలా కూర్చో గలరు? ఇలాంటి వాళ్ళే, నాకు ధ్యానం కుదరడం లేదండి, మనస్సు నిలవడం లేదండి అంటూ ఉంటారు. ఏం చేద్దాం! బ్రతుకులో లేని నిలకడ భక్తిలో రమ్మంటే వస్తుందా?

వ్యక్తితో సంబంధం లేకుండా, నిర్నిమిత్తంగా, నిష్ప్రయోజనంగా ఇంద్రియాలు వ్యర్థమైన వ్యాపారాలు సాగిస్తున్నా యంటే అది చపలత్వము కాక మరేమిటి? కొందరు కాళ్ళు ఆడిస్తూ ఉంటారు. కొందరు గోళ్ళు కొరుకుతూ ఉంటారు. కొందరు ఏదో తబలా వాయిస్తున్నట్లు కుర్చీ మీదనో, బల్ల మీదనో, మంచం మీదనో వేళ్ళతో కొడుతూ ఉంటారు. అది బాగుండ దేమో, కొందరు నుదుటి మీద, తల మీద మద్దెల వాయించు కుంటూ ఉంటారు. కార్యాలయాల్లో చూడండి. ఈ చపలచిత్తులే కుర్చీల మధ్య అకారణంగా తిరుగుతూ ఉంటారు.

కాళ్ళు చపలము. కళ్ళు చపలము. చేతులు చపలము. వాక్కు చపలము. మనస్సు చపలము. ఏది చూచినా చపలమే. చంచలమే. అన్నీ మర్కట చలనాలే. ఈ విధమైన చపల స్వభావము, చంచలమైన గుణము లేక పోవడము అచాపలము. సుస్థిరత్వము. దైవీ సంపదకు సంబంధించిన ఉత్తమ లక్షణము.

ధ్యానయోగి మనస్సు గాలి లేని చోట దీపం లాగా స్థిరంగా, నిలకడగా ఉండాలి. తత్త్వ చింతనము చేయాలన్నా, తాత్త్విక ప్రవచనము సాగించాలన్నా బుద్ధి అవధానంతో ఉండాలి. ఆత్మ అచలము. ధ్రువము. అలాంటి ఆత్మే తాను అనే ఎరుక చపల స్వభావులకు కలుగుతుందా? గుఱ్ఱము ఎంత శక్తి కలదైనా, ఎంత వేగంగా పరుగు పెట్టే దైనా, దాని కళ్ళకు గంతలు కట్టే నడిపిస్తారు. కారణం, అది చపల జీవి. బలవంతంగా దానిని ఒక గాడిలో పయనింప చేయాలి. అలా కానపుడు అది ఎటైనా పరుగు తీయవచ్చు. నిలకడ లేని బ్రతుకు లన్నీ ఇలాగే ఉంటాయి.

ప్రయోజనం లేకుండా వాక్కును, కరచరణాదులను చలింప చేయకుండా ఉండటాన్ని దైవ లక్షణంగా ఆచార్యుల వారు వ్యాఖ్యానించడాన్ని కొందరు జీర్ణించుకో లేరు. ఇంత స్వల్ప విషయాన్ని దైవీ సంపదగా గుర్తించడ మేమిటి అని సంశయిస్తారు. కానీ, నిశ్చలమైన శ్రవణ మనన నిదిధ్యాసల నుండి, స్థిరమైన ధ్యాన స్థితి నుండి అచలమైన ఆత్మస్థితికి చేరడానికి చపలత్వము ఎంత పెద్ద ప్రతిబంధకమో ఆలోచనాపరులకు, వివేకవంతులకు తెలియనిది కాదు. ప్రపంచంలో అన్నీ చలనశీలాలే. దేహేంద్రియ మనోబుద్ధులలో అన్నీ చలనాలే. ఈ చలనాల నుండి విడిపడి అచలమైన ఆత్మస్వరూపాన్ని పొందాలి అంటే అచాపలము అనే సాత్త్విక దైవీ సంపద అత్యంత ప్రధాన మైనది.

*ఇప్పటికి, దైవీ సంపదకు సంబంధించి ఇరవై లక్షణాలను పూర్తి చేయడం జరిగింది. ఇక మిగిలిన ఆరు లక్షణాలను తరువాత శ్లోకంలో వివరిస్తున్నాడు.*

**తేజః క్షమా ధృతిః శౌచ మద్రోహో నాతిమానితా ।**
**భవన్తి సమ్పదం దైవీ మభిజాతస్య భారత ॥** 3

*తేజః-క్షమా-ధృతిః-శౌచం-అద్రోహః-న-అతిమానితా*
*భవంతి-సంపదం-దైవీం-అభిజాతస్య-భారత*

| | | | | | |
|---|---|---|---|---|---|
| తేజః | = | తేజము | శౌచం | = | శుభ్రత |
| క్షమా | = | ఓరిమి | అద్రోహః | = | ద్రోహము లేకుండుట |
| ధృతిః | = | ధైర్యము | న అతిమానితా | = | గర్వము లేకుండుట |

| | | | | | |
|---|---|---|---|---|---|
| దైవీం | = | దైవ సంబంధమైన | అభిజాతస్య | = | పుట్టిన వానికి |
| సంపదం | = | సంపదను గురించి | భవంతి | = | కలుగుచున్నవి |

**అర్జునా! తేజము, ఓరిమి, ధైర్యము, శుభ్రత, ద్రోహము చేయకుండుట, గర్వము లేకుండుట - దైవీ సంపదతో జన్మించిన వారిలో ఇవి కనిపిస్తాయి.**

## వ్యాఖ్య

### (21) తేజస్సు

తేజస్సు అంటే ప్రకాశము. తిమిర విరోధి. తేజస్సు అంటే ప్రాగల్భ్యము అని భాష్యం. ప్రగల్భత్వమే ప్రాగల్భ్యము. జ్ఞానము వలన ఏర్పడిన నిర్భయత్వమే ప్రాగల్భ్యము. జ్ఞానము ప్రకాశవంత మైంది. అదే తేజము. కేవలం బుద్ధికి సంబంధించింది.

తేజస్సు అనే పదమును అనేక విధాలుగా ఉపయోగిస్తారు. వేదాంతంలో బ్రహ్మ తేజస్సు, బ్రహ్మతేజము, ఆత్మతేజము అనే పదాలు తరచుగా వినపడుతూ ఉంటాయి. కాని, ఆ తేజస్సును దర్శించాలి అనే అత్యుత్సాహంలో కొందరు, 'ఆయన ముఖ వర్చస్సు చూడండి. ఏమి తేజము! బ్రహ్మవర్చస్సు ఉట్టి పడుతోంది' అని చీకటి మాటలు పలుకుతూ ఉంటారు. తేజస్సు ఒక్కటే కాదు. దైవీ సంపదకు సంబంధించిన లక్షణాలన్నీ బుద్ధి ధర్మాలే, బుద్ధి గుణాలే గాని దేహ ధర్మాలు కావు. తేజస్సు అంటే దేహకాంతి కాదు. బుద్ధి ప్రకాశము. ఈ కారణం చేతనే తేజస్సు అనే పదానికి ప్రాగల్భ్యం అనే అర్థాన్ని చెప్పడమే గాక, అది చర్మగత సౌందర్యము, లేదా ప్రకాశము కాదని కూడా భాష్యం నిర్వచించింది ***(తేజః ప్రాగల్భ్యం, న త్వగ్గతా దీప్తిః)***.

తేజస్సు అంటే బుద్ధి సూక్ష్మత. విచార యుక్త వివేకము. బుద్ధి లోని జ్ఞానము. అస్పష్టత లేని స్వచ్ఛమైన జ్ఞానము. చీకటి కోణాలు లేని తేజము. వెలుగుల తోరణాలు ప్రకాశించే వివేక తేజము. ఇది దైవీ సంపద.

### (22) క్షమ

క్షమ అంటే ఓర్పు, లేదా సహనము అని అర్థం చెప్పుకుంటాం. క్షమ అనేది దైవ సంపద. కనుక దానిని విశాలంగా, విశిష్టంగా అర్థం చేసుకోవాలి. గడచిన అధ్యాయాలలో క్షమను గూర్చి విస్తరించి చెప్పుకున్నాం *(12వ అ - 13 వ శ్లో; 13 వ అ - 8 వ శ్లో)*. ఇక్కడ విశేషించి విశిష్టతను గుర్తించాలి.

ఏదైనా పరాభవం జరిగి నపుడు వ్యక్తి దానిని ఓర్చుకోవచ్చు. అది సహనము, లేదా ఓర్పు అవుతుంది. పరాభవాన్ని వ్యక్తి సహించ వచ్చు. పరాభవించిన వ్యక్తిపై ప్రతిచర్యను గ్రహించక పోవచ్చు. ఇదంతా సహనమే. కాని, నిష్కారణంగా అతడు తనను పరాభవించాడు అనే పరితాపాన్ని మనస్సులో పెట్టుకొని ఉంటాడు. పగ తీర్చుకోకుండా సహించడం వేరు. బుద్ధిలో పగను దాచుకోవడం వేరు. ఇక్కడే, క్షమ గగన విహారం చేస్తూ ఉంటే, సహనం నేలపై నిలబడి విస్మయంతో వీక్షిస్తూ ఉంటుంది.

క్షమ అనేది దైవ గుణము. పరాభవాన్ని భరించడమే గాక, దాని ఫలితాన్ని మనస్సులో దర్శించని అద్భుత మైన అవగాహన. పరాభవించిన వారికి సైతం పరితోషాన్ని కలిగిస్తూ, తాను పరిపూతమై ఉండటము క్షమా గుణ వైభవము.

***అక్రుష్టస్య తాడితస్య వా అన్తః విక్రియానుత్పత్తిః ఉత్పన్నాయాం ప్రశమనం అక్రోధః ఇతి అవోచామ -*** తిట్టినా, ఈడ్చినా, కొట్టినా, ఒక వైపు బాధను, మరొక వైపు పరాభవాన్ని అనుభవిస్తూ ఉండినా, దానికి సంబంధించిన ఏ విధమైన వికారము, కోపము మనస్సులో కలగకుండా ఉండటము క్షమ అవుతుంది. అందుకే అది దైవీ సంపద.





ఈ సందర్భంలో ఒక ప్రధానమైన విషయాన్ని మనం గుర్తించాలి. స్మృతిలో నిలుపు కోవాలి. దైవీ సంపదకు సంబంధించి మనం ఇప్పటి వరకు చెప్పుకొనిన ఇరవై ఒక్క లక్షణాలలో అక్రోధము అనేది పన్నెండవ దైవ గుణము. దానిని గూర్చి ఆ సందర్భంలో విపులంగా చర్చించు కున్నాము కూడా. కాని, అక్రోధము, క్షమ అనే ఈ రెండు లక్షణాలు సమానార్థాలుగా కనిపిస్తున్నాయి. కనుక, ఇది పునరుక్తి అని కొందరు భావిస్తారు. వాటి మధ ఉన్న సూక్ష్మమైన అంతరాన్ని గుర్తించక పోవడమే వారు అలా భావించడానికి కారణము. మనం స్పష్టంగా అర్థం చేసుకుందాం.

ఒకరు పరాభవించి నపుడు మనస్సులో వికారము జనిస్తుంది. క్రోధం పుట్టే అవకాశం ఉంటుంది. అట్టి పరిస్థితిలో అవగాహనతో క్రోధాన్ని నిగ్రహించడము, రాకుండా ఆపడము అనేవి అక్రోధము. ఆ విధంగా మనస్సులో ఏ విధమైన వికారము లేకుండా చేసుకోవడము.

కాని, క్షమ అది కాదు. పరాభవించ బడినపుడు మనస్సులో అసలు క్రోధమే తల ఎత్తకుండా ఉండటము క్షమ. వికారము జనించి ఆపడము కాకుండా, ఏ వికారము సంభవించకుండా ఉండటమే క్షమా గుణము.

క్షమా గుణంలో మరొక విశిష్టత కూడా ఉంది. ప్రతిచర్యకు అనుకూలమైన వికారము బుద్ధిలో లేక పోవడమే గాక, పరాభవించిన వ్యక్తి పరిస్థితిని, మానసిక స్థితిని అర్థం చేసుకొని ప్రతిచర్యకు బదులుగా ఆ వ్యక్తికి పరితోషాన్ని కలిగించే కార్యానికి ఉద్యమించడం కూడా క్షమలో భాగమే.

భూమాతను సహనానికి ప్రతిరూపంగా చెబుతాము. నాగళ్ళతో అవని కుక్షిని దారుణంగా దున్నినా, క్షమాగుణంతో భరించడమే గాక, దున్నిన వారికి ధాన్యాన్ని పంచుతుంది ధరణి. ఆ ధరణి మాత నుండి ఆవిర్భవించినవే కనుక, పండ్లను కత్తులతో కోసినా, కోసిన వ్యక్తికి, ఉపకరించిన కత్తికి ఇద్దరికీ మధుర రసాన్ని త్రాగిస్తాయి. ఇంతటి క్షమాగుణము కలిగిన తల్లి కనుకనే, భూమాతపై పాదం మోపలేక ధరణీ పుత్రులు క్షమించ మని వేడుకొంటూ ఉంటారు. ***విష్ణుపత్నీ నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వమే -*** అమ్మా! భూమాతా! హరిసతీ! నీపై కాలు పెడుతున్నందుకు నన్ను క్షమించు. మరో మార్గం లేక ఇలా చేయవలసి వస్తోంది అని ఉదయాన్నే మన మందరము నేల తల్లికి నమస్కరిస్తున్నాము. క్షమా గుణము అంత విశిష్ట మైంది. అందుకే అది దైవీ సంపద.

ప్రతిచర్యను ప్రదర్శించే సామర్థ్య మున్నా, పరాభవించిన వ్యక్తిపై ప్రతాపాన్ని చూపే ప్రయత్నం చేయ కుండా, నిర్వికారంగా ప్రశాంత చిత్తుడై ఉండటము దైవీ సంపద కలిగిన క్షమావంతుని లక్షణము.

### (23) ధృతి

ధృతి అంటే ధైర్యము. కాని, ప్రస్తుతం మనం అధ్యయనం చేస్తున్న దైవీ సంపదలో ధృతిని విస్తరించి చెప్పు కోవాలి. మోక్ష మార్గంలో పయనించే సాధకులకు దృఢ దీక్ష ఉండాలి. ధైర్య స్థైర్యాలు ఉండాలి. దృఢ సామర్థ్యం ఉండాలి. పూర్వాధ్యాయాలలో వీటిని కొంత వరకు అర్థం చేసుకున్నాం. స్థిరమైన నిశ్చయాన్ని పండ్రెండవ అధ్యాయంలో *(14 వ శ్లో)*, దృఢమైన స్థైర్యాన్ని పదమూడవ అధ్యాయం లోను చూశాం *(7 వ శ్లో)*. నిశ్చయ స్థైర్యాలలో సమర్థతను, సమయస్ఫూర్తిని కలిగి వర్తించడము అనే దక్షతను గూర్చి కూడా చెప్పు కున్నాం *(12 వ అ - 16 వ శ్లో)*. వీటన్నిటిలో ధృతి, లేదా అవగాహనతో కూడిన ధైర్యమే ప్రధానంగా ప్రతిఫలిస్తూ వచ్చింది. కాని ప్రస్తుతం, ఈ ఇరవై మూడవ లక్షణమైన ధృతి వీటన్నిటికీ విలక్షణ మైనది. కనుకనే, దైవీ సంపదలో చేర్చ బడింది.

దేహం ధాతు సంయోగముతో ఏర్పడింది. దేహం నియతితో, సంహతితో కొనసాగుతూ ఉంటుంది.

దేహంలో శక్తి ఉంది. ఆ శక్తి స్థిరమైంది కాదు. ఏ కారణం చేత నైనా దేహం శక్తిహీనం కావచ్చు. అశక్తతకు లోను కావచ్చు. అధిక శ్రమతో అలసి నపుడు దేహం బలహీనం అవుతుంది. వ్యాధుల వాత పడ్డప్పుడు, దేహ బాధలు ప్రాప్తించి నపుడు దేహం శక్తిహీన మవుతుంది. ప్రమాదాలు సంభవించి, అంగ వైకల్యం ప్రాప్తించినా దేహం శక్తిని కోల్పోతుంది. గాయాల కారణంగా పటుత్వాన్ని కోల్పోతుంది. అలాంటి సమయాలలో మనిషి లోని ధైర్య, స్థైర్యాలు సహజం గానే సన్నగిల్లుతాయి. అలాగే ఇంద్రియాలు కూడా నిస్సారమై, శక్తిహీన మవుతాయి.

ఇలాంటి ప్రత్యేక పరిస్థితులలో, దేహేంద్రియాలకు ఉపద్రవాలు ప్రాప్తించి అవి బలహీన పడినపుడు, అవి క్రుంగి పోకుండా, వాటిని నిశ్చలంగా నిలిపే అంతఃకరణ వృత్తి విశేషమే ఇక్కడ ధృతి, లేదా ధైర్యము ***(ధృతిః - దేహేన్ద్రియేషు అవసాదం ప్రాప్తేషు తస్య ప్రతిషేధకః అంతఃకరణ వృత్తి విశేషః యేన ఉత్తంభితాని కరణాని దేహశ్చ న అవసీదన్తి।).*** మనస్సులో ఈ విధమైన ధృతి ఉన్నప్పుడు దేహేంద్రియాలు అవసాదమును పొందవు. దీనిని కేవలం మనో ధైర్యంగా స్వీకరించ డానికి లేదు. కర్మఫలాల యందు సంపూర్ణ అవగాహన కలిగి, ధర్మయుత మైన కర్తవ్య దీక్షా పరాయణుడైన వ్యక్తికి ఏర్పడే జ్ఞానపూరిత మైన అంతఃకరణ వృత్తి విశేషమే ఇక్కడ ధృతి శబ్దము చేత తెలియ బడుతూ ఉంది.

**(24) శౌచము**

శౌచము అంటే శుభ్రత. శౌచము అనేది రెండు విధాలుగా ఉంటుంది ***( శౌచం ద్వివిధం బాహ్యమ్ అభ్యన్తరం చ ).*** బాహ్య శౌచము, అభ్యంతర శౌచము అని శౌచము రెండు రకాలు. బాహ్యము అంటే దేహము, దేహము ధరించే దుస్తులు, దేహము ఉండే పరిసరాలు. ఇవన్నీ శుభ్రంగా ఉంటే బాహ్య శౌచము ఉందని అర్థము.

అభ్యంతర శౌచము అంతఃకరణమునకు సంబంధించినది. చిత్తమును నిర్మలంగా ఉంచు కోవడమే అభ్యంతర శౌచము.

బాహ్యాభ్యంతరాలలో అశౌచము లేకుండా చూసుకోవడమే శౌచము. బాహ్యాభ్యంతరాలు ఎలా అశుద్ధ మవుతాయి? వాతావరణ కాలుష్యము, పరిసర మాలిన్యాల చేత బాహ్య శౌచము పాడవుతుంది. రాగద్వేషా లనే మల దోషము చేత అంతరంగము మలిన పడుతుంది. బాహ్యాభ్యంతరాలు శుద్ధి పడినపుడే వ్యక్తికి సాధన విషయంలో ఉద్యమించే ఉత్సాహం కలుగుతుంది. అందుచేత శౌచమును దైవీ సంపదలో చేర్చడం జరిగింది.

బాహ్యాభ్యంతరాలను ఎలా శుద్ధి చేసుకోవాలి? మృజ్జలాదుల చేత బాహ్య మాలిన్యాన్ని తొలగించు కోవాలి ***( మృజ్జల కృతం బాహ్యమ్ ).*** మనస్సును నిర్మలంగా ఉంచుకోవడం చేత అంతశ్శౌచాన్ని పొందాలి ***(అభ్యన్తరంచ మనో బుద్ధ్యోః నైర్మల్యం ).*** మనస్సులో వంచన, రాగద్వేషాది కాలుష్యం లేకుండా చేసుకోవడమే అంతఃకరణ శుద్ధి ***( మాయా రాగాది కాలుష్య అభావః ).*** బాహ్యాభ్యంతరాలలో శుద్ధి పడటము చేత, పరిశుద్ధ మైన ఆత్మస్వరూ పానుభూతికి మార్గం సుగమం అవుతుంది. అందుచేత, శౌచమును దైవీ సంపదగా పరిగణించడం జరిగింది. ఈ శౌచమును పన్నెండవ అధ్యాయంలో 'శుచి' శబ్దం చేతను *(12 వ అ - 12 వ శ్లో),* పదమూడవ అధ్యాయంలో 'శౌచం' శబ్దం చేతను *(13 వ అ - 7 వ శ్లో)* చెప్పుకొని ఉన్నాం.

**(25) అద్రోహము**

అద్రోహము అంటే ద్రోహ బుద్ధి లేకుండా ఉండటము అని అర్థము. పరులను హింసించాలి, బాధించాలి అనే కోరిక లేక పోవడము అద్రోహము ***( అద్రోహః పరజిఘాంసాభావః, అహింసనమ్ ).*** తనకు అపకారము చేసిన వారిపై పగ తీర్చుకోవాలనే ద్రోహబుద్ధి లేక పోవడము అద్రోహము. ద్వేష భావము ద్రోహబుద్ధిని





ప్రేరేపిస్తుంది. ద్వేషమే లేనపుడు ద్రోహ చింతన ఏర్పడే అవకాశం ఉండదు. ద్వాదశాధ్యాయంలో భక్తుని లక్షణా లలో మనం ప్రథమంగా చూసిన ***అద్వేష్టా సర్వభూతానాం*** అనే లక్షణము ప్రస్తుతం మనం చెప్పు కుంటున్న అద్రోహ లక్షణానికి పునాది వంటిది.

**(26) నాతిమానితా**

దైవీ ప్రకృతిలో నాతిమానితా చివరిది. అభయంతో మొదలైన లక్షణాలు నాతిమానితా వద్ద పూర్తయ్యాయి. ఇదంతా దైవీ సంపద.

మానితా అంటే గౌరవము. అతిమానితా అంటే అతిశయించిన గౌరవము. నాతిమానితా అంటే అతిశయించిన గౌరవము యొక్క అభావము. ఇది దైవ లక్షణము. దైవీ సంపద ***( నాతిమానితా, అత్యర్థం మానః అతిమానః స యస్య విద్యతే సః అతిమానీ, తద్భావః అతిమానితా, తదభావః నాతిమానితా ).*** నేను గొప్పవాణ్ణి, పూజ్యుణ్ణి అనే భావం లేక పోవడము అని అర్థం.

ప్రతి మనిషికి తనపై తనకు గౌరవం ఉండాలి. లేకపోతే, తనను తాను తక్కువగా ఊహించుకొని న్యూనతలో పడి చింతించే అవకాశం ఉంటుంది. అలాగని అతిశయించిన గర్వముతో అభిమానము ప్రదర్శించడము అనర్థ దాయకము. అనాత్మ వస్తువు నందు ఆత్మ అభినివేశమే ఈ అభిమానానికి కారణము. ఆ తరువాత అదే గర్వమును పురికొల్పుతుంది. ఈ విధమైన గర్వానికి పదవి కారణం కావచ్చు. తెలివి కారణం కావచ్చు. సంపద కారణం కావచ్చు. సౌందర్యము కారణము కావచ్చు. ఈ విధమైన మానిత్వం ఎవరిలో ఉందో అతడు మాని లేదా అభిమాని. అదే అతిశయిస్తే అతిమానిత్వం. ఈ అతిమానిత్వం లేక పోవడం నాతిమానిత్వం. అదే అమానిత్వం. అమానిత్వం కల వాడు అమానీ ***( అనాత్మ వస్తుషు ఆత్మాభిమానః నాస్తి అస్య ).*** అనాత్మ వస్తువుల యందు ఆత్మాభిమానం లేని వాడు అమానీ. అభిమానం కల వాడు మానీ. అతిశయించిన మానిత్వం కల వాడు అతిమానీ. అది లేని వాడు నాతిమానీ. అతని స్వభావమే నాతిమానితా. దైవీ ప్రకృతికి సంబంధించిన సుగుణము. సులక్షణము.

ప్రస్తుత అధ్యాయం మొదటి శ్లోకం లోని ప్రథమ లక్షణ మైన **అభయం** మొదలుకొని మూడవ శ్లోకంలో చివరగా చెప్పబడిన ఇరవై ఆరవ లక్షణ మైన **నాతిమానితా** వరకు ఉన్న లక్షణా లన్నీ దైవీ సంపదలో పుట్టిన వానికి కలుగు తున్నాయి. చివరగా అర్జునుణ్ణి ***భారతా!*** అని సంబోధించి, అర్జునా! నువ్వు పవిత్రమైన భరత వంశములో ఉద్భవించావు. నువ్వు పవిత్రుడవు. దైవీ సంపదకు యోగ్యుడవు అని సూచిస్తున్నాడు భగవానుడు.

***తం విద్యా కర్మణీ సమార భేతే పూర్వ ప్రజ్ఞా చ -*** ఒక వ్యక్తికి సంబంధించిన విద్య, కర్మ, ప్రజ్ఞ - ఇవన్నీ పూర్వ జన్మల నుండి వెంబడించి వస్తూ ఉంటాయి అని శ్రుతి ప్రమాణము. కనుక దేవతలకు సంబంధించిన దైవీ ప్రకృతితో పుట్టిన వారికి దైవ సంపద పుష్కలంగా ఉంటుంది. అట్టి వారికి భవిష్యత్తులో జీవితము కళ్యాణకరంగా ఉంటుంది ***( దేవానాం సంపదం అభిలక్ష్య జాతస్య దైవ విభూత్యర్హస్య భావి కళ్యాణస్య ఇత్యర్థః హే భారత! ).***

*దైవీ సంపదను ఇరవై ఆరు లక్షణాలతో మూడు శ్లోకాలలో వివరించిన పరమేశ్వరుడు, ఇక ఆసురీ సంపదను ఆరు లక్షణాలతో తరువాత శ్లోకంలో వర్ణిస్తున్నాడు.*

దమ్భో దర్పోఽభిమాన శ్చ క్రోధః పారుష్య మేవ చ ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సమ్పద మాసురీమ్ ॥ 4

**దంభః-దర్పః-అభిమానః-చ-క్రోధః-పారుష్యం-ఏవ-చ**
**అజ్ఞానం-చ-అభిజాతస్య-పార్థ-సంపదం-ఆసురీం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = | అర్జునా! | పారుష్యం ఏవ చ | = | పరుష వచనము |
| దంభః | = | కపటము | అజ్ఞానం చ | = | అజ్ఞానమును |
| దర్పః | = | గర్వము | ఆసురీం | = | రాక్షస సంబంధమైన |
| అభిమానః చ | = | దురభిమానము | సంపదం | = | సంపదను గూర్చి |
| క్రోధః | = | క్రోధము | అభిజాతస్య | = | పుట్టిన వానికి |

**అర్జునా! దంభము, గర్వము, దురభిమానము, క్రోధము, పారుష్యము, అజ్ఞానము- ఈ లక్షణాలు అసుర సంపద గల వానికి కలుగుతాయి.**

### వ్యాఖ్య

జన్మల ప్రవాహంలో మతి తప్పి, గతి చెడి ప్రయాణం సాగిస్తున్న అయోమయ జీవులం. ఎవరము ఎక్కడ ఎందుకు పుట్టామో తెలియక పోయినా, అందరం పుట్ట వలసిన ప్రదేశం లోనే పుట్టాము. ఉండ వలసిన వ్యక్తుల మధ్యే ఉన్నాము. నేటి మన జన్మల్ని నిర్ణయించింది ఒకనాడు మనం చేసిన కర్మలే. గతంలో ఏమి చేశామో దాని ఫలం గానే నేడు ఉండ వలసిన విధంగా ఉన్నాము. ***పుణ్యః పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన*** - పుణ్య కర్మను ఆచరించిన వాడు దైవీ సంపదతో పుణ్యాత్ముడుగా పుడితే, పాపకర్మను ఆచరించిన వాడు ఆసురీ సంపదతో పాపాత్ముడుగా పుడుతాడు అన్నది వేదం.

దైవ గుణాలను సంపదగా అభివర్ణిస్తే అర్థం చేసుకోవచ్చు. అసుర లక్షణాలను కూడా సంపదగా చెబుతున్నారే అనే సంశయం మీకు కలగ వచ్చు. ఏవయినా జన్మార్జితాలుగా ప్రాప్తించినవే కాబట్టి, ఎవరికి ఏది ఉందో అదే వారి సంపద అనే భావనతో అసుర గుణాలను 'ఆసురీ సంపద' అనడం జరిగింది. దైవీ సంపదతో పుట్టిన వారి సంపదను ఇరవై ఆరు లక్షణాలతో చెప్పుకున్నాం. ఇక ఆసురీ సంపదతో పుట్టిన వారి సంపదను ఆరు లక్షణాలతో చెప్పుకో బోతున్నాం.

**(1) దంభము**

ఆసురీ సంపదలో మొదటిది దంభము. పదమూడవ అధ్యాయంలో అమానిత్వాది జ్ఞాన లక్షణాలలో అదంభిత్వ మనే లక్షణానికి విరుద్ధ మైనది దంభము. దంభము అంటే డాంబికత్వము, దంభాచారము, బడాయి ప్రదర్శనము. లేని దానిని ప్రదర్శించే కపట వర్తనము. పేరు కొరకు ప్రాకులాడే మనస్తత్వము. లేని శ్రేష్ఠత్వాన్ని ప్రదర్శించు కోవడం దంభము. వేష, భాష, ఆచారాదులలో వైభవాన్ని ప్రదర్శించుకుంటూ తానే గొప్పవాడని విర్ర వీగడము దంభము.

దంభము అనేది కుటిలత్వము. కపట వర్తనము. మోసపూరిత జీవనము. దైవ సంపదలో ఋజుత్వ ముతో ప్రవర్తించే పుణ్యాత్ములను చూశాము. ఆసురీ సంపదలో బాహ్యాభ్యంతరాలలో భిన్న ప్రవర్తన కలిగిన అహంకారులను చూస్తాము.

దంభము అనే ఈ దుర్గుణాన్ని ఆచార్యుల వారు భాష్యంలో 'ధర్మధ్వజిత్వం' అన్నారు ***( దంభః ధర్మ ధ్వజిత్వమ్ ).*** ధర్మధ్వజిత్వము అంటే ధర్మ మనే జండాను చేత పట్టుకొని, తానే ధర్మజ్ఞు డైనట్లు, ధర్మాత్ము డైనట్లు, పరులు విశ్వసించే లాగా దంభమును ప్రదర్శించడం అని అర్థం.





డంబాచారులకు ధర్మము అవసరం లేదు. దైవం అవసరం లేదు. మోక్ష మనేది వారి నిఘంటువులో అలభ్య మైన పదము. వారికి ప్రజల మన్నన కావాలి. లోకం వాళ్ళను గుర్తించాలి. గౌరవించాలి. అందుకోసం విచిత్ర వేషధారణ లన్నీ చేస్తారు. అద్భుతమైన అభినయాలను ప్రదర్శిస్తారు.

అనేక సేవా కార్యక్రమాలను చేపడతారు. విశేషంగా ధనాన్ని వెచ్చిస్తారు. ప్రజల ప్రశంసలు అందు కుంటారు. 'త్యాగ ప్రపూర్ణ - సేవా ప్రవీణ' ఇత్యాది బిరుదుల్ని ఎలాగో సంపాదించు కుంటారు. అమాయకు లైన ప్రజలు ఈ సేవ లన్నీ నిజమే నని, వారి కోసమే నని భ్రమిస్తారు. అంతే, ఇక ఆ క్షణం నుండి వారి వ్యాపారం మూడు పువ్వులు - ఆరు కాయలుగా విస్తరిస్తుంది.

మోసాలు ఎంతో కాలం దాగవు. కపటాలు కలకాలం మన లేవు. ఏదో ఒకనాడు గుట్టు బయట పడు తుంది. అప్పుడు లోకం తెలుసు కుంటుంది. ఏమని? ఇంత కాలం వారు సాగించిన నిర్వాక మంతా సేవ కాదని, సేవ పేరుతో సాగిన వ్యాపార మని. వెచ్చించింది త్యాగధనం కాదని, దూరదృష్టితో అధిక లాభాలను ఆర్జించేందుకు పెట్టిన పెట్టుబడి అని.

**ఆఖ్యాయిక**

కొన్ని శతాబ్దాల క్రితం జరిగిందని చెప్పుకొనే దంత కథ. పూర్వం ఒక రాజ్యాన్ని శిష్టాచార సంపన్నుడైన రాజు పరిపాలిస్తూ ఉండే వాడు. ఆ రాజుకు ఒక అందమైన కుమార్తె. తన బిడ్డను భక్తుడు, యోగ్యు డైన వానికి ఇచ్చి వివాహం చెయ్యాలని రాజు నిశ్చయించు కుంటాడు.

ఆ రాజకుమారిని ఒక ముసల్మాను ప్రేమించాడు. ఎలాగైనా ఆవిడ్ని వివాహం చేసుకోవాలని సంకల్పించాడు. అంతే. భక్తుని వేషం ధరిం చేశాడు. భక్తిని అభినయిస్తూ పట్టణవాసు లందరి మనస్సుల్ని దోచేసు కున్నాడు.

రాజు కూడా అతనికి వశ పడ్డాడు. స్వాముల వారి రూపంలో ఉన్న ముసల్మానును నగరికి ఆహ్వానించాడు. తన సంస్థానం లోనే విడిది ఏర్పాటు చేశాడు. అతని సదాచారమును, నిత్యానుష్ఠానమును చూచి ముగ్ధుడైన ప్రభువు, రాజకుమారిని అతని కిచ్చి వివాహం చేయడానికి నిశ్చయించు కున్నాడు. రాజకుమారి కూడా యువకుడైన స్వామిని ఇష్ట పడింది. సంబరానికి అందరూ సిద్ధ పడుతున్నారు.

ఇంతలో మంత్రికి ఎందుకనో అనుమానం వచ్చింది. తన అనుమానాన్ని దాచుకోకుండా రాజుకి రహస్యంగా విన్నవించు కున్నాడు. తనకు ఒక అవకాశ మిస్తే వాస్తవాన్ని కనిపెడతా నన్నాడు మంత్రి. రాజుకి మంత్రి అంటే ఎనలేని ప్రేమ, విశ్వాసము. అలాగే నన్నాడు రాజు.

ఒకనాటి అర్ధరాత్రి సమయం. స్వాముల వారు భోం చేసి పవ్వళించి ఉన్నారు. పైగా గుర్రు పెడుతున్నారు. ఒక ఇనుప కడ్డీని నిప్పులో బాగా కాల్చి, నిదుర పోతున్న స్వామి వారి పాదానికి గట్టిగా అంటించాడు మంత్రి. స్వామి వారు 'అల్లా!' అంటూ చివుక్కున లేచి గదంతా గంతు లేశారు. అంతే. మరి పెళ్ళి మాటేమిటి అంటారా? ఏమో, నాకూ తెలియదు. నేను రెండవ లక్షణం వైపు పోతున్నా.

**(2) దర్పము**

దర్పము అంటే గర్వము, లేదా మదము. పెద్దలను, పూజ్యులను పరాభవించ డానికి హేతువు ఇదే. మరి దేనిని చూసుకొని మనిషి గర్వ పడతాడు? ***విద్యా ధన స్వజనాది నిమిత్తః ఉత్సేకః దర్పః*** - విద్య, ధనము, స్వజనము మొదలైన విషయాల కారణంగా ఏర్పడిన ఉత్సేకమే దర్పము. ఉత్సేకము అంటే గర్వము.

తాను గొప్ప విద్యావంతు డనే గర్వము. తాను సంపన్ను డనే గర్వము. తనకు విశేషంగా బంధుజన మున్నారనే గర్వము. ఇదంతా అజ్ఞాన జనితము. చీకటి బ్రతుకు. ఏది ఎందు కున్నదో అర్థం గాని అయోమయ స్థితి. అవివేక స్థితి. ఇదంతా సంపదే నని మనిషి విర్ర వీగుతాడు. వాస్తవానికి ఇది ఆసురీ సంపద. సంపద రూపంలో గోచరించే ఆపద.

ఆసురీ సంపద కలిగి గర్వంతో మద మెక్కిన వారికి సుభాషితాలు రుచించవు. చెవిటి వాని ముందు శంఖమును పూరించినట్లే ఉంటాయి. విద్య, ధనము, జనము ఉండటము మంచిదే. ఈశ్వరానుగ్రహం వల్లనే అవన్నీ ప్రాప్తిస్తాయి. అనుగ్రహాలను అనుగ్రహాలుగా స్వీకరించాలే గాని అతిశయించిన గర్వంతో బ్రతుకులను శని గృహాలుగా మార్చుకో కూడదు. ఏవి ఉన్నా, ఈ ప్రపంచంలో ఎంత కాలం ఉంటాయి? అసలు మన మెంత కాలం ఉంటాము? ధన జనాదులు ఉంటే ఉండనీ. తప్పు లేదు. కాని, వాటితో పాటు గర్వాన్ని పెంపొందించు కోవద్దు అంటూ, దర్పానికి వ్యాఖ్యానమా అన్నట్లు భజగోవిందంలో ఆచార్యుల వారు జ్ఞానోపదేశం చేశారు. వివేక వైరాగ్యాలను జోడించి బుద్ధి చెప్పారు.

*శ్లో॥ మా కురు ధన జన యౌవన గర్వమ్*
*హరతి నిమేషాత్ కాలః సర్వమ్ ।*
*మాయా మయ మిదం అఖిలం హిత్వా*
*బ్రహ్మపదం త్వం ప్రవిశ విదిత్వా ॥*
*భజగోవిందం - భజగోవిందం*
*గోవిందం భజ - మూఢమతే ॥ భజ ॥*

'ధన ముందని, జన మున్నారని, యౌవన ముందని గర్వించకు. వీటన్నిటిని ఊడ్చేయడానికి కాలానికి నిమిషం పట్టదు. ఇది మాయా ప్రపంచ మని తెలుసుకో! అనిత్య మని అర్థం చేసుకో! సత్యరూప మైన బ్రహ్మమును తెలుసుకొని తరించి పో!' అని ఆదేశించారు భజగోవిందంలో ఆచార్యులు.

### (3) అభిమానము

అభిమానము అనే పదానికి అతిమానము అనే పాఠాంతరము కూడా ఉంది. తానే శ్రేష్ఠుడు. తానే పూజ్యుడు, అన్యుల కన్నా అధికుడు అనే స్వాభిమానంతో అందరి నుండి మన్ననలను ఆశించే అల్ప గుణమే అభిమానము. కొందరికి తమది గొప్ప కులం అనే కులాభిమానము. కొందరికి తాము అందగాళ్ళము అనే రూపాభిమానము. అలాగే ధనాభిమానము, గుణాభిమానము, వంశాభిమానము, విద్యాభిమానము. కొందరి కేమో తమకు అభిమానమే లేదు అనే అభిమానము. అభిమానం గల వారికి ఆత్మజ్ఞానం కలుగదు. అనాత్మను ఆత్మగా భావించే మూర్ఖులకు ఆత్మజ్ఞానం ఎలా వంట పడుతుంది?

గర్వము, అభిమానము మొదలైన అసుర గుణాలు జ్ఞాన ప్రతిబంధకాలు. ***అభిమానస్య జ్ఞాన ప్రతిబంధకత్వాత్ సాకల్యేన తం పరిత్యజ !*** - అభిమానము జ్ఞానానికి అవరోధము కనుక, దానిని పూర్తిగా విడిచి పెట్టెయ్యాలి అన్నారు స్వయంప్రకాశ యతీంద్రులు.

### (4) క్రోధము

ఇక నాల్గవది క్రోధము. ఆశించి పొందా లనుకున్నది పొంద లేనపుడు మనిషిలో నిరాశ జనిస్తుంది. అట్టి నిరాశకు కారణ మైన దానిపై కోపం పుడుతుంది. అదే క్రోధము. భయంకరమైన రాక్షస గుణము.





విషయాల యందు కోరికను కామం అంటాము. కోరిక ఫలించకుండా దానికి అవరోధంగా నిలిచిన దానిపై ఏర్పడే చిత్తవృత్తియే క్రోధము. ఈ కామక్రోధాలను పరిత్యజించిన వాడే ధ్యానయోగి అవుతాడు అన్నారు స్వయంప్రకాశ యతీంద్రులు ***( కామః ఇచ్ఛా విషయేషు, తస్య ప్రతిహతౌ జాతా చిత్తవృత్తిః క్రోధ ఇత్యుచ్యతే, తదుభయ పరిత్యాగే ధ్యానాకారీ భవేత్ ! ).***

క్రోధము దారుణ మైన అసుర లక్షణము. పట్టిందంటే విడిచి పెట్టదు. నిప్పు లేకుండానే తగల బెడుతుంది. నీళ్ళు లేకుండానే నిలువున ముంచేస్తుంది. క్రోధము రాగానే బుద్ధి పట్టు తప్పుతుంది. పెనుగాలికి అరటి చెట్టు ఊగినట్లు, క్రోధ ప్రభంజనానికి అంతఃకరణము చెదిరి పోతుంది. గాలి విపరీతంగా వీచి నపుడు సమస్తమూ ఎలా అగమ్య గోచరంగా ఉంటుందో, అలాగే క్రోధ వాయువు వీచి నపుడు బుద్ధిలో సమ్మోహం ఏర్పడి ***( క్రోధాద్భవతి సమ్మోహః ).*** ఏది కృత్యమో, ఏది అకృత్యమో తెలిసి రాదు. ఈ విధంగా అజ్ఞాన రూపమైన క్రోధ రాక్షసి జ్ఞానాన్ని అపహరించుకొని పోతుంది.

*శ్లో॥ కామక్రోధశ్చ లోభశ్చ దేహే తిష్ఠన్తి తస్కరాః*
*జ్ఞాన రత్నాప హారాయ తస్మాత్ జాగ్రత జాగ్రత !*

కామక్రోధ లోభు లనే ముగ్గురు భయంకర శత్రువులు ఉన్నారు. వారెక్కడో బాహ్యంలో లేరు. మన దేహం లోనే ఉన్నారు. జ్ఞాన మనే రత్నాన్ని అపహరించుకొని పోవడానికి కాచుకొని ఉన్నారు. అందుచేత అందరూ అవధానంతో జాగరూకులై ఉండాలని శాస్త్రం హెచ్చరించింది.

### (5) పారుష్యము

పారుష్యము అంటే పరుష వచనము ***( పారుష్య మేవ చ పరుష వచనం ).*** ఇతరులను పరుషంగా మాట్లాడి గాయ పరచడము పారుష్యము. దైవీ సంపదలో మనం చెప్పుకున్న మార్దవానికి వ్యతిరేకము ఈ పారుష్యము. పారుష్య మంటే కేవలం పరుష వాక్కులే అని కాదు. పరుషం కాకపోయినా వ్యంగ్య ధోరణిలో విమర్శనాత్మకంగా సాగించే తియ్యటి వ్యాఖ్యానాలు అని అర్థం. అదెలా గంటే . . . .

గ్రుడ్డి వాడు కూర్చుని ఉంటే, అతడు గ్రుడ్డి వాడని తెలిసినా, తెలియనట్లు నటిస్తూ, 'ఏమిటీ! అలా తదేకంగా నన్నే చూస్తున్నారు? మీ కళ్ళు ఎంత అందంగా ఉన్నాయో!' అంటూ గేలి చేయడం పారుష్యము ***(యథా కాణం చక్షుష్మాన్ ).*** అలాగే కురూపిని అందగాడని అభివర్ణించడం ***( విరూపం రూపవాన్ ).*** ఇలాంటి నీచ హాస్యమును నలుగురి ముందు ప్రదర్శించి ఆనందించే పైశాచిక ప్రలాపా లన్నీ పారుష్యమే. ఆసురీ సంపద లోని దుష్ట లక్షణమే.

### (6) అజ్ఞానము

ఆసురీ సంపదలో ఆరవది అజ్ఞానము. ఇక్కడ అజ్ఞానము అంటే అవివేక జ్ఞానం ***( అజ్ఞానం చ అవివేక జ్ఞానం ).*** అవివేక జ్ఞానము అంటే, ఏది చేయదగింది, ఏది చేయ కూడనిది అనే 'కర్తవ్య - అకర్తవ్య' విషయాల యందు విరుద్ధమైన జ్ఞానం ***( కర్తవ్య అకర్తవ్యాది విషయ మిథ్యా ప్రత్యయః ).*** ఈ సందర్భములో ఒక్క విషయం జ్ఞాపకం పెట్టుకోవాలి. ఇక్కడ అజ్ఞానము, అవివేకము అనే పదాలున్నా యని, అజ్ఞానము అంటే ఆత్మ విషయానికి సంబంధించిన అజ్ఞానము అని, వివేకము అంటే ఆత్మానాత్మ వివేక మని అర్థం చేసుకో కూడదు. మనం చర్చిస్తున్నది అసుర సంపత్తిని గూర్చిన విషయం. ఆసురీ సంపదలో ఆత్మ ప్రసక్తి అనూహ్యము.

కర్తవ్య, అకర్తవ్యాలను తారుమారు చేసి అర్థం చేసుకొని, ఒక నిర్ణయానికి రావడమే ఇక్కడ అవివేకము. కర్తవ్య, అకర్తవ్యాలలో వివేకం లోపించి ఉన్నందున వాటి విషయంలో అజ్ఞానము ఉంది అని అర్థం. అంతే.

ఇంతవరకు మనం వివరించుకున్న ఆరు లక్షణాలు ఆసురీ సంపద యందు పుట్టిన వారిలో ఉంటాయి ***( అసురాణాం సంపత్ ఆసురీ, తామ్ అభిజాతస్య ఇత్యర్థః ).***

దైవీ సంపదకు సంబంధించిన లక్షణాలను పూర్తి చేస్తూ అర్జునుని *భారత* అని మూడవ శ్లోకంలో సంబోధించిన భగవానుడు, ప్రస్తుత శ్లోకంలో ఆసురీ సంపదకు సంబంధించిన లక్షణాలను పూర్తి చేస్తూ **పార్థ** అని సంబోధించాడు.

అటు తండ్రి వైపు చూస్తే, అతనిది దీప్తిమంత మైన భరత వంశము. ఇటు మాతృమూర్తిని చూస్తే, ఆమెది పవిత్రతకు పుట్టినిల్లు. పితృ, మాతృ వంశములు రెండును దైవీ సంపదతో నిండి ఉన్నవే కనుక, అర్జునుడు దైవీ సంపదను మూట గట్టుకొని జన్మించిన వాడే గాని ఆసురీ సంపదకు సంబంధించిన వాడు కాడని స్పష్టం చేసిన ట్లైంది.

*ఈ ఉభయ సంపదల ఫల మేమిటో చెబుతున్నాడు.*

దైవీ సమ్ప ద్విమోక్షాయ నిబన్ధా యాసురీ మతా ।
మా శుచ స్సమ్పదం దైవీ మభిజాతోఽసి పాణ్డవ ॥ 5

***దైవీ-సంపత్-విమోక్షాయ-నిబంధాయ-ఆసురీ-మతా***
***మా-శుచః-సంపదం-దైవీం-అభిజాతః-అసి-పాండవ***

| | | | | | |
|---|---|---|---|---|---|
| పాండవ | = అర్జునా! | | మతా | = | చెప్పబడింది |
| దైవీ | = దైవ సంబంధమైన | | దైవీం | = | దైవ సంబంధమైన |
| సంపత్ | = సంపద | | సంపదం | = | సంపదను గురించి |
| విమోక్షాయ | = ముక్తి కొరకు | | అభిజాతః | = | పుట్టిన వాడవు |
| ఆసురీ | = రాక్షస సంబంధమైన | | అసి | = | అయి ఉన్నావు |
| సంపత్ | = సంపద | | మా శుచః | = | దుఃఖించకు |
| నిబంధాయ | = బంధము కొరకు | | | | |

**దైవీసంపద మోక్షమును, అసురసంపద బంధమును కలిగిస్తాయి. అర్జునా! నువ్వు దైవసంపద గల వాడివి. అందుచేత దుఃఖించకు!**

## వ్యాఖ్య

అధ్యాయారంభంలో వరుసగా మూడు శ్లోకాలలో దైవీ సంపద లక్షణాలను చూశాం. నాల్గవ శ్లోకంలో ఆసురీ సంపదను కూడా తెలుసుకున్నాం. యుక్తా యుక్తాలను అర్థం చేసుకున్నాం. ప్రస్తుత శ్లోకంలో ఉభయ సంపదల ఫల విభాగాన్ని వివరిస్తూ, 'అర్జునా! దైవీ సంపద సంసార బంధము నుండి విముక్తి కొరకు సహకరిస్తుంది. ఆసురీ సంపద సంసార బంధమును దృఢ పరుస్తుంది. పాండు కుమారా! బాధ పడకు. నువ్వు దైవీ సంపద లోనే పుట్టావు' అని అభయ మిచ్చాడు ఆదిదేవుడు.

అర్జునుడు పుణ్యాత్ముడు. ధర్మాత్ముడు. దైవీ సంపదలో పుట్టిన వాడు. దైవీ సంపదలో పుట్టడానికి కావలసిన పుణ్యా మేదో అతనికి గతం లోనే ఉంది. దైవీ సంపదలో పుట్టిన ఆ ధర్మాత్ముడు దైవ మార్గం లోనే చరిస్తున్నాడు కనుక, అతని భవిష్యత్తు కూడా కళ్యాణకరం గానే ఉంటుంది. అందుకే, దుఃఖించ వద్దని





పరమేశ్వరుడు అభయ ప్రదానం చేస్తున్నాడు. **పాండవ!** అని సంబోధించి అర్జునుని జన్మ వైశిష్ట్యాన్ని స్పృశిస్తూ, అతని దైవీ సంపదను స్వయంగా ప్రస్తుతిస్తున్నాడు.

అర్జునుని విషయం అలా ఉంచితే, మన పరిస్థితి ఏమిటి? ఉభయ సంపదలను అర్థం చేసుకున్నాం. మనది ఆసురీ సంపద అని అన లేము. మనలో కొన్ని లక్షణాలు దైవీ సంపదకు సంబంధించినవి కూడా ఉన్నాయి. అలాగని, దైవీ సంపద కల వారము అని కూడా చెప్ప లేము. మనలో ఆసురీ సంపదకు సంబంధించిన లక్షణాలు కూడా స్పష్టంగా కనిపిస్తున్నాయి.

మనం సామాన్యులం. సాధారణ మానవులం. తల పై కెత్తి ఎంత ఎత్తు కైనా చూడ వచ్చు. కాని, మన పాదాలు మాత్రం భూమి మీదనే ఉండాలి. మనలో ఉభయ సంపదలూ ఉన్నాయి. గుణ దోషాలు రెండూ ఉన్నాయి. కేవలం గుణాలే ఉన్న వాళ్ళు, కేవలం దోషాలే ఉన్న వాళ్ళు మానవులలో సాధారణంగా ఉండరు. గుణ దోషాల మిశ్రమం ఉన్న వాళ్ళే అధిక శాతం మానవులుగా జన్మిస్తారు.

***నాత్యన్తం గుణవత్ కించి న్నాత్యన్తం దోషవత్ తథా*** - 'అంతా గుణమయమే అని చెప్పలేము; అలాగని అంతా దోషమయం కూడా కాదు' అని వ్యాస భగవానుడే అభిప్రాయ పడ్డాడు. ఇదీ మన నేపథ్యం.

దైవీ సంపద సంసార బంధ విముక్తికి, ఆసురీ సంపద సంసార బంధానికి సహకరిస్తా యని ఫల విశేషాన్ని చెప్పడం లోనే పొంద వలసింది ఏమిటో, పోగొట్టుకో వలసింది ఏమిటో భగవంతుడు చెప్పకనే చెప్పేశాడు. ఒకవేళ పొంద దగింది మన వద్ద పుష్కలంగా లేకపోతే దానిని ప్రయత్నించి పొందాలని, అలాగే పోగొట్టుకో వలసింది మన వద్ద ఉంటే దానిని గట్టి ప్రయత్నంతో పోగొట్టుకోవాలని స్పష్టంగా చెప్పడం జరిగింది.

### దారేదో? దిశ ఎటో?

దైవీ సంపద సంసార బంధ విమోచనం కొరకు, ఆసురీ సంపద సంసార బంధానికి చెప్ప బడ్డాయి. దీనిని కూడా జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. దైవీ సంపద సంసార బంధ విమోచనం కొరకు చెప్పబడింది అంటే, దైవీ సంపద వల్ల మోక్షం ప్రాప్తిస్తుందని కాదు. అలాగే ఆసురీ సంపద సంసార బంధం కొరకు చెప్ప బడింది అంటే, ఆసురీ సంపద వల్ల సంసార బంధము ఏర్పడు తుందనీ కాదు.

సంసార బంధ విమోచనము, లేదా మోక్షము అనేది జ్ఞానం వల్లనే కలుగుతుంది. కేవలం ఆత్మజ్ఞానం వల్ల కలుగుతుందే గాని, దైవీ సంపద వల్ల కాదు. కాకపోతే, జ్ఞానాన్ని పొందడానికి మనిషిలో దైవీ సంపద ఉండి తీరాలి. దైవీ సంపద లేనిదే అంతఃకరణ శుద్ధి ఏర్పడదు. అంతఃకరణ శుద్ధి లేనిదే జ్ఞానం ఉత్పన్నం కాదు. ఈ విధంగా దైవీ సంపద జ్ఞాన సాధనమే గాని, మోక్షానికి సాక్షాత్తు ఏక సాధనం కాదు. దైవీ సంపద ఉన్నా, జ్ఞానం లేకపోతే మోక్షం రాదు ***( జ్ఞానం వినా మోక్షః న సిద్ధ్యతి ).*** జ్ఞానం లేకుండా, కేవలం దైవీ సంపద వద్ద జీవితం ఆగిపోతే, అలాంటి వ్యక్తి స్వర్గాన్ని చేరుతాడేమో గాని మోక్షాన్ని మాత్రం పొంద లేడు.

దైవీ సంపద లేక పోవడమే సంసార బంధానికి కారణ మైతే, దైవీ సంపదను ప్రోగు చేసుకుంటే బంధ నివృత్తి జరుగుతుంది. మోక్షప్రాప్తి కలుగుతుంది. కాని, బంధానికి కారణం అజ్ఞానమే గాని దైవీ సంపద లేక పోవడం కాదు. బంధానికి అజ్ఞానము కారణ మైనపుడు, జ్ఞానమే బంధ విమోచనం కలిగించ గలదు కాని దైవీ సంపద కాదు.

***అవిద్యా కృతత్వాత్ బంధస్య విద్యయా మోక్ష ఉపపద్యతే*** - 'ఆత్మకు సంబంధించిన అజ్ఞానమే బంధానికి కారణ మైనందున, ఆత్మకు సంబంధించిన జ్ఞానమే మోక్షాన్ని కలిగిస్తుంది' అని శ్రీ శంకరులు బ్రహ్మసూత్ర భాష్యంలో విస్పష్టం చేశారు *(సూత్ర భాష్యం ; 3 - 2 - 4).*

ఈ కారణం చేతనే శ్లోకంలో 'మోక్షాయ' అనకుండా, **విమోక్షాయ** అని ఉపసర్గతో కలిపి చెప్పడం జరిగింది. దైవీ సంపద ఉన్న ట్లైతే, జ్ఞానప్రాప్తి ద్వారా మోక్షాన్ని పొందడము సులభము అని చెప్ప డానికే **విమోక్షాయ** అనడం జరిగింది.

ఇక రెండవది ఆసురీ సంపద. దైవీ సంపద మోక్షానికి సహకరించేదే గాని సాక్షాత్తు మోక్ష సాధనం కాదు అని అర్థం చేసుకున్నాం. మరి, అసుర సంపద విషయం ఏమిటి? అది సంసార బంధాన్ని కలిగిస్తుంది కదా! అదీ వాస్తవం కాదు.

మోక్షానికి దైవీ సంపద ఎలా కారణం కాదో, అలాగే బంధానికి కూడా ఆసురీ సంపద కారణం కాదు. దైవీ సంపద మోక్షాన్ని ఇవ్వలేదు. ఆసురీ సంపద బంధాన్ని సృష్టించ లేదు.

అయినా మనకు బంధం లేకపోతే కదా, ఆసురీ సంపద దానిని సృష్టించాలి? మనం బంధం లోనే ఉన్నాము. ఇక, ఆసురీ సంపద ప్రత్యేకంగా సృష్టించేది ఏముంటుంది? బంధాన్ని సృష్టించింది అజ్ఞానము. కనుక బంధానికి అజ్ఞానమే కారణం గాని ఆసురీ సంపద కాదు.

కాకపోతే, దైవీ సంపద జ్ఞానానికి సహకరిస్తూ మోక్షాన్ని సుగమం చేస్తే, ఆసురీ సంపద అజ్ఞానానికి సహకరిస్తూ బంధాన్ని దృఢం చేస్తుంది. ఈ అంతరాన్ని స్పష్టంగా గ్రహించాలి. అందుచేతనే దైవీ సంపద విషయంలో 'విమోక్షాయ' అని ప్రవచించిన పరమేశ్వరుడు, ఆసురీ సంపద విషయంలో 'బంధాయ' అనకుండా 'నిబంధాయ' అంటున్నాడు.

నిబంధము అంటే నియత మైన బంధము అని అర్థము (***నిబంధః నియతః బంధః నిబంధః***). అంటే గట్టి బంధము. బంధము అనేది ఎలాగూ అజ్ఞానం వల్ల ఏర్పడి ఉంది. ఆ ఉన్న బంధాన్ని ఈ ఆసురీ సంపద ఇంకా దృఢం చేస్తుంది అని అర్థం. ఈ శ్లోక భావాన్నంతా ఒక్క వాక్యంలో చెప్పాలంటే, బంధము నుండి విడుదల కావాలి అనేదే మన లక్ష్య మైతే, మోక్ష హేతువైన జ్ఞానానికి సహకరించే దైవీ సంపదను వృద్ధి చేసుకోవాలి. అలా కాకుండా, బంధమే అంద మని భావించి, బంధము లోనే ఉండిపో దలచుకుంటే ఆసురీ సంపదనే ఆశ్రయించ వచ్చు; ఇంకా పెంపొందించుకో వచ్చు. ఎవరి అభిమతం వారిది. ఎవరి దారి విటో, ఎవరి గమ్యం ఏదో, ఎవరికి వారే నిర్ణయించు కోవాలి.

*చెప్పింది ఏమిటో, చెప్ప బోయేది ఏమిటో సమీక్షిస్తున్నాడు.*

ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మి న్దైవ ఆసుర ఏవ చ ।
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు ॥ 6

**ద్వౌ-భూత సర్గౌ-లోకే-అస్మిన్-దైవః-ఆసురః-ఏవ-చ**
**దైవః-విస్తరశః-ప్రోక్తః-ఆసురం-పార్థ-మే-శృణు**

| | | |
|---|---|---|
| పార్థ | = | అర్జునా! |
| అస్మిన్ | = | ఈ |
| లోకే | = | లోకము నందు |
| దైవః | = | దైవ సంబంధ మని |
| ఆసురః ఏవ చ | = | అసుర సంబంధ మని |
| భూతసర్గౌ | = | ప్రాణుల పుట్టుకలు |
| ద్వౌ | = | రెండు విధములు |
| దైవః | = | దైవ సంబంధ మైనది |
| విస్తరశః | = | విస్తారముగా |
| ప్రోక్తః | = | చెప్పబడింది |
| ఆసురం | = | అసురమైన దానిని |
| మే | = | నా వలన |
| శృణు | = | విను |





**అర్జునా! మానవ లోకంలో దైవ మని, ఆసుర మని రెండు విధాలుగా ప్రాణుల పుట్టుక లున్నాయి. దైవీ సంపదను నీకు విస్తారంగా చెప్పాను. ఇక ఆసురీ సంపదను గూర్చి చెబుతాను. విను.**

**వ్యాఖ్య**

మానవ లోకంలో భూత సృష్టి రెండు విధాలుగా ఉంది. మొదటిది దైవం. అంటే, దైవ సంబంధమైన సృష్టి. రెండవది అసురం. అంటే, అసుర సంబంధమైన సృష్టి. సర్గము అంటే సృష్టి. సృజించ బడేవి కనుక అవి సర్గములు (***సృజ్యతే ఇతి సర్గః సృష్టిః***). సృష్టి ఆరంభము నందే ఈ రెండు ఉత్పత్తులు జరిగాయి అని అర్థము. ఈ విషయాన్ని శ్రుతులు ప్రామాణికంగా చెబుతున్నాయి. మానవకోటి రెండు విధాలుగా సృష్టింప బడిందని బృహదారణ్య కోపనిషత్తు ప్రవచించింది.

***ద్వయా హ వై ప్రాజాపత్యా దేవాశ్చ అసురాశ్చ*** - ప్రజాపతి, అనగా బ్రహ్మదేవుని వలన పుట్టిన మానవులు దేవతలు, అసురులు అని రెండు విధాలు అన్నది బృహదారణ్యక శ్రుతి (*1 - 3 - 1*). ఒకవేళ జాతుల ప్రస్తావన వస్తే, సృష్ట్యాదిలో దైవ, అసుర జాతులు రెండే ఉన్నాయని తెలుస్తూ ఉంది. బ్రహ్మసృష్టి ఇంతే. మరి, ఇన్ని జాతు లెలా వచ్చాయి అంటే, బహుశ అది జీవసృష్టి అయి ఉంటుంది.

దైవ సంబంధమైన దైవీ సంపదను గూర్చి ***అభయం సత్త్వ సంశుద్ధిః*** అనే గుణాల నుండి ***అద్రోహో నాతిమానితా*** అనే గుణాల వరకు సుదీర్ఘంగా, సవిస్తరంగా చెప్పడం జరిగింది అంటున్నాడు భగవంతుడు (***విస్తరశః ప్రోక్తః***). ఈ ఆదేశాన్ని ఔదల దాల్చి నేను కూడా నా వ్యాఖ్యానాన్ని సవిస్తరం గానే అందించాను. దైవీ సంపదకు సంబంధించిన కేవలం మూడు శ్లోకాలకు ఇంతగా విస్తరించి వ్యాఖ్యానించడం అవసరమా? అని చదివే టప్పుడు ఒకవేళ అనిపించి ఉంటే, ఇక్కడ ఈ ఆదేశం ఉండబట్టే అలా విస్తరించి వ్రాయవలసి వచ్చింది అనే విషయం విజ్ఞులకు ఇప్పుడు స్పష్టమై ఉంటుందని భావిస్తాను.

అర్జునా! దైవీ సంపదను విస్తరించి చెప్పాను. ప్రస్తుతం ఆసురీ సంపదను కూడా వివరిస్తాను అని శ్రీభగవానువాచ. అలా అనడంలో, ఇంతవరకు దైవీ సంపదను సవిస్తరంగా చెప్పాను, కాని ఆసురీ సంపదను సవివరంగా చెప్ప లేదు అనే భావం ధ్వనిస్తూ ఉంది (***న తు అసురః విస్తరశః***). అది వాస్తవం.

మీకు ఇక్కడ ఒక సందేహం రావచ్చు. దైవీ సంపదను ఇరవై ఆరు లక్షణాలతో, మూడు శ్లోకాల లోనే చెప్పడం జరిగింది కదా, విస్తరించి చెప్పాను అంటా డేమిటి?

దైవీ సంపదకు సంబంధించినవి ప్రస్తుత అధ్యాయారంభంలో చెప్పిన ఇరవై ఆరు లక్షణాలు మాత్రమే కాదు. రెండవ అధ్యాయం లోని స్థితప్రజ్ఞ లక్షణాలు, పన్నెండవ అధ్యాయం లోని భక్తుని లక్షణాలు, పదమూడవ అధ్యాయం లోని అమానిత్వాది జ్ఞాన లక్షణాలు, పద్నాల్గవ అధ్యాయం లోని గుణాతీత లక్షణాలు, ప్రస్తుత అధ్యాయం లోని 'అభయం' మొదలు 'నాతిమానితా' వరకు చెప్పబడిన ఇరవై ఆరు లక్షణాలు - ఇవన్నీ దైవ లక్షణాలే. ఇంకా సవిస్తరంగా చెప్పక పోవడ మేమిటి? అందుచేత, ప్రస్తుతం ఆసురీ సంపదను విస్తరించి చెబుతున్నాడు. తొమ్మిదవ అధ్యాయంలో ***మోఘాశాః మోఘ కర్మాణః*** అంటూ నామమాత్రంగా స్పృశించిన ఆసురీ సంపద విషయాన్ని (*9 వ అ - 12 వ శ్లో*) ప్రస్తుత శ్లోకం నుండి వరుసగా పన్నెండు శ్లోకాలలో వివరంగా విశదం చేస్తున్నాడు. ఒక విధంగా చెప్పాలంటే, అభయాది లక్షణాలను వర్ణించిన మొదటి మూడు శ్లోకాలను విడిచి పెడితే, ఈ అధ్యాయ మంతా ఆసురీ సంపద వివరణమే. ఇంతగా విస్తరించి చెప్పడం వెనుక పరమేశ్వరుని అభిమత మేమిటో మనం గ్రహించాలి. ***పార్థ! శృణు*** - అర్జునా! విను! అంటూ బోధించ డంలో ప్రత్యేకత ఏమిటో కూడా మనం గుర్తించాలి. విషయాన్ని వివరిస్తూ ప్రత్యేకించి, 'విను' అని అన్నాడు అంటే, అది

అవశ్యం ప్రముఖంగా విన దగింది అని భావము. ఎందుకు దాని కంత ప్రాధాన్యత? ఆసురీ సంపదే కదా! దానిని విస్తారంగా తెలుసుకొని సాధించే దేముంటుంది? ఆచరించ దగింది కాదు కదా! అనే సంశయం కొందరికి కలుగ వచ్చు.

ఆచరించ దగిన వాటిని తెలుసుకోవడం ఎంత ముఖ్యమో, ఆచరించ కూడని వాటిని తెలుసుకోవడం కూడా అంతే ముఖ్యము. చేయ వలసిన వాటిని తెలుసుకోవడం ఎంత అవసరమో, చేయ కూడని వాటిని తెలుసుకోవడం కూడా అంతే అవసరము. చేయ కూడనివి ఏవో తెలియ నపుడు, చేయ దగినవి అవే నేమో అనుకొని చేసే ప్రమాదం లేక పోలేదు. ఈ అనర్థాన్ని నివారించేందుకు, ఏది ఆసురీ సంపదో తెలుసుకొని, దానిని త్యజించేందుకు వీలుగా ఆసురీ సంపదను భగవంతుడు విస్తరించి చెబుతున్నాడు (***అతః తత్ పరివర్జ నార్థం ఆసురం***).

ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదు రాసురాః ।
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే ॥ 7

***ప్రవృత్తిం-చ-నివృత్తిం-చ-జనాః-న-విదుః-ఆసురాః***
***న-శౌచం-న-అపి-చ-ఆచారః-న-సత్యం-తేషు-విద్యతే***

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆసురాః | = | అసుర స్వభావము గల | తేషు | = | వారి యందు |
| జనాః | = | జనులు | శౌచం | = | శుభ్రత |
| ప్రవృత్తిం చ | = | ప్రవృత్తి మార్గమును గాని | న విద్యతే | = | ఉండదు |
| నివృత్తిం చ | = | నివృత్తి మార్గమును గాని | ఆచారః చ న | = | ఆచారము ఉండదు |
| న విదుః | = | ఎరుగరు | సత్యం అపి న | = | సత్యము కూడా ఉండదు |

**అర్జునా! అసుర స్వభావం కలిగిన మనుషులకు ప్రవృత్తి తెలియదు. నివృత్తి అర్థం కాదు. వారిలో శుభ్రత ఉండదు. ఆచారము ఉండదు. సత్యము అసలే ఉండదు.**

**వ్యాఖ్య**

ప్రవృత్తి అంటే ప్రవర్తనము. చేయదగిన కర్తవ్యము నందు ప్రవర్తించడము ప్రవృత్తి. దానికి విపరీతమైన, అంటే చేయకూడని కార్యము నుండి నివర్తించడము, లేదా విరమించడము నివృత్తి. అర్థవంతమైన దాని యందు ప్రవర్తించడము ప్రవృత్తి కాగా, అనర్థ దాయకమైన కార్యము నుండి వెను దిరగడము నివృత్తి అవుతుంది. ఈ విధమైన ప్రవృత్తి నివృత్తులను అసుర సంపద గల వారు ఎరుగరు (***ప్రవృత్తిం చ నివృత్తిం చ జనాః ఆసురాః న విదుః న జానన్తి***). శాస్త్రవిహిత విషయము నందు ప్రవృత్తిని గాని, శాస్త్ర నిషిద్ధ విషయము నందు నివృత్తిని గాని ఆసురీ సంపద గల వారు ఎరుగరు. అంటే కర్తవ్యము నందు ప్రవర్తించడము గాని, అకర్తవ్యము నుండి విరమించడము గాని వారికి తెలియదు.

విహిత విషయము నందు జ్ఞానం లేనపుడు, నిషిద్ధ విషయానికి సంబంధించిన పరిజ్ఞానము ఉండ నపుడు, విహితా విహితము లందు విపర్యయ జ్ఞానము చోటు చేసుకొనే ప్రమాదము లేక పోలేదు. ఈ విధమైన మిథ్యా జ్ఞానము చేత ప్రభావితులైన ఆసురీ సంపద కల వారు చేయ వలసింది చేయక పోగా, చేయ కూడని నిషిద్ధ కర్మలను ఆచరిస్తారు. అందువల్ల వీరి ప్రవర్తనము అస్తవ్యస్తంగా ఉంటుంది.

కర్తవ్యమునకు, అకర్తవ్యమునకు సంబంధించిన ఈ ప్రవృత్తి నివృత్తులు శీల ప్రధాన మైనవి. శాస్త్ర





విహిత ప్రవృత్తిలో ప్రవర్తించక, శాస్త్ర నిషిద్ధ విషయము నుండి విరమించక కార్యరంగంలో ప్రవర్తించే వారు విధి నిషేధాలు తెలియని వారైనందున ధర్మ దూరు లవుతారు. వీరు ఆచరించే కర్మ లన్నీ రజ స్తమో గుణ ప్రధానంగా ఉంటాయి కనుక బంధహేతువులుగా ఉంటాయి.

విహితా విహిత విషయాలను శాస్త్రం ప్రబోధించే టప్పుడు ప్రవృత్తి నివృత్తుల విషయంలో వారు జ్ఞానహీనులుగా ఉండటము ఎలా సాధ్య పడుతుంది? అనే సందేహము కలగ వచ్చు. వారికి శాస్త్ర విషయము నందు అప్రమాణ బుద్ధి ఉండటం చేత శ్రద్ధ లేని వారై ఉంటారు. కనుక, వారిలో ధర్మస్పృహ ఉండదు. ధర్మస్పృహ లేని కారణంగా ధర్మాచరణము సాగదు.

**నిప్పు పెట్టిన వ్యక్తిని అయినా**
**ముట్టినచో నిప్పు కాల్చును**
**ధర్మము విడిచి చరించే వారికి**
**లభించదు దేవుని కనికరము**
**ధర్మము నందే వైభవము**
**తప్పిన ధర్మము వైకల్యము**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్** అని రామజోగి చిట్కా.

అసుర సంపత్తి గల వారు ప్రవృత్తి నివృత్తులను తెలియక పోవడమే గాక (***న కేవలం ప్రవృత్తి నివృత్తీ ఏవ న విదుః***) శౌచము, ఆచారము, సత్యము అనేవి కూడా కలిగి ఉండరు (***న శౌచం, న అపి చ ఆచారః న సత్యం తేషు విద్యతే***).

**శౌచము**

శౌచము అంటే పరిశుభ్రత (***శుచిః పరిశుద్ధత్వాత్***). శుచి అంటే పరిశుద్ధ మైనది. అదే శౌచము. శౌచము రెండు విధాలు. ఒకటి బాహ్య శౌచము. రెండవది అంతశ్శౌచము. మొదటిది బాహ్య శుభ్రత. రెండవది అభ్యంతర శుభ్రత. అసుర సంపద గల వారికి బాహ్యాభ్యంతరాలలో శౌచము ఉండదు.

శౌచము లేదు అంటే, అశౌచము ఉందని అర్థము. మనస్సు లోని ఈర్ష్యాసూయలు, అభిమాన అహంకారాలు అంతరంగమున అశౌచాన్ని కలిగిస్తాయి. ఆంతర్యములో అశౌచాన్ని కలిగించే అశుద్ధ భావాలను తొలగించాలంటే, వాటికి విరుద్ధమైన ప్రేమ త్యాగాలను అలవరచు కోవాలి. ప్రతిపక్ష భావన ద్వారా మనస్సు లోని కల్మషాలను తొలగించు కోవాలి. అలా చేయాలి అంటే శాస్త్ర పరిచయం ఉండాలి. ఆసురీ సంపద గల వారు శాస్త్రము నందు అప్రమాణ బుద్ధిని కలిగి ఉంటారని ముందే అర్థం చేసుకున్నాం కనుక, వారి విషయంలో ప్రమాణం ఫలించదు.

అంతఃకరణము లోని మాలిన్యాన్ని శుద్ధి చేసుకోవడానికి మరొక ఋజు మార్గము ఈశ్వర భక్తి, లేదా ఈశ్వర ప్రణిధానము. ఏ పూజ అయినా, వ్రతమైనా ప్రారంభించే ముందు సంకల్పం చెబుతాము. ప్రతి సంకల్పము ఇలా ప్రారంభ మవుతుంది.

***మమోపాత్త సమస్త దురిత క్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం అహం శ్రీ వాసుదేవం పూజాం కరిష్యే*** - నేను ఆచరించిన సమస్త పాపములను ప్రక్షాళనం చేసుకోవడం ద్వారా పరమేశ్వరుని అనుగ్రహాన్ని పొందుటకు నేను శ్రీ వాసుదేవుని పూజిస్తున్నాను. ఇదీ సంకల్పం. ప్రార్థనలు, పూజలు, ఏవైనా గాని, భగవత్కృపను, చిత్తశుద్ధిని

పొందటానికి మాత్రమే ఉన్నాయి. ఈ విధమైన ప్రార్థనలు, పూజలు, వ్రతములు ఆచరించడం ద్వారా పాపాలు ప్రక్షాళన మవుతాయి. అంతేకాదు. అవగాహన శుద్ధి పడటం చేత దురిత నివారణ జరిగి అంత శ్శౌచము ఏర్పడుతుంది.

అసుర సంపద గల వారు రజ స్తమోగుణ ప్రధానులై ప్రమాణాన్ని విశ్వసించరు. ప్రమేయమైన పరమేశ్వరునిపై భక్తి కలిగి పూజ, వ్రతాది కార్యాలు నిర్వహించరు. అందుచేత దురితములు మనస్సులో అలాగే ఉండి పోతాయి. అదే అశౌచము. అశౌచములో నిమగ్నమై ఉండే వారిలో శౌచ మెలా ఉంటుంది? అందుచేత, వారికి శౌచము తెలియదు ***(శౌచం న విద్యతే)***.

శౌచము లేని వారిలో అశౌచమే ఉంటుంది. అంతా మాలిన్యమే. అశౌచము వారి నడకలో ఉంటుంది. పలుకులో ఉంటుంది. ఆలోచనలో ఉంటుంది. ప్రవర్తనలో ఉంటుంది. ఆచార వ్యవహారాదులలో కూడా ఉంటుంది. అదే చెబుతున్నాడు.

**అనాచారము**

ఆసురీ సంపద కల వారికి శౌచము ఎలా లేదో ఆచారము కూడా అలాగే ఉండదు. వారు అశౌచులే కారు, అనాచారులు కూడా ***(అనాచారాః)***. సదాచారవంతుడు సత్కర్మానుష్ఠానంలో ఉంటాడు. సదాచారం సద్భక్తికి, సాత్త్విక జీవనానికి దారి తీస్తుంది.

ఆచారహీనుడు పతితు డవుతాడు. ఆచార హీనుణ్ణి వేదాలు కూడా రక్షించ లేవు అన్నది శాస్త్రం ***(ఆచార హీనం న పునన్తి వేదాః )***. నియత జీవనానికి మనిషి అలవాటు పడాలి. అప్పుడే సదాచార జీవనం అలవడుతుంది. రజ స్తమో గుణాల ప్రభావంతో ప్రవర్తించే ఆసురీ మతులకు నియత జీవనము, విహిత జీవనము అలవడదు. అందుచేత వారు ఆచారహీను లవుతారు. అనాచారవంతు లవుతారు.

**అన్నృతము**

అన్నృతము అంటే అసత్యము. అన్నృతవాదులు అంటే అసత్యమే పలికే వాళ్ళు అని అర్థం. వీరు సత్యానికి దూరులు. మాయ మాటలకే అలవాటు పడిన వాళ్ళు కనుక అసత్యవాదులను మాయావులు అన్నది భాష్యం ***(అన్నృత వాదినః మాయావినః హి అసురాః )***. వీరు ఆసురీ సంపద కల వారు.

సత్యమును పలకాలి అంటే సత్యమును, సత్యము యొక్క విలువను తెలిసిన వారై ఉండాలి. విధి నిషేధాలు పాటించని ఆసురీ సంపన్నులు అయోమయ జీవనానికి అలవాటు పడిన మాయావులు కనుక సత్య భాషణం చేయలేరు. పైగా, నాల్గవ శ్లోకంలో మనం చూచినట్లు పారుష్యము, అంటే పరుష వచనాలకు అలవాటు పడ్డ వాళ్ళు కనుక వారికి సత్యనిష్ఠ ఉండదు.

అసత్యము లేని, అప్రియము కాని యథార్థ భాషణమే సత్య భాషణము ***(అప్రియ అన్నృత వర్జితమ్ యథా భూతార్థ వచనమ్ సత్యమ్ )***. మాయావులైన ఆసురీలు అన్నృతవాదులు కావున సత్యమును పలక లేరు. పారుష్యము కలవారై నందున ప్రియ భాషణము చేయలేరు.

*అసుర మానవుల శీలమును గూర్చి చెప్పిన భగవంతుడు, వారి ఆలోచనా విధానము ఎలా ఉంటుందో తరువాత శ్లోకంలో వివరిస్తున్నాడు. ఈ ఆలోచనా రూపమే వారి సిద్ధాంతము.*

**అసత్య మప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరమ్ ।**
**అపరస్పర సమ్భూతం కి మన్య త్కామహైతుకమ్ ॥** 8





***అసత్యం-అప్రతిష్ఠం-తే-జగత్-ఆహుః-అనీశ్వరం***
***అపరస్పర సంభూతం-కిం-అన్యత్-కామహైతుకం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| తే | = | వారు | కామహైతుకం | = | కామ కారణ మైనది |
| జగత్ | = | ప్రపంచము | అపరస్పర సంభూతం | = | స్త్రీ పురుష సంయోగము వలన కలిగినది కాకుండా |
| అసత్యం | = | అసత్యము | | | |
| అప్రతిష్ఠం | = | ప్రతిష్ఠ లేనిది | అన్యత్ కిం | = | వేరుగా ఏముంది? |
| అనీశ్వరం | = | ఈశ్వరుడు లేనిది | ఆహుః | = | చెబుతారు |

**అర్జునా! ఈ ప్రపంచము అసత్యము. నిరాధారము. అనీశ్వరము. పరస్పర సంయోగ జనితము. కామమే కారణ మైనది. దీనికి మరొక కారణ మేముంది? అని ఆసురీలు వాదిస్తారు.**

**వ్యాఖ్య**

వింత వింత ఆలోచనలతో బ్రతుకును వికృతంగా మార్చుకుంటూ, వితండ వాదాలు వినిపిస్తూ, విపర్యయ జ్ఞానంతో జీవించే అసుర మానవుల అనర్థ బ్రతుకుల్ని, వారి వ్యర్థమైన ఆలోచనల్ని ప్రస్తుత శ్లోకంలో చెబుతున్నాడు. వారు మాయావులు కనుక, మాయ వారి మనస్సులలో ఎలా ఉందో, మాటలలో ఎలా వ్యక్త మవుతూ ఉందో వినిపిస్తున్నాడు. సిద్ధాంతాల పేరుతో వారు నడిపే స్వార్థపూరిత రాద్ధాంతాలు దయ్యాలు వేదాలు వల్లించి నట్లే ఉంటాయి. విచిత్ర మేమిటంటే, బాహ్యానికి వేదాంతము ఏమి చెబుతూ ఉందో వారు కూడా అదే చెబుతున్నట్లు అనిపిస్తుంది. కాస్త విశ్లేషించి అర్థం చేసుకుంటే, అంతా విపర్యయంగా, అయో మయంగా, మాయామయంగా, మోస పూరితంగా ఉంటుంది.

జగత్తు మిథ్య, లేదా మాయ అంటుంది వేదాంతము. వీళ్ళు కూడా జగత్తును అసత్య మనే అంటారు ***(ఇదం జగత్ సర్వం అసత్యమ్ )***. వేదంతము జగత్తును మిథ్య అన్నది అంటే, జగత్తు బ్రహ్మముపై ఆధారపడి ఉంది అని అర్థము. వీరు చెప్పేది అది కాదు. జగత్తు అసత్యము. అంతే కాదు. అప్రతిష్ఠం అని కూడా అంటారు. అంటే, జగత్తుకు ఆశ్రయం లేదు అనేది వారి వాదన. పద్నాల్గవ అధ్యాయం చివర ***బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహం అమృతస్య అవ్యయస్య చ*** అనే శ్లోకంలో బ్రహ్మమును ప్రతిష్ఠం అనడం జరిగింది. కాని, ఆసురీ సంపద కల వారికి జగత్తు అసత్యము. పైగా అప్రతిష్ఠం; అంటే ఏ ఆధారమూ లేనిది.

జగత్తు అశాశ్వతము, అనిత్యము, మిథ్య అని వేదాంతము ప్రవచించడం వెనుక ఆలోచన వేరు. జగత్తు మాయామయం కనుక మహిమాన్వితుడైన పరమేశ్వరుని పొంది తరించి పోవాలి అనేది వేదాంతావగాహన.

అసుర మానవుల మాటల వెనుక మర్మం వేరే. ప్రపంచము అనిత్యము. అంటే అసత్యము. పైగా ఏ ఆధారము లేనిది. ఇల లేదు - ఈశ్వరుడూ లేడు. ఇదే ప్రపంచము. దేవుడు లేని జగత్తు ***(జగదాహుః అనీశ్వరమ్ )***.

దేవుడు లేడు, ధర్మం లేదు. కారణం లేదు, కార్యమూ లేదు. ధర్మం లేదు కనుక అధర్మమూ లేదు. ధర్మాధర్మాలు రెండూ లేవు కనుక యుక్తాయుక్తాలు లేవు. లోకాయతికులే ఉన్నారు. కనిపించేదే లోకము గాని మరొకటి లేదు అని విశ్వసించే వారు లోకాయతికులు. వారే నాస్తికులు. ప్రత్యక్ష ప్రమాణాన్నే అంగీకరిస్తూ ప్రపంచం భోగార్థమే ఉందని నమ్మే నాస్తికులే లోకాయతికులు ***(లోకాయతిక దృష్టి రియమ్ )***. లోకం అసత్యం కనుక, దొరికినంత దోచుకోవడం, అనుభవించి అస్తమించడం. ఇదే వారి ఆలోచనా విధానము.

కనుక, ఇక్కడ ఎవరెలా జీవించినా ఫరవా లేదు. జగత్తే అసత్య మైనపుడు, ఇక్కడ ధర్మాధర్మాలే ముంటాయి? ధర్మాధర్మాలను నియమించే ఈశ్వరుడు ఎలా ఉంటాడు? అందుచేతనే వీరు జగత్తును అనీశ్వరం అంటారు.

ధర్మాధర్మాలే లేవు. ఇక కర్మలు, శాస్త్రాలు ఎక్కడి నుండి వస్తాయి? ధర్మకర్మలు తెలియని జగత్తులో జన్మల ప్రసక్తి ఏమిటి? ధర్మాధర్మాలు లేవు. సత్యాసత్యాలు లేవు. విధినిషేధాలు లేవు. ఎవరెలా గైనా జీవించ వచ్చు. సుఖ పడేందుకే ఈ లోకం ఉంది. ఆచారాలు అనర్థ దాయకాలు. అందరమూ స్వేచ్ఛాచారులమే. బ్రతికేది మూడు రోజులు. ముప్పూటలా సాక్కి పోయేలా మెక్కడమే జీవిత పరమావధి. ఉప్పు కూడు తిని ముప్పు తెచ్చుకోవడ మెందుకు? దృష్టి ఎప్పుడూ పప్పుకూడు మీదనే ఉండాలి. అదీ నెయ్యి కలిపిన పప్పుకూడై ఉండాలి. అది ఎలా వస్తుంది అంటారా? దానికి ఆస్తు లెందుకు? ఆర్జన లెందుకు? అప్పు చేసే నేర్పు ఉంటే సరి పోతుంది. మరి అప్పు ఎలా తీర్చాలి? తీర్చ మని ఎవరు చెప్పారు? అడిగే వాడెవడు? తిరిగి ఇచ్చే వాడెవడు? ఎప్పుడైనా అంతమై పోయే వాళ్ళమే. అనుభవిస్తూ ఉందాము. ఎలాగూ ఒకనాడు కళ్ళకు మూతలు పడతాయి కదా! ఈ లోగా నోళ్ళకు మూత లేసుకోవడం ఎందుకు? కడుపులను ఖాళీగా ఉంచుకోవడ మెందుకు? బ్రతికేది మూడు రోజులు. ముందు వెనుకలు చూడటం దేనికి? తిని చస్తే పోతుంది. దొరికి నంత జుర్రేసి టపా కట్టేస్తే సరి పోతుంది. ఎవరు అడుగుతారు? ఏమని అడుగుతారు?

*యావ జ్జీవేత్ సుఖం జీవేత్ ఋణం కృత్వా ఘృతం పిబేత్,*
*భస్మీ భూతస్య దేహస్య పునరాగమనం కుతః ?*

బ్రతికి నంత కాలం సుఖంగా, హాయిగా బ్రతికేయ్! పొరపాటున కూడా నీళ్ళు త్రాగొద్దు. అప్పు చేసైనా నెయ్యి త్రాగు. నెయ్యి త్రాగి బలిసిన కాయాన్ని ఎవరో ఒకరు కాష్ఠంలో పెట్టి కాల్చేస్తారు. క్షణాల్లో బూడిదై పోతుంది. బూడిద మళ్ళీ మనిషై లేచి వస్తుందా? వచ్చి నప్పుడు కదా అప్పుల వాడు వెంట బడేది? అడిగించు కోవడానికి మనం తిరిగి రాము. అడగడానికి ఇచ్చిన వాడు పోకుండా ఉండడు. ముందు వాడే పోయాడా, శుభ్రం - అడిగే వాడే ఉండడు. ఒకవేళ వాడి కన్నా ముందు మనమే పోయామా, వాడు అడగడానికి మనం ఉండము. ఇదే జ్ఞానం. ఇదే శాస్త్రం. ఈ శాస్త్ర జ్ఞానం లేని వాడు ప్రపంచంలో సుఖపడ లేడు. ఇది లోకాయతికుల లౌకిక వాదం.

ఆసురీ సంపద గల ఈ లోకాయతికులు శాస్త్రాన్ని అంగీకరించరు. అంగీకరిస్తే వారి స్వేచ్ఛాచారానికి భంగం వాటిల్లుతుందని భావిస్తారు. సృష్టిని, సృష్టికర్త అయిన పరమేశ్వరుని కూడా అంగీకరించరు. జగత్తుకు కారణంగా ఈశ్వరుడు లేడని చెబుతారు ( *అనీశ్వరం జగత్ ఆహుః* ).

సృష్టికర్త లేనపుడు సృష్టి ఎలా ఉత్పన్న మైంది? అని ప్రశ్నిస్తే, సృష్టి అపరస్పర సంభూతము కనుక జగత్కారణము కామమే అని వాదిస్తారు. కామ ప్రేరితులైన స్త్రీ పురుషుల పరస్పర సంయోగము వల్ల సృష్టి కలిగింది అనేది వారి వాదన ( **కామ ప్రయుక్తయోః స్త్రీ పురుషయోః అన్యోన్య సంయోగాత్ జగత్సర్వం సంభూతమ్ ।** ).

సృష్టికి కారణంగా కంటికి కనిపించని, ఊహకు అనిపించని, ఏవో కపోల కల్పిత లోకాలలో, లేని భగవంతుని కొరకు అన్వేషించడం కన్నా, ప్రత్యక్షంగా కళ్ళ ముందే కనిపిస్తున్న సత్యాన్ని అంగీకరిస్తే సరి పోతుంది కదా అంటారు.

కామ వాసనే సృష్టి హేతువు ( *కామ ఏవ ప్రాణినాం కారణమ్* ). కామం కన్నా సృష్టికి మరొక హేతువు





ఎక్కడ కనిపిస్తూ ఉంది? అని తిరిగి ప్రశ్నిస్తారు ( **కి మన్యత్ కామ హేతుకమ్** ). కామమే జగతికి మూలము, కామమే జగత్తుకు ఆధారము ( **కామ మూల మిదం జగత్, కామో విశ్వస్య జగతః ప్రతిష్ఠా** ).

ఆసురీ ప్రకృతితో పుట్టిన ఈ వ్యర్థ మానవులు లోక కంటకులు. తమ బ్రతుకుల్ని నాశనం చేసుకొనే వీరు లోక వినాశానికి పుడుతూ ఉంటారు అంటున్నాడు.

ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః ।
ప్రభవ న్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః ॥ 9

*ఏతాం-దృష్టిం-అవష్టభ్య-నష్టాత్మానః-అల్పబుద్ధయః*
*ప్రభవంతి-ఉగ్రకర్మాణః-క్షయాయ-జగతః-అహితాః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏతాం | = | ఈ | ఉగ్రకర్మాణః | = | క్రూర కర్మలు చేసే వారు |
| దృష్టిం | = | దృష్టిని | అహితాః | = | హితులు కాని వారు |
| అవష్టభ్య | = | అవలంబించి | జగతః | = | జగత్తు యొక్క |
| నష్టాత్మానః | = | చెడిన మనస్సు గల వారు | క్షయాయ | = | నశింపునకు |
| అల్పబుద్ధయః | = | అవివేకులు | ప్రభవంతి | = | పుడుతున్నారు |

**అర్జునా! అసుర మానవులు నష్టాత్ములు. అల్పబుద్ధులు. క్రూరకర్ములు. లోకానికి హితులు కారు. వీళ్ళు లోక నాశానికే పుడుతారు.**

**వ్యాఖ్య**

మనస్సును బట్టే మనుగడ ఉంటుంది. భావాలే బ్రతుకును నిర్దేశిస్తాయి. విధి నిషేధాలు తెలియని ఆసురీలు ప్రపంచంలో కూడా విధి నిషేధాలు లేవని నిర్ణయించారు. ధర్మ దూరులైన ఈ దౌర్భాగ్యులు ప్రపంచానికి దైవాన్ని దూరం చేశారు. జగత్తును అనీశ్వరంగా మార్చేశారు. వారు తమను తాము ఎలా ఊహించు కుంటున్నారో, ప్రపంచాన్ని కూడా అలాగే ఊహిస్తున్నారు. ఇటు తమ లోను, అటు ప్రపంచం లోను సత్యాన్ని అప్రతిష్ఠం చేశారు.

***యథా వయం అనృత ప్రాయాః తథా ఇదం జగత్ అసత్యమ్*** - 'మన మెలా అబద్ధాల రాయుళ్ళమో, ఈ ప్రపంచం కూడా అలా అబద్ధమే, అసత్యమే. అంతా కామ మయమే. ఏ గొప్పతనము లేని ప్రపంచంలో ఉన్నతంగా జీవించాలి అనుకోవడమే గొప్ప పొరపాటు. ఎలా జీవించినా ప్రపంచాన్ని చూసి సిగ్గు పడ వలసింది ఏమీ లేదు. ఒకవేళ తప్పు చేసినా, లజ్జ పడవలసి నంత గొప్ప దేమీ కాదు ఈ ప్రపంచము. తప్పు చేశామని శిక్షించ డానికి భగవంతుడూ లేడు. లేని వన్నీ ఊహించుకొని బ్రతుకును పాడు చేసుకోవడం కన్నా, కామ ప్రధానమైన జగత్తును అనుభవించి సుఖించడమే బ్రతుకుకు పరమావధి' అనే దృష్టిని అవలంబించి ( **ఏతాం దృష్టిం అవష్టభ్య ఆశ్రిత్య** ). ఆశ్రయించి, మనస్సులను పాడు చేసుకొనిన పాషండులుగా మారి పోయారు ( **నష్టాత్మానః నష్ట స్వభావాః** ).

**నష్టాత్ములు**

నష్టాత్ములు అంటే మనస్సులు పాడైన వారు. చెడిన స్వభావం కల వారు. అలౌకిక పవిత్ర సాధనలకు దూరులై భ్రష్టు లైన వారు ( **నష్టాత్మానః నష్ట స్వభావాః, విభ్రష్ట పరలోక సాధనాః** ). దారి తప్పిన ఆలోచనల

కారణంగా వారే దగా పడ్డారు. విధి నిషేధ వర్జితులై, కృత్యాకృత్యాలను విస్మరించి బ్రతుకును అన్యాయం చేసుకున్నారు. అనిత్య భోగానుభవానికే ప్రాధాన్యత నిచ్చి చిత్తాన్ని ఛిద్రం చేసుకున్నారు. నష్ట స్వభావు లయ్యారు. నష్ట జీవు లయ్యారు. అలాంటి వారికి విశాల దృక్పథా లెలా ఉంటాయి? బుద్ధి ఎలా సువిశాల మవుతుంది? అందుకే వారు అల్పబుద్ధులు.

### అల్పబుద్ధులు

అల్పమైన విషయముల యందే బుద్ధి కల వారు అల్పబుద్ధులు. తుచ్ఛమైన విషయ భోగాల యందే దృష్టి కేంద్రీకృతమై ఉండే వారు. దృశ్య విషయాల యందే ప్రీతి కలిగిన వారు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాది విషయాలే దృశ్యములు. అవే వారికి ప్రమాణాలు. వాటిని గూర్చి మాత్రమే సదా ఆలోచిస్తూ, అల్పమైన భోగ్య భోక్తృ బుద్ధి మాత్రమే ప్రధానంగా కలిగిన స్వల్పమైన, అల్పమైన బుద్ధి గల వారు ***(విషయ విషయా అల్పైవ బుద్ధిః యేషాం తే అల్ప బుద్ధయః)***. ఇక్కడ అల్పబుద్ధి అంటే బుద్ధి చిన్నది అని కాదు. చిన్న విషయాలకు అధిక ప్రాధాన్యత నిచ్చి, బుద్ధిని సంకుచితంగా మార్చుకున్న వారు అని అర్థము. ఇంద్రియ విషయ భోగాలే జీవిత సర్వస్వంగా భావించిన బుద్ధి కల వారు. వాళ్ళకు కనిపించిందే ప్రపంచం. బుద్ధికి అందిందే వాస్తవం. వాళ్ళు చూచిందే సత్యం. వీరే నష్టాత్ములైన అల్పబుద్ధులు. యుక్తా యుక్త విచక్షణ కోల్పోయిన వారు. వక్ర బుద్ధులై ఉగ్రకర్ము లైన వారు.

### క్రూర కర్ములు

ఊహను బట్టే ఊడిగం ఉంటుంది. మనస్సు చెడిన అల్పబుద్ధులు విలువలు లేని వారు కనుక, విలువైన, విశిష్ట మైన కర్మలు ఆచరించ లేరు. పాడైన బ్రతుకులు కనుక, ఎంతటి నికృష్ట కార్యాలను ఆచరించడాని కైనా వెనుకాడరు. మోసాలు చేస్తారు. మాయలు చేస్తారు. మనుషుల్ని అపహరించుకొని పోతారు. వారి బ్రతుకులకు అవరోధ మని భావిస్తే అంతం చేస్తారు. హింసకు పాల్పడతారు. ధర్మాధర్మ విచక్షణ లేని వారు కనుక ఎంతటి క్రూరమైన కార్యాల నైనా ముందు వెనుకలు చూడకుండా చేసేస్తారు. అందుకే వారు ఉగ్రకర్ములు ***(ఉగ్ర కర్మాణః క్రూర కర్మాణః హింసాత్మకాః)***. హింసాపరాయణు లైన ఆసురీలు సమాజ శరీరంలో భయంకరమైన వ్యాధి లాగా వ్యాపిస్తారు. దేశ మనే వృక్షానికి పట్టిన చీడ పురుగులు. ప్రపంచ తరువును తొలిచి తొలిచి, వాలిచి వాలిచి, వాడి పోయేలా చేస్తారు. చెడు చేసి ***(అహితః)*** చెట్టునే చెడిపేస్తారు ***(క్షయం)***. చెడగొట్టేస్తారు. అందుకే వీరు లోక కంటకులు.

### లోక కంటకులు

హింసా ప్రవృత్తికి అలవాటు పడి జగత్తు యొక్క వినాశానికి కారణభూతు లైన ఆసురీలు లోక కంటకులు. లోక వినాశానికి కారకులు. ప్రపంచము యొక్క వినాశానికి కారకు లైన వీరు ప్రపంచానికి అహితులు. వీరు జగత్తుకు కేవలం అహితులే కాదు. క్షయ కారకులు కూడా.

***క్షయాయ జగతోఽ హితాః*** - అని అందమైన వాక్యాన్ని పలికాడు భగవంతుడు. ఈ వాక్యం దేహలీదీప న్యాయంగా చెప్పబడింది. క్షయము, అహితము అనే పదాల మధ్య, గడప మీద దీపం లాగా జగత్తు ఉంది. అంటే, అటు ఇటు ఉన్న ఉభయ పదాలతో మధ్య పదమైన జగత్తు ముడి పడి ఉంది.

***క్షయాయ జగతః*** - ఆసురీ సంపద గల ఈ దుష్టులు, ప్రపంచ వినాశానికి పుడుతూ ఉంటారు ***(ప్రభవన్తి)***. ***అహితః జగతః*** - వీరు లోకానికి మేలు చేసే వారు కారు. కనుక లోక కంటకులు. ప్రపంచ శత్రువులు ***(జగతః అహితాః శత్రవః)***.





ఇక వారి స్వభావాన్ని గూర్చి చెబుతున్నాడు భగవంతుడు.

**కామ మాశ్రిత్య దుష్పూరం దమ్భ మాన మదాన్వితాః ।**
**మోహా ద్గృహీ త్వాసద్గ్రాహా న్ప్రవర్తన్తేఽ శుచివ్రతాః ॥** 10

***కామం-ఆశ్రిత్య-దుష్పూరం-దంభమాన మదాన్వితాః***
***మోహాత్-గృహీత్వా-అసద్గ్రాహాన్-ప్రవర్తంతే-అశుచివ్రతాః***

| | | | |
|---|---|---|---|
| దుష్పూరం | = తృప్తి చెందని | అశుచి వ్రతాః | = భ్రష్టాచారములు గలవారై |
| కామం | = కామమును | అసద్గ్రాహాన్ | = అశుభ నిర్ణయాలను |
| ఆశ్రిత్య | = ఆశ్రయించి | మోహాత్ | = మోహాము వలన |
| దంభమాన మదాన్వితాః | = దంభము తోను, అభిమానము తోను, గర్వము తోను కూడిన వారై | గృహీత్వా | = గ్రహించి |
| | | ప్రవర్తంతే | = ప్రవర్తిస్తూ ఉంటారు |

**అర్జునా! ఆసురీ మానవుల కామము తృప్తి చెందేది కాదు. డాంబికము, అభిమానము, మదము కలిగి ఉంటారు. చెడ్డ పట్టుదలకు పోతారు. భ్రష్టాచారులై ప్రవర్తిస్తారు.**

**వ్యాఖ్య**

ప్రపంచానికి మేలు చేయని, చేయలేని ఈ ఆసురీ సంపన్నులు ప్రపంచానికి హాని చేస్తారని పూర్వ శ్లోకంలో చూశాం. అదెలాగో ప్రస్తుత శ్లోకంలో విశదీకరిస్తున్నాడు. వారి స్వభావము వినాశానికి పని కొస్తుందే గాని వికాసానికి పనికి రాదని ఋజువు చేస్తున్నాడు.

### నిండని బావులు

వర్షా కాలంలో బావు లైనా నిండుతాయి కాని, వర్ష రూపంలో భోగాలు వచ్చి పడినా ఆసురీల బుద్ధులు మాత్రం నిండవు. వారి మనస్సులు తృప్తితో ఉండవు. బావులు నిండుతాయి. చెరువులు నిండుతాయి. సముద్రాలు నిండే ఉంటాయి. కాని, వీరి హృదయాలు మాత్రం ఎప్పుడూ నిండవు. తృప్తి చెందవు ***(దుష్పూరమ్ అశక్య పూరణం)***. ఎంత అనుభవించినా వారి కామానికి తృప్తి ఉండదు. రావణాసురుడు ఇరవై వేల సంవత్సరాలు బ్రతికాడు. బ్రతుకంతా భోగాల తోనే నిండి పోయింది. కాయ మంతా కామమే. ఎందరు స్త్రీలతో ఆడుకున్నాడో! ఆ దుష్టుడి చేతిలో ఎన్ని మదిర భాండాలు ఖాళీ అయ్యాయో! అతడి ఒడిలో ఎందరు సుందరాంగు లైన భామలు బంతు ల్లాగా దొర్లి పోయారో! అయినా తృప్తి చెందాడా? సంతృప్తి పడ్డాడా? ఇరవై వేల సంవత్సరాల భోగ జీవితంలో కనీసం చివరి ఒక్క సంవత్సరం అయినా తృప్తిగా ఉండ లేక సీతమ్మను కాంక్షించి కాల గర్భంలో కలిసి పోయాడు. రావణు డెవరో కాదు, అసురుడే. ఆయన సంపద ఏదో కాదు, ఆసురీ సంపదే. రావణుడి హృదయం లోని కామ భాండాన్ని నింపడానికి ఇరవై వేల సంవత్సరాలు కేటాయించినా, ప్రపంచం నింప లేని స్థితిలో అశక్యంగా, అసమర్థంగా మిగిలి పోయింది. అందుకనే, కామాన్ని తృప్తి పరచడము అంటే కామాన్ని లేకుండా చేసుకోవడమే అని మహాత్ములు ఆదేశించారు.

కామమును దుష్పూరం అంటున్నాడు భగవంతుడు. దుష్పూరం అంటే పూరింప శక్యము కానిది అని అర్థము. నింప లేనిది అని భావము. కనుకనే కామాన్ని నిత్య శత్రువుగా కర్మయోగంలో భగవంతుడు అభివర్ణించాడు. జ్ఞానాన్ని కప్పేసేది కామమే కనుక, కామం విషయంలో జాగ్రత్త వహించ మని హెచ్చరించాడు కూడా. పైగా అది అనలం, అంటే అగ్ని లాంటిది అన్నాడు. ***అలం న విద్యతే ఇతి అనలం***. 'అలం' అంటే చాలు

అని అర్థం. 'అనలం' అంటే చాలు అనేది లేనిది. చాలు అనేది తెలియనిది అని భావం. ఎన్ని వేసినా అగ్ని దగ్ధం చేస్తూనే ఉంటుంది గాని చాలు అని అనదు. అందుచేత అగ్నిని అనలం అన్నారు. అగ్ని ఎలా తృప్తి చెందదో, కామం కూడా అలాగే తృప్తి చెందదు. ఎంత నింపినా కామం నిండదు. అందుకే అది **దుష్పూరం.** ఈ మాటను మూడవ అధ్యాయం లోనే భగవంతుడు ప్రవేశ పెట్టాడు. పన్నెండు అధ్యాయాలు అవిరళంగా ప్రసంగించిన తరువాత మళ్ళీ ఆ పదాన్నే వాడి కామం విషయంలో జాగ్రత్తగా ఉండమని హెచ్చరిక చేస్తున్నాడు ***(దుష్పూరేణ అనలేన చ*** *- 3 వ అ - 39 వ శ్లో).*

## దంభమాన మదాన్వితులు

దుష్పూరమైన కామమును ఆశ్రయించిన ఆసురీలు దంభమాన మదాన్వితు లౌతున్నారు అంటున్నాడు. దంభము, అభిమానము, మదము అనే ఈ అసుర లక్షణాలను పూర్వమే మనం విపులంగా చర్చించుకొని ఉన్నాం. ఇక్కడ వాటిని ప్రత్యేకార్థంతో ప్రస్తావించక పోయినా, సంబంధ విషయము అనేది నిర్వివాదాంశము. కామ ప్రభావం మనిషి స్వభావాన్ని ఎలా దెబ్బ కొడుతుందో ఈ సందర్భములో అవశ్యం అన్వయించు కోవాలి.

ఆసురీ సంపద కల వారికి కామమే ఏకైక జీవిత లక్ష్యము. అసురులకు మన లాగా నాలుగు పురుషార్థాలు లేవు. వారికి ఒక్కటే పురుషార్థం. వాళ్ళ గురువు బృహస్పతి వారికి అలాగే బోధించారు. అదే ప్రమాణంగా సూచించారు.

సూ॥ ***కామ ఏవైకః పురుషార్థః -*** కామ మొక్కటే పురుషార్థము అని బృహస్పతి సూత్రము. బృహస్పతి అనే ఈ సూత్రకారుడు దేవ గురువైన బృహస్పతి కాదు. ఆయన సుర గురువు. బుద్ధిశాలి. ప్రస్తుతం చెప్పక తప్పింది కానందున, మనం చెప్పుకుంటున్న ఈ బృహస్పతి అసుర గురువు. మందమతి.

విషయాల యందు ఆసక్తియే కామము ***(కామః ఇచ్ఛా విషయేషు).*** కామాన్ని ఆశ్రయించి విషయాలను ప్రోగు చేసుకోగానే కామిలో కొన్ని అవాంఛనీయ లక్షణాలు కనిపిస్తాయి. అవే దంభ మాన మదాలు.

తన వైభవాన్ని ప్రపంచంలో చాటింపు వేసుకోవడము దంభము ***(ధర్మధ్వజిత్వం).*** దంభము ఉంది కదా, ఇక అందరూ తనను గుర్తించి గౌరవించాలి అనే జంభము ప్రదర్శింప బడుతూ ఉంటుంది. ఇదే గర్వము, లేదా మానము. ఆ తరువాత తనకు మించిన వారు లేరంటూ తన తలపై తానే దుమ్మెత్తి పోసు కోవడము. అదే మదము. గజము యొక్క లక్షణము. దేహం పెరిగినా బుద్ధి పెరగని కారణంగా నిరంతరం సాగే గజ స్నానము. మదగజ స్నానము.

ఈ నిర్వాక మంతా ఏమిటి? ఏముంది, అంతా అవివేకమే! అవివేక మంటే కేవలం వివేకం లేక పోవడమే కాదు; విపరీత జ్ఞానము కలిగి ఉండటము కూడా అవివేకమే. నష్టాత్ములు, అల్ప బుద్ధులైన కారణంగా, ఉన్న దానిని ఉన్నట్లుగా చూడలేక పోగా, లేని దానిని ఉన్నట్లు చూస్తారు. ఈ విధమైన అవివేకమే మోహము. మోహమే అశుభము. అట్టి అశుభమైన మోహంలో కూరుకు పోయిన వారి మనస్సులలో నిర్ణయాలు ఎలా ఉంటాయి? అశుభం గానే ఉంటాయి. నిర్ణయాలే అశుభంగా ఉన్నప్పుడు, కార్యాలు ఎలా ఉంటాయి? ఉంటాయి? అశుభం గానే ఉంటాయి.

## అశుభ నిర్ణయాలు - అమంగళ కార్యాలు

ఆంతర్యంలో భావ రూపంలో ఉన్నదే బాహ్యంలో కర్మగా వ్యక్త మవుతుంది. భావశుద్ధి లేకుండా కర్మ శుద్ధి రాదు. భావం కర్మాచరణమునకు ముందే ఉంటుంది. భావమే మార్గదర్శి. భావమే మార్గగామి.





మోహ వలయంలో చిక్కుకొని పరిభ్రమించే ఆసురీలు అపవిత్ర మైన భావాలతో నిండి ఉంటారు కనుక, వారి బుద్ధి లోని నిర్ణయాలు కూడా అపవిత్రం గానే ఉంటాయి. బుద్ధి లోని నిర్ణయాలు ఎప్పుడైతే అపవిత్రంగా ఉన్నాయో, బాహ్యంలో కర్మలు కూడా అపవిత్రం గానే సాగుతాయి. అవే ఉగ్రకర్మలు. హింసా యుత కర్మలు. క్రూరకర్మలు ***(గృహీత్వా అశుభ నిశ్చయాన్ ప్రవర్తన్తే లోకే).*** ఇదంతా అశుచి. అందుకనే ఆసురీలను ఏడవ శ్లోకంలో అశౌచులుగా చెప్పుకున్నాం.

ఒకవేళ అశౌచులు పూజలు చేస్తే ఎలా ఉంటాయి? వ్రతాలు చేస్తే, ఎలా ఉంటాయి? సేవా కార్యక్రమాలు చేపడితే అవి ఎలా ఉంటాయి? అన్నీ అశౌచం గానే ఉంటాయి. అపవిత్రులు చేసే కార్యాలు అపవిత్రంగా కాక పవిత్రంగా ఎలా ఉంటాయి? అందుకే ఆసురీలు అశుచివ్రతులు ***(అశుచీని వ్రతాని యేషాం తే అశుచి వ్రతాః).***

*కామాశ్రయు లైన ఆసురీల ఆలోచన, ఆచార వ్యవహారాలను వివరిస్తున్నాడు.*

**చిన్తా మపరిమేయాం చ ప్రలయాన్తా ముపాశ్రితాః ।**
**కామోపభోగ పరమా ఏతావ దితి నిశ్చితాః ॥** 11

***చింతాం-అపరిమేయాం-చ-ప్రలయాంతాం-ఉపాశ్రితాః***
***కామోపభోగ పరమాః-ఏతావత్-ఇతి-నిశ్చితాః***

| | | | |
|---|---|---|---|
| అపరిమేయాం | = అపరిమిత మైనది | కామోప భోగపరమాః | =విషయ భోగాలే ఉత్తమ మనుచు |
| ప్రలయాంతాం | = మృత్యువే అంతముగా గలది | ఏతావత్ ఇతి | =ఇదియే పరమార్థ మనుచు |
| చింతాం | = చింతను | నిశ్చితాః | =నిశ్చయించిన వారై |
| ఉపాశ్రితాః | = ఆశ్రయించిన వారై | | |

**అర్జునా! అసుర సంపద కల వారి చింతకు హద్దు లేదు. మరణం వరకు సాగుతూనే ఉంటుంది. కామోప భోగమే గాని మరొక పురుషార్థము లేదని నిశ్చయించు కుంటారు.**

### వ్యాఖ్య

పరిమితాలకు ప్రాధాన్యత కలిగిన ప్రపంచంలో మనం జీవిస్తున్నాం. ప్రపంచ వ్యవహారాలు ఏవైనా హద్దులకు లోబడే వర్తిస్తూ ఉంటాయి. ఉన్న చోటే కదలకుండా ఉంటుంది రాయి. కదిలిస్తే గాని కదల లేదు. దాని పరిమితం అలా ఉంది. చెట్టు ఉన్న చోటే ఉండినా, కొమ్మలతో, ఆకులతో కదుల్తూ ఉంటుంది. ఉన్న చోట కదుల్తుందే గాని నడిచి మరొక చోటికి పోలేదు. కాని, చెట్టుపై నున్న పక్షి ఎగిరి ఆకాశంలో విహరిస్తుంది. ఎగర లేని మాను కన్నా, ఎగిరే మనిషి కన్నా ఎత్తుకు పక్షి ఎగురుతుంది. కాని, ఆకాశంలో ఎగిరే పక్షి కూడా కొంత ఎత్తు వరకే ఎగురుతుంది. అంతకు మించి ఎగర లేదు. దాని హద్దులు దాని కున్నాయి. ఏదైనా అంతే.

పరుగు అలవాటున్న మనిషి కూడా కొంత వరకే పరుగెత్త గలడు. హద్దు దాటి పరుగెత్త లేడు. ఎంత గొప్ప గాయకుడైనా తన శ్రుతిని మించి పాడ లేడు. ఎంతటి మేధావి మనస్సైనా తన స్థాయిని మించి ఆలోచించ లేదు. అందుకే నేమో కడుపు నిండితే గారెలు కూడా చేదుగా మారుతాయి. పరిమితాలను అధిగమించ లేక, అధిగమించిన క్షణాన ఎదురయ్యే విపరీతాలను తట్టుకో లేక అందరూ అలమటిస్తూ ఉంటే, అందరికీ భిన్నంగా, ఆసురీ సంపద కలిగిన వారు అంతులేని చింతను కొనసాగిస్తూ, అలు పెరుగని విధంగా కామోప భోగాలలో రమిస్తూ ఉంటారు. దివ్యాత్ములు చేరలేని చోటుకి దురాత్ములు చేరి పోతారు అనే ఆంగ్ల సామెత వీరి కోసమే పుట్టిందేమో!

### చింతాసక్తులు

ఆసురీ సంపదకు సంబంధించిన అల్పబుద్ధులు హద్దు లేని చింతను ( ***చింతాం అపరిమేయామ్*** ) మరణాంతం, అంటే చివరి శ్వాస వరకు (*ప్రలయాన్తాం*) కొనసాగిస్తూనే ఉంటారు. ఇది మామూలు విషయ చింతనము కాదు. అంతమయ్యే వరకు అంతరంగంలో అనంతంగా సాగే హద్దు లేని, అడ్డు లేని విషయ చింతనము. నడుస్తున్నంత సేపు నేలను చూస్తూ తదేక చింతలో సాగిపోతూ ఉంటారు. ఏం చింతిస్తుంటారు? ఏమో, ఎవరికి తెలుసు? అమ్మా! భూమాతా! నువ్వు రతనాల తల్లివి. మాణిక్య మాతవు. నీ కుక్షిలో ఎంత సంపదో! ఎంత నిక్షేపమో! అమ్మా! నీకు ఆక్షేపము లేకపోతే, అవి ఎక్కడున్నాయో నీ ముద్దుబిడ్డ నైన నా కంట పడనీ తల్లీ! అని ప్రార్థిస్తుంటా రేమో!

ఇక నడక ఆపి కూర్చున్నారా! అంతే. దృష్టి పైపైకి పాకి నింగిలో ఒకచోట నిశ్చలంగా నిలబడి పోతుంది. అక్కడ ఏమి దర్శిస్తుంటారో! ఏమి విచారిస్తుంటారో! ఆకాశమా! నీ వెంత విశాల మమ్మా! నా సంపదల్ని కూడా నీ లాగే విశాలం చేసెయ్యి అని వేడుకుంటా రేమో! ఎంత చింతో! ఆ చింతలో కూడా ఎంత వింతో! ఎంత వింత చింత కాకపోతే, చితి పేర్చే వరకు రగులు తుంటుంది? జీవితాంతం చింతించ వలసిన ఏకైక విషయ మేమో! ఈ చింత అంతా దేని గురించి? ఇంకే ముంది? ఒకే లక్ష్యాన్ని గురించి. కామోప భోగమే ప్రధాన లక్ష్యంగా గల చింత (***కామోప భోగ పరమాః***).

### భోగాసక్తులు

సదా చింతాసక్తు లైన ఆసురీలు కామోప భోగమే ప్రధాన లక్ష్యంగా కలిగి ఉంటారు ( ***కామోప భోగ పరమాః***). కామోప భోగమే పరమ పురుషార్థంగా జీవిస్తారు. కనుక మరణాంతం భోగాసక్తులై విషయ చింతనా పరులై ఉంటారు.

కామములు అంటే భోగ్య వస్తువులు. కోర బడేవి కనుక శబ్దాది విషయాలు కామములు ( ***కామ్యన్తే ఇతి కామాః శబ్దాదయః***). వాటి ఉపభోగమే, అంటే వాటిని అనుభవించడమే జీవితంలో ముఖ్య విషయంగా కలిగిన వారు. కామోప భోగమే పురుషుడు ప్రయత్నించి సాధించ దగినది అని వారి అభిప్రాయము. ఈ విషయంలో నిశ్చితాభిప్రాయం కల వారు. ఒక్క మాటలో చెప్పాలంటే పురుషార్థ నిశ్చయం దృఢంగా ఏర్పడిన వారు.

పురుషార్థ నిశ్చయము అంటే మనం అర్థం చేసుకున్న పురుషార్థ నిశ్చయం కాదు. వారికి అర్థమైన పురుషార్థ నిశ్చయము. మరణం ఆసన్న మయ్యే వరకు ప్రపంచం లోని భోగానుభవంలో సుఖించడమే పరమ పురుషార్థము. అంతే. అంతవరకే (***ఏతావ దితి***). ఈ విషయంలో వారికి నిశ్చితాభిప్రాయ ముంది. అంతకు మించి, ఆ తరువాత, అంటే మరణానంతరము పొంద దగింది ఏదీ లేదు అనేది కూడా వారికి నిశ్చితమే.

వారేమిటో వారికి తెలుసు. వారు జీవితంలో పొంద వలసింది ఏమిటో కూడా వారికి తెలుసు. ఈ విషయ మంతా వారి గురువులు సూత్రబద్ధం చేసి మరీ బుద్ధికి బలంగా పట్టించారు. ఆ సూత్రాలే 'బార్హస్పత్య సూత్రములు'.

సూ॥ **చైతన్య విశిష్టః కాయః పురుషః కామ ఏవైకః పురుషార్థః**

'చేతన మైన శరీరమే పురుషుడు. కామమే ఏకైక పురుషార్థము' అని అసుర గురువైన బృహస్పతి ప్రణీతము.

మరి మోక్షము? మరణమే మోక్షము. మరణం తరువాత అనుభవించ డానికి ఏ ఫలమూ లేదు. మరణం





వచ్చే వరకు ఈ ప్రపంచంలో మనము అనుభవించేదే సుఖం. అంతకు మించిన సుఖం మరొకటి లేదు.

మరణమే మహా సమాధి కనుక, మరణానంతరము జీవుడు అనే వాడే లేడు. జీవుడు లేడు కనుక దేవుడూ లేడు. జీవేశ్వరు లిరువురూ లేరు కనుక స్వర్గం లేదు. ఆ హేతువు తోనే నరకమూ లేదు. ధర్మం లేదు. పుణ్యం లేదు. మోక్షం లేదు. మరే ముంది? ఎంత వరకైతే విషయాలను భోగించడము అనేది జరుగుతుందో, అదే ఉంది. ఆ సుఖమే ఉంది (***ఏతావ దితి***). ఆ సుఖానుభవమే యోగము. అది దూరం కాకుండా జాగ్రత్త పడటమే క్షేమము. ఇవే ఆసురీల యోగక్షేమాలు.

చివరగా, వీరి జీవనసరళిని, జీవిత గమ్యమును, అనుభవ సారమును సంక్షేపంగా చెప్పుకోవాలి అంటే, ఒకటి, అంతు లేని ఆశాపరులు అయినందున విషయ చింతనను మరణాంతము నిర్విరామంగా సాగిస్తుంటారు. రెండు, కామోప భోగమునే పరమ పురుషార్థంగా నిశ్చయిస్తారు. మూడు, అంతకు మించి ఏమీ లేదని, భోగానుభవమే, అంటే విషయ సుఖమే పొంద దగినది (***ఏతావ దితి***) అనే విషయంలో నిశ్చితాభిప్రాయాన్ని కలిగి ఉంటారు.

*మరి, ఈ కామోప భోగాలు ఎలా ప్రాప్తిస్తాయి? ఈ విషయంలో కూడా వారికి పూర్ణావగాహన ఉంది. చదవండి.*

**ఆశాపాశ శతై ర్బద్ధాః కామక్రోధ పరాయణాః ।**
**ఈహన్తే కామభోగార్థ మన్యాయే నార్థసఞ్చయాన్ ॥** 12

***ఆశాపాశ శతైః-బద్ధాః-కామక్రోధ పరాయణాః***
***ఈహంతే-కామభోగార్థం-అన్యాయేన-అర్థసంచయాన్***

| | | | |
|---|---|---|---|
| ఆశాపాశశతైః | = వందల కొలది ఆశాపాశముల చేత | కామభోగార్థం | = కామానుభవము కొరకు |
| బద్ధాః | = బంధింపబడిన వారై | అన్యాయేన | = అన్యాయముగ |
| కామ క్రోధపరాయణాః చ | = కామక్రోధములతో నిండిన వారై | అర్థసంచయాన్ | = ధనము కూడబెట్టుటను |
| | | ఈహంతే | = కోరుతూ ఉంటారు |

**వందలాది ఆశాపాశాల చేత బంధింపబడి ఉంటారు. కామక్రోధాలనే ప్రధానంగా ఆశ్రయించుకొని ఉంటారు. కామభోగాల కొరకు అన్యాయంగా ధనాన్ని కూడ బెడుతూ ఉంటారు.**

**వ్యాఖ్య**

కామోప భోగమే సుఖప్రాప్తి హేతువని, అదే సుఖస్థాన మని భావించి, అంతులేని, అవధి లేని విషయ భోగాసక్తికి సంబంధించిన సుఖాలలో రమిస్తూ ఇదే పురుషార్థము, ఇంతకు మించి పొంద దగింది లేదు అని నిశ్చయించు కొనిన ఆసురీలు ఆశాపాశాల చేత బద్ధు లౌతున్నారు, బందీ లవుతున్నారు అంటున్నాడు భగవంతుడు.

### ఆశాపాశ బద్ధులు

ఆసురీలు బందీ లయ్యారని ఇప్పటికే మనకు అర్థ మైంది. అయితే, వారిని బంధించిం దెవరు? దేనితో బంధించారు? ఆసురీలు పాశ బద్ధులు. త్రాళ్ళ చేత కట్ట బడ్డారు. మరి ఆ బంధన రజ్జువులు ఏమిటి? ఆశలు. ఆశలే పాశాలు. అవి కూడా ఒకటో, రెండో కాదు. వందలాది ఆశ లనే పాశముల చేత కట్ట బడ్డారు అంటున్నాడు భగవంతుడు (***ఆశా పాశ శతై ర్బద్ధః***).

ఆసక్తి కలిగిన అప్రాప్త మైన విషయాల యందు ప్రగాఢ మైన అభిలాషయే ఆశ. మనిషిలో ఒక్క ఆశే ఉండదు. ఎన్నో ఉంటాయి. ఎన్ని ఆశ లుంటే అన్ని పాశా లున్నా యని అర్థము. అవన్నీ ఏకమై మనిషిని దృఢంగా బంధిస్తాయి. కనుకనే వారు వందలాది ఆశ లనే త్రాళ్ళ చేత కట్ట బడ్డారు. అందువల్ల అనేక వైపులకు లాగ బడుతున్నారు. ఒక్క త్రాడైతే, ఎలాగో ప్రయత్నించి త్రెంచుకో వచ్చు. వందలాది త్రాళ్ళను ఒక్క వ్యక్తి విడిపించుకో గలడా? బంధములో ఉండ లేక, బంధాన్ని తొలగించుకో లేక ఆసురీ సంపద గల జీవులు ఈ విధంగా అల్లాడుతూ ఉంటారు.

ఆశలు ఒక విధాన తీరేవి కావు. ఊహల నుండి ఆశలు పుడుతాయి. ఊపిరి పోయేంత వరకు అంటి పెట్టుకొని ఉంటాయి. ఒక వైపు ప్రయత్నంతో కొన్ని ఆశలు తీరుతూ ఉంటే, మరో వైపు క్రొత్త ఆశలు చిగురిస్తూనే ఉంటాయి. అందువల్ల, ఆశలు తీరుతున్నా వాటి సంఖ్య మాత్రం తగ్గదు. వాటికి అంత మెక్కడో అర్థం కాదు. భాగవతంలో వామనమూర్తి బలిచక్రవర్తికి చేసిన ఉపదేశ మదే. ఆశాపాశము పొడవెంతో ఇప్పటికి తెలుసుకున్న వారు లేరు. ఆశల విషయములో ఎవరి కైనా శ్రమలు మిగిలాయే గాని ఫలితాలు సిద్ధించ లేదు అంటాడు.

శా॥ *ఆశాపాశము దా గడున్ నిడుపు : లేదంతంబు రాజేంద్ర ! వా*
*రాశి ప్రావృత మేదినీ వలయ సామ్రాజ్యంబు సేకూరి యుం*
*గాసిం పొందిరి గాక వైన్య గయ భూకాంతాదులు న్నర్థకా*
*మాశం బాయగ నేర్చిరే మును నిజా శాంతంబులం జూచిరే !*

'రాక్షసేంద్రా! బలీ! ఆశ అనే త్రాడు చాలా పొడ వైంది. దానికి అంత మెక్కడో తెలియదు. పూర్వము పృథు చక్రవర్తి, గయుడు మొదలైన భూపతులు సాగర పర్యంతం విస్తరించిన సామ్రాజ్యాన్ని పొంది వైభవంగా పాలించారు. వారు కూడా అవిరళంగా శ్రమించారే గాని, అర్థ కామాల విషయంలో ఆశలను త్యజించలేక పోయారు. ఆశలు నెరవేరింది లేదు. ఆశలు వాళ్ళను విడిచి పెట్టిందీ లేదు' అని పోతనామాత్యుని ఆంధ్ర మహాభాగవతము - అష్టమ స్కంధము.

ఆశాపాశాలను గూర్చి ఆసక్తికర మైన ఒక్క విషయాన్ని మీకు చెప్పాలి. ఆశాపాశాలు అంటే ఆశలే పాశా లని కదా అర్థం! అంటే బంధన పాశాలు. ఒక వ్యక్తిని త్రాళ్ళతో కట్టేసి నపుడు అతడు ఇక కదల లేడు. ఉన్న చోటే పడి ఉంటాడు. అంటే, త్రాళ్ళతో కట్టేస్తే పడి ఉండటం, త్రాళ్ళను విప్పేస్తే పరుగులు తీయడం సహజంగా మనం చూచే విషయం. మన అనుభవంలో ఉండే విషయం. అన్ని పాశాలూ ఇలాగే ఉంటాయి. కాని, ఆశాపాశాలు విచిత్రమైన బంధాలు అంటుంది శాస్త్రం. ఇవి మన అనుభవానికి భిన్నంగా ఉండటమే గాక, చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి కూడా. ఎలాగో చూడండి.

శ్లో॥ *ఆశానామ మనుష్యస్య కాచి దాశ్చర్య శృంఖలా ।*
*యయా బద్ధాః ప్రధావన్తి ముక్తా స్తిష్ఠన్తి పంగువత్ ॥*

'ఆశ అనేది మనిషికి ఆశ్చర్యాన్ని కలిగించే బంధము. విస్మయాన్ని కలిగించే సంకెల. ఎలాగంటే, ఆశా పాశాలచే కట్టేస్తే జనులు పరుగులు తీస్తారు. ఆశాపాశాలను విప్పేస్తే, కుంటి వాళ్ళ లాగా కదలకుండా ఒకే చోట ఉండి పోతారు.'

కట్టేస్తే పడి ఉండటం, విప్పేస్తే పరుగులు తీయడం మన అనుభవంలో ఉన్న విషయం. కానీ, ఆశ అనే త్రాళ్ళ బంధము ఇందుకు విపరీతంగా కనిపిస్తూ ఉంది. 'కట్టేస్తే పరుగులు పెడతారు; విప్పేస్తే కుంటి వాళ్ళ





లాగా కదలకుండా ఉంటారు' అంటోంది శాస్త్రం. అంటే ఆశలలో చిక్కిన వాళ్ళు స్థిరంగా ఒక చోట ఉండ లేరు. ఆశలు విడిపోతే, ఊడిపోతే, దూరమై మాడిపోతే, ఇక ఆశలు తీర్చుకోవడానికి పరుగులు పెట్టాల్సిన అవసరం ఉండదు కనుక ఎక్కడ ఉన్న వారు అక్కడే, తృప్తిగా, ఆనందంగా, నిశ్చలంగా, నిర్మలంగా ఉండి పోతారు.

**కామక్రోధాశ్రయులు**

వందలాది ఆశ లనే త్రాళ్ళ చేత కట్టబడ్డ ఆసురీలకు ఆశ్రయ స్థాన మేదో చెబుతున్నాడు భగవంతుడు. శతాది ఆశా పాశాలచే బద్ధులై, నియంత్రింప బడిన ఆసురీలు ***(ఆశాపాశ శతైః బద్ధాః నియన్త్రితాః)*** కామక్రోధా లను ఆశ్రయించుకొని ఉంటారు ***(కామక్రోధ పరాయణాః)***. కామక్రోధాశ్రయులై ఉంటారు. కామక్రోధాలనే ఉత్తమ మైన ఆశ్రయ స్థానాలుగా భావించి, వాటిని ఆశ్రయించుకొని ఉంటారు. అంటే, కామక్రోధాలతో నిండిపోయి ఉంటారని భావము.

ఎవరికి ఏది ఆశ్రయమో దానిని వదిలిపెట్టి వాళ్ళు ఉండ లేరు. కామక్రోధాలను ఆశ్రయంగా పొంది ఉన్నారు అంటే, అవి వారికి, వారి మనుగడకు ఆధారంగా ఉన్నాయని అర్థము. ఆధారాన్ని విడిచి పెట్టి ఎవరైనా ఎలా ఉండ గలరు? కనుక ఆసురీ సంపద కల వారు కామక్రోధాలను ఏ కాలం లోను విడిచి పెట్టి ఉండ లేరు. అవే వారికి ప్రాణవాయువు. వాటిని ఆశ్రయించుకొనే బ్రతుకును సాగిస్తూ ఉంటారు కనుక వారు కామక్రోధ పరాయణులు. పూర్వ శ్లోకంలో మనం చూసినట్లు, ఆసురీలు పరమ పురుషార్థంగా భావించే కామోప భోగానికి కామక్రోధాలే ప్రధాన ఆశ్రయాలు.

విషయాసక్తియే కామము. విషయాలను అనుభవించాలనే ఆశయే కామము ***(కామః ఇచ్ఛా విషయేషు)***. కామ వాంఛను తీర్చుకొనే ప్రయత్నంలో ఉన్న వ్యక్తికి ఏదైనా విఘాతము కలిగినా, లేదా అతని ప్రయత్నము ప్రతిఘటించ బడినా, తత్ఫలితంగా అతనిలో ఉత్పన్న మయ్యే చిత్తవృత్తియే క్రోధము ***(తస్య ప్రతిహతౌ జాతా చిత్తవృత్తిః క్రోధ ఇత్యుచ్యతే)*** అనబడుతుంది.

కామం ఫలించ నపుడు, కామం ఫలించడానికి ప్రతిబంధకము ఎదురై నపుడు, ఆ ప్రతిబంధకానికి కారకులైన వారిని నియంత్రించి, తద్వారా ఆశించింది పొందడానికి కామసక్తులు ఉపయోగించుకొనే ఆయుధమే క్రోధము. తమ వాంఛలను ఈడేర్చుకోవడానికి, విషయాలను ఉపభోగించడానికి ఆసురీలు ఆశ్రయించేది కామక్రోధాలనే గాని ధర్మాధర్మాలను కాదు. అందుచేత వారు కామక్రోధ పరాయణులు.

మరొక్క విషయాన్ని కూడా ఇక్కడ మనం సమన్వయించు కోవాలి. కామక్రోధాలు ఎప్పుడైతే ఆశ్రయా లయ్యాయో, లోభం కూడా అందులో అంతర్భాగమే. ఆసక్తితో విషయాలను సాధించు కోవడం కామ మైనపుడు, అలా ఆశించి, అభిలషించి సాధించుకున్న దానిని ఎవరైనా పోగొట్టు కుంటారా? సంపాదించు కున్నది అనుభవించ డానికే గాని త్యజించడానికి కాదు కదా! కనుక పొందిన వాటిని పోగొట్టుకోవడాన్ని భరించ లేని అశక్తతయే లోభము ***(త్యాగా సహిష్ణుతా లోభః)***.

కామము ఫలించకుండా ప్రతిబంధకము ఎదురై నపుడు దానిని ఫలింప చేసుకోవ డానికి క్రోధము ఎలా ఉత్పన్న మైందో, పొందిన దానిని పోగొట్టుకోవడాన్ని సహించ లేని స్థితిలో లోభాన్ని కాపాడటానికి కూడా క్రోధము విజృంభిస్తుంది. కనుక క్రోధ మనేది ఇటు కామ సాధనకు, అటు లోభ రక్షణకు రెండిటికీ సహకరిస్తుంది.

కామ మనే ఆశ కేమో అంతం లేదు. ఎంత పొందినా లోభము తృప్తి చెందదు. ఎంత ఖర్చు చేసినా క్రోధం ఖాళీ కాదు. ఏదైనా ఖర్చు పెడితే తరిగి పోతూ ఉంటుంది. లేదా కరిగి పోతూ ఉంటుంది. క్రోధం

మాత్రం వినియోగంలో పెరుగుతుందే గాని తరగడ మంటూ ఉండదు. కోపం వచ్చిన వాళ్ళను చూచి నపుడు ఈ సత్యం మనకు అర్థ మవుతుంది. ఆ విషయము క్రోధనులే స్వయంగా చెబుతూ ఉంటారు. 'నాకు కోపం వచ్చి నపుడు తెలుస్తుంది నే నేమిటో!' అంటూ ఉంటారు. నిజమే, క్రోధం అలాంటిదే. వాళ్ళేమిటో తెలియాలి అంటే క్రోధం రావాల్సిందే. అంటే, క్రోధం లేనపుడు వాళ్ళేమిటో వాళ్ళకు కూడా తెలియదని అర్థము. ఈ కామక్రోధ లోభాలను ఆశ్రయించిన అసుర సంపన్నులు, తమ గోతులను తామే త్రవ్వుకొనే కార్యాలలో సదా నిమగ్నమై ఉంటారు. కామక్రోధ లోభాల దారుణ ప్రభావము బ్రతుకుపై ఎలా ఉంటుందో దైవీ సంపద గల మహాత్ము లకు తెలుసు కనుక, వారు కామక్రోధ పరాయణులు కాకుండా పరమేశ్వర పరాయణు లవుతారు **(మత్పరాయణా)**. కామక్రోధ లోభాల నుండి విడిపడటానికి పరమేశ్వరుని పాదాలను ఆశ్రయిస్తారు.

*ఎంత ఈదినా కామానికి తృప్తి లేదు*
*ఎంత చేదినా లోభానికి సంతృప్తి రాదు*
*ఎంత వెచ్చించినా క్రోధము తరిగి పోదు*
*నీ అడుగుల కడ పడి ఉందు నీలకంఠా !*

అని నీలకంఠ శతకంలో ఒక విబుధి పండు.

కామోపభోగమే జీవితంలో ఏకైక పురుషార్థము అని భావించి, విషయాలను ఉపభోగించడమే సుఖ స్థానము అని నిశ్చయించుకొనిన అసుర మానవులు, భోగ్య వస్తువులను సముపార్జించు కోవడానికి అవసర మైన ధనాన్ని ఎలా పొందుతారు? ధన సంపాదనం ఎలా చేస్తారు? అదే చెబుతున్నాడు.

**అన్యాయార్జనము**

కోరికలను తీర్చుకోవడానికి, భోగ్య వస్తువులను అనుభవించడానికి ***( కామ భోగార్థం కామభోగ ప్రయోజనాయ )*** అధర్మ మార్గాలలో పరుల ధనాన్ని అన్యాయంగా ఆర్జించడం ద్వారా ధనాన్ని ప్రోగు చేసుకుంటారు ***( అన్యాయేన అర్థ సంచయాన్ )***. తమ అవసర నిమిత్తమే అయినా శ్రమ పడి సంపాదించు కోవడం అసుర మానవులకు తెలియదు. ఇతరులను శ్రమ పెట్టి సాధించు కోవడమే తెలుసు. న్యాయంగా ఆర్జించడానికి నడుము బిగించరు. అవలీలగా అన్యాయ మార్గాలలో తన్నుకు పోవడానికే తపిస్తూ ఉంటారు. ధర్మ విరుద్ధ మార్గాన, శాస్త్ర విరుద్ధ మార్గాన కపట వంచనాది ఉపాయాల చేత ధనరాశులను ప్రోగు చేసు కుంటారు ***( అర్థ సంచయాన్ )***. ధన సంచయము అని బహువచన ప్రయోగం చేయడం చేత ***( సంచయాన్ - రాసులు )***, ధనము ప్రాప్తించినా, ధన తృష్ణ తీరక పోవడం వల్లనే ధన సంచయము జరుగుతూ ఉంది కనుక, మనం చెప్పుకున్నట్లు ఆశా రూపంగా లోభము వర్ధిల్లుతూనే ఉంది.

కామములను అనుభవించడం అనే ప్రయోజనం కొరకు ఆసురీ సంపద కలిగిన మానవులు అన్యాయ మార్గాలలో చరించి ధనరాశుల్ని ప్రోగు చేసుకుంటూ ఉంటారు. ధర్మం విషయంలో విశ్వాసం లేని వారు కనుక అధర్మ మార్గాలలో స్వేచ్ఛా విహారం చేస్తూ ఉంటారు. ధనార్జనే వీరికి ప్రధాన మైనా, దానిని సాధించు కోవడానికి అనేకము లైన మార్గాలను అనుసరిస్తారు. వ్యాపారు లైతే నల్లబజారును సృష్టిస్తారు. ఉద్యోగు లైతే లంచాల తోనే కంచాలు నింపుకుంటారు. రాజకీయ నాయకు లైతే ఇక చెప్ప నవసరం లేదు. అన్యాయార్జనమే మా అధికార ఏకైక లక్ష్యం అని శపథం చేసి మరీ పదవులలో పాదం పెడతారు. ఇక మరీ నీచు లైతే చోరత్వానికి పాల్పడతారు. అవరోధాలు ఎదురైతే, వాటికి కారణమైన వారిపై కక్ష కడతారు. కూలికి ఖూనీ చేసే క్రూరాత్ము లైతే నేటి సమాజంలో సంతలో సరుకు ల్లాగా అమ్ముడు బోతున్నారు. వీటన్నిటి వెనుక అసుర ప్రవృత్తే ఉంది. రాక్షస నైజమే రాజ్య మేలుతోంది.





*మరి, ఇలాంటి దుర్మార్గ దుశ్చర్యలకు పాల్పడే అసుర మానవుల అభిప్రాయాలు ఎలా ఉంటాయి? వాళ్ళ మనస్సులలో ఎలాంటి ఆలోచనలు నడుస్తూ ఉంటాయి? అదీ చెబుతున్నాడు.*

**ఇద మద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్ ।**
**ఇద మ స్తీద మపి మే భవిష్యతి పునర్ధనమ్ ॥** **13**

*ఇదం-అద్య-మయా-లబ్ధం-ఇమం-ప్రాప్స్యే-మనోరథం*
*ఇదం-అస్తి-ఇదం-అపి-మే-భవిష్యతి-పునః-ధనం*

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇదం | = ఇది | | మే | = నాకు | |
| అద్య | = ఇప్పుడు | | ఇదం | = ఇది | |
| మయా | = నా చేత | | అస్తి | = ఉంది | |
| లబ్ధం | = పొందబడినది | | పునః | = మరల | |
| ఇమం | = ఈ | | ఇదం | = ఈ | |
| మనోరథం | = కోరికను | | ధనం అపి | = ధనము కూడా | |
| ప్రాప్స్యే | = పొందగలను | | భవిష్యతి | = ప్రాప్తిస్తుంది | |

**నేను ఇంత ధనం సంపాదించాను. ఈ కోర్కెను కూడా తీర్చు కుంటాను. ఇప్పుడు ఈ మాత్రం ఉంది. ముమ్ముందు ఇంకా వస్తుంది.**

**వ్యాఖ్య**

అసుర సంపద నాశ్రయించి, ఆశాపాశాలలో చిక్కి, కామక్రోధ పరాయణులై, కామ భోగార్థం అన్యాయ మార్గాలలో ధన సంపాదన చేసే వారి ఆలోచనా విధానమును ఈ శ్లోకంలో భగవానుడు వర్ణిస్తున్నాడు.

'ఇప్పుడు నా వద్ద ఈ ధనం ఉంది. ఈ మాత్రం ధనం సంపాదించాను ***( ఇదానీం ఇదం ద్రవ్యమ్ అస్తి )***. ఇంకా సంపాదిస్తాను. ప్రస్తుతం ఉన్నది నాకు తృప్తి నిస్తూ ఉంది. నా మనోరథం నెరవేరుతుంది. ఇప్పుడు ఇది ఉంది. భవిష్యత్తులో అది కూడా లభిస్తుంది. ఈ నాటికి ఇది. రాబోయే సంవత్సరంలో ఆ ధనం కూడా వస్తుంది ***( ఇదం అపి చ మే భవిష్యతి ఆగామిని సంవత్సరే పునః ద్రవ్యమ్ )***. అప్పుడు ఉండినది, ఇప్పు డున్నది, అప్పుడు వచ్చి చేరేది కలిపితే అంత అవుతుంది. ఇంత ఉంటేనే నేను ఇలా ఉన్నాను. అంత అయితే, అప్పుడు నే నెంతవుతానో? ***తేన అహం ధనీ విఖ్యాతః భవిష్యామి*** - ధనవంతులలో నేను ప్రసిద్ధుణ్ణి అవుతాను'. ఇది అసుర మానవుల ఆలోచనా ధోరణి. ఉన్నది -ఉండ బోయేది, దీని చుట్టే తిరుగుతూ ఉంటాయి వాళ్ళ చిత్తవృత్తు లన్నీ.

'ఈ రోజు పరిస్థితి ఎలా ఉంది? రేపటి పరిస్థితి ఎలా ఉండ బోతుంది? ఆ ఉపాయంతో నేడున్న ధనం ప్రాప్తించింది. ఈ ఉపాయంతో రేపు ఆ ధనం వచ్చి చేరుతుంది. కొడుకు సంపాదించింది ఈ మాత్రం ఉంది. రేపు కోడలు వస్తూ వస్తూ తెచ్చేది ఈ మాత్రం ఉంటే, మొత్తం ఆ మాత్ర మవుతుంది.'

'ఈ నెల బ్యాంకులో ఈ మాత్రం ఉంది. తరువాత మాసంలో ఎలాగైనా ఆ మాత్రం ఉండాలి. బ్యాంకులో వేయడం కన్నా షేర్లు కొంటే మంచి దేమో! బంగారు ధర కూడా రోజు రోజుకీ పెరుగుతూ ఉంది. బంగారు కొని దాచి పెడితే నేడున్నది రెండింతలు అవుతుం దేమో!' ఇదంతా అసుర సంపన్నుని మనోరథం. ఈ సందర్భములో మనస్సుకు సంతోషాన్ని కలిగించే ఈ ఆలోచనా విధానాన్ని ***మనోరథం*** గా భగవంతుడు అభివర్ణించడము విశేషంగా ఆలోచించ దగిన విషయము.

**మన ఏవ రథా యస్య సః మనోరథః** - మనస్సునే రథంగా కలిగింది మనోరథము. అంటే, ఎవరి మనస్సును వాళ్ళు వాహనంగా మలచుకొని శ్రమ లేకుండా, కోరిన విధంగా విహరించడము అని అర్థము. రథములో ఊరేగాలి అంటే, రథము కావాలి, గుఱ్ఱాలు కావాలి, నడిపే సారథి ఉండాలి. గుఱ్ఱాలకు మేత పెట్టాలి. సారథికి జీతం ఇవ్వాలి. పైగా దేశకాలాదులను కూడా పరిగణన లోకి తీసుకోవాలి. ఢిల్లీకి పోవా లనేది సంకల్పం అనుకోండి. రథంలో ఢిల్లీకి చేరడానికి ఎంత సమయం పడుతుంది, ఖర్చు ఎంత, శ్రమ ఎంత? అదే బుద్ధి కారులో కూర్చున్నా మనుకోండి, మరు క్షణం ఢిల్లీలో ఉండొచ్చు. శ్రమ లేదు. సమయం పట్టదు. పెట్రోలు పట్టించ నవసరం లేదు. డ్రైవరును పట్టించుకో నవసరం లేదు. ఇదీ మనోరథం అంటే. గాలిలో తేలి పోయేందుకు అనువైన రథం. మనోరథాలు మనోవీధుల్లో తిరుగుతాయే కాని మహిపై నడువవు. మనస్సు తిప్పే రథాలు మనస్సు లోనే తిరుగుతూ ఉంటాయి. గాలి మనస్సు నిర్మించే మేడలు, నడిపించే రథాలు కూడా గాలి లాగే ఉంటాయి.

మనోరథాలు మిథ్యా రథాలు. సత్య మైనవి కావు. మిథ్యా రథాలైన మనోరథాల కన్నా, మిథ్యా రథాలే అయినా స్వప్నగత రథాలు మేలైనవి అని శాస్త్రం విలక్షణ మైన అభిప్రాయాన్ని వెలి బుచ్చింది.

మనస్సు కల్పించేది మనోరథం. స్వప్నగత రథం కూడా మనస్సు యొక్క సృష్టే కదా! కనుక రెండూ మిథ్యలే. రెండూ సత్యం కాదు. అయినా మనోరథం కన్నా స్వప్నగత రథం అర్థవంతంగా ఉంది అని నిర్వచించింది శాస్త్రం. ఆశ్చర్యంగా ఉంది కదూ? ఈ శ్లోకం చూడండి.

***శ్లో॥ స్వాప్నం సుఖం దుఃఖ మసత్య మేవ తథాఽ పి తస్యాఽ నుభవ స్తదానీమ్ ।***
***తథైవ శుక్తౌ రజతస్య మిథ్యా మనోరథోతంతు వినాఽ భూతిమ్ ॥***

'స్వప్నము లోని సుఖదుఃఖాలు అసత్యములు, మిథ్యా రూపములే అయినా, స్వప్న కాలములో నైనా వాటి అనుభవం ఉంది. అలాగే ముత్తెపు చిప్పలో వెండి ఉన్నది మిథ్యయే అయినా, కనీసం భ్రాంతి సమయములో నైనా అనుభవంగా ఉంది. ఈ రెండు మిథ్యా రూపాలు మనోగతాలే అయినా, సత్యాలు కాకపోయినా, ఆయా కాలాలలో అనుభవ రూపంగా ఉన్నాయి.'

ఇప్పుడు మనోరథము విషయము ఆలోచించండి! ఇది అనుభవము లేకనే మిథ్య. స్వప్న దృశ్యాలు, శుక్తి రజతాలు అనుభవ సహిత మిథ్యా భూతా లైతే, మనోరథం అనుభవ రహిత మిథ్యా భూతము. అన్నీ ఊహా పోహాలే. అపోహయుత ఊహలే.

**నిన్నటి విషయము యోచించాలన్నా**
**నేడు ఇక్కడే చేయాలి**
**రేపటి మాట చర్చించాలన్నా**
**ఇక్కడే ఇప్పుడే జరగాలి**
**గతము రాదు - భావి తెలియదు**
**వర్తమానమే వినియోగము**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

మాయలు చేసే మనస్సులు ఎన్ని మనోరథాల నైనా సృష్టించుకొని ఊరేగుతాయి. కల్లలో కళ ఎక్కడుంది?





నేడు లేదు. రేపుకు రూపు లేదు. ఈ క్షణమే ఉంది. పోయిన క్షణం మనది కాదు. వచ్చే క్షణం మనది అవుతుందో లేదో చెప్పలేము. ఉన్న క్షణం మనోరథా న్నెక్కి ఊరేగితే, బ్రతుకు ఏం కావాలి? అనే ఆలోచన దైవ సంపద ఉన్న వారికి కలుగుతుందే గాని అసుర సంపద నాశ్రయించుకున్న వారికి కలిగే అవకాశమే లేదు. దైవ సంపద సత్త్వగుణ ప్రధానంగా ఉంటుంది కనుక, విచార యుతమై, వివేక వైరాగ్యాదు లతో నిండి ఉంటుంది. అసుర సంపద రజ స్తమో గుణాలతో కూడి ఉంటుంది కనుక, కామక్రోధాలను ఆశ్రయించుకొని మనోరథంలో ఊరేగుతూ ఉంటుంది.

*మరి ధనాన్నే లక్ష్యంగా చేసుకుని కపోల కల్పితాలతో కాలం గడిపే అసురులు, వారు కలలు గనే కలిమిని ఎలా సాధిస్తారు? ఎలాగైనా సాధిస్తారు. ఏదైనా చేస్తారు. దేని కైనా వెనుకాడరు. ఎలాగో, చూడండి.*

**అసౌ మయా హత శ్శత్రు ర్హనిష్యే చాపరానపి ।**
**ఈశ్వరోఽ హ మహం భోగీ సిద్ధోఽ హం బలవా న్సుఖీ ॥** 14

***అసౌ-మయా-హతః-శత్రుః-హనిష్యే-చ-అపరాన్-అపి***
***ఈశ్వరః-అహం-అహం-భోగీ-సిద్ధః-అహం-బలవాన్-సుఖీ***

| | | | |
|---|---|---|---|
| అసౌ | = ఈ | అహం | = నేను |
| శత్రుః | = శత్రువు | భోగీ | = భోగిని |
| మయా | = నా చేత | అహం | = నేను |
| హతః | = వధింప బడ్డాడు | సిద్ధః | = సిద్ధుణ్ణి |
| అపరాన్ అపి చ | = ఇతరులను కూడా | అహం | = నేను |
| హనిష్యే | = చంపుతాను | బలవాన్ | = బలవంతుణ్ణి |
| అహం | = నేను | సుఖీ | = సుఖిని |
| ఈశ్వరః | = నియంతను | | |

**ఈ శత్రువును చంపేశాను. మిగిలిన వాళ్ళను కూడా చంపేస్తాను. నేను నియంతను. నేను భోగిని. నేను సిద్ధుణ్ణి. బలవంతుణ్ణి. సుఖిని.**

**వ్యాఖ్య**

ధన సంచయము కేవలం భోగార్థమే కాదు. ధనం భోగార్థమే అయితే సంపన్నులు తృప్తిగా జీవించ వచ్చు. ధనం ఇప్పుడు ఉంది అని పూర్వ శ్లోకంలో అంటూనే, భవిష్యత్తులో ఇంకా సంపాదిస్తాను. దానితో నేను ధనవంతుడిగా ఖ్యాతి గడిస్తాను ***(తేన అహం ధనీ విఖ్యాతః భవిష్యామి)*** అని ఊహలు కంటున్నాడు అంటే, ధన సిద్ధితో పాటు ప్రసిద్ధిని కూడా కోరుకుంటున్నాడు అని అర్థం.

ఇదొక పోటీ మనస్తత్త్వము. తానే అధికుడుగా చెలామణి కావాలి అనే దుగ్ధ. ఈ రోజుల్లో, ముఖ్యంగా వాణిజ్య రంగంలో ఈ దుగ్ధ దురద లాగా ప్రాకి పోయింది. వందల కోట్లు ఉన్నా, వేల కోట్లు ఉన్నా, తృప్తి చెందకుండా, ధనికుల రాజ్యంలో నా సంఖ్య ఎంత? మొదటి అంకెను ఎప్పుడు సొంతం చేసుకుంటాను? అనే దురాలోచనతో ధర్మదూరులై, దూర దేశాలన్నీ దొర్లి వచ్చి, చివరికి తన సంఖ్య ఎంతో, తన నంబరెంతో తెలుసుకోవ డానికి కారాగృహంలో కాలు మోపి, అది ఒకటి కాదని, రెండు కూడా కాదని, రెండు వందలూ

కాదని, నాలుగు వందల ఇరవై అని తెలుసుకొని తెల్లబోయి, కటకటా అంటూ కటకటాలు లెక్కెడుతూ నిద్ర లేని రాత్రుల్ని నేలపై పడుకొని గడుపుతున్న వాళ్ళను మనం ఎందరిని చూడటం లేదు? ఎందుకు ఈ ఆసురీ సంపద? దేని కోసం ఈ రాక్షస బ్రతుకు? భోగార్థం అక్షయ ధనాన్ని సంపాదించడమే గాక, సిద్ధితో పాటు ప్రసిద్ధిని పొంద డానికి, విత్తముతో పాటు వైభవాన్ని గడించడానికి ఎంత దారుణాని కైనా ఒడి కడతారు. అవసరమైతే తాము ముందు నిలవడానికి అడ్డున్న వాళ్ళను కడకు నెట్టుతారు. కడ చేర్చుతారు. కడ తేర్చేస్తారు. ఎలాగో చూడండి!

**చంపాను - చంపేస్తాను**

'అతణ్ణి ఎవ్వరూ ఎదుర్కోలేక పోయారు. దుర్జయుడైన అతణ్ణి నేను ప్రపంచానికి దూరం చేసేశాను. వాడు నా చేతిలో చచ్చాడు ***( అసౌ శత్రుః దుర్జయః మయా హతః ).*** వీడి గతే అందరికీ పడుతుంది. ఈ శత్రువును ఎలా వధించానో, మిగిలిన శత్రువు లందరిని కూడా అలాగే చంపేస్తాను ***( హనిష్యే చ అన్యాన్ అపరాన్ అపి).*** నా కసికి మసి పట్టదు. నా కత్తికి పదును తగ్గదు. నా మాటకు తిరుగు లేదు. నేను పట్టా నంటే పొడై పోవాల్సిందే. నేను ముట్టానంటే మునిగే వాళ్ళే గాని తేలే వారుండరు. శని ఏడేండ్లు పడతాడు అంటారు. నేను పడితే ఏడేండ్లు కాదు, పద్నాలు గేండ్లు. అది ఋజువు చేయడానికే పద్నాలుగో శ్లోకంలో చేరి పోయాను'.

నిజమే. మరి, ఈ శక్తి నీకు ఎక్కడి నుండి వస్తుంది? ఇదంతా ఎలా చేస్తావు? అని అడిగితే, అతడు ఏమి సమాధానం చెబుతాడో తెలుసా? ***ఈశ్వరోఽ హం*** అనేదే అతని సమాధానం. 'నేనే ప్రభువును. సమర్థుణ్ణి. నాతో సమాన మైన వాడు లేడు ***(సర్వథాఽ పి నాస్తి మత్తుల్యః).*** నేనే నియంతను' - ఇదంతా రాక్షస ప్రలాపము. నాకు మించిన వారు లేరు, నేనే ఈశ్వరుణ్ణి అని గర్వించే ఆసురీలు ఇలాగే పలవరిస్తారు. కాలాలు మారుతున్నా, యుగాలు దొర్లుతున్నా ఈ కల్మష చిత్తులు ఇలాగే ప్రేలు తుంటారు. ప్రహ్లాదుని తండ్రి హిరణ్యకశిపుని నోటి నుండి మనకు ఇలాంటి మాటలే విన పడతాయి.

సీ॥ *అస్మదీయం బగు నా దేశమున గాని మిక్కిలి రవిమింట మెరయ వెరచు*
*నన్నికాలము లందు ననుకూలుడై కాని విద్వేషియై గాలి వీవ వెరచు*
*మత్తప్రతాపానల మందీ కృతార్చియై విచ్చలవిడి నగ్నీ వెలుగ వెరచు*
*నతి తీక్ష్ణమైన నా యాజ్ఞ నుల్లంఘించి శమనుండు ప్రాణుల జంప వెరచు*
తే॥ *నింద్రు డౌదల నాజ్ఞోల నెత్త వెరచు సమర కిన్నర గంధర్వ యక్ష విహగ*
*నాగ విద్యాధరావలి నాకు వెరచు నేల వెరవవు? పలువ నీ కేది దిక్కు?*

'ఓరీ, తుంటరీ! నా అనుమతి లేకుండా ఆకాశంలో అతిగా మండటానికి సూర్యుడు భయ పడతాడు. ఏ కాలంలో నైనా వాయువు అనుకూల పవనాలు వీస్తాడే గాని ప్రతికూలంగా వీచడానికి జంకి పోతాడు. నా ప్రతాప మనే అగ్ని ముందు తన ప్రతాపాన్ని చూపలేక అగ్నిదేవుడు మందంగా వెలుగుతాడు. నేను కాదంటే, ప్రాణుల్ని ముట్టుకోవ డానికి కూడా యముడు భయ పడతాడు.

ఇంద్రుడు నా ముందు తల ఎత్త లేడు. సురు లైనా, కిన్నరు లైనా, గంధర్వు లైనా, యక్షు లైనా, పక్షు లైనా, నాగు లైనా, విద్యాధరు లైనా నే నంటే భయ పడతారు. నన్ను ఎదిరించే ధైర్యం ఎవరి కుంది?'

తానే ఈశ్వరు డని గర్వంతో, అహంకారంతో ఊగి పోయాడు హిరణ్యకశిపుడు. అసుర సంపదకు సంబంధించిన వాళ్ళందరూ హిరణ్యకశిపులే. వారి దంతా ఒకే బాట. ఒకే మాట. ఒకే పాట.





'నేను నియంతను. ప్రభువును. నేను భోగిని ***( అహం భోగీ ).*** భోగా లన్నీ నాకే అందాలి. నా చుట్టే తిరగాలి. నేను సిద్ధుణ్ణి' అనుకుంటాడు. సిద్ధుడు అంటే సమస్తము సిద్ధించిన వాడు అని అర్థము. 'నాకేం తక్కువ? నాకు లేని దేముంది? అన్ని విధాల జీవితంలో సమస్తమూ సిద్ధించిన వాణ్ణి ***( అహం భోగీ, సర్వ ప్రకారేణ చ సిద్ధః ).*** నాకు సదా విజయమే. సర్వత్ర విజయమే. సర్వదా విజయమే. పుత్రులతో, మనుమలతో, ముని మనుమలతో నేను సంపన్నంగా ఉన్నాను ***( అహం సంపన్నః పుత్రైః నప్తృభిః న కేవలం మానుషః ).*** నేను మామూలు మనిషిని కాను. బలవంతుణ్ణి. సుఖవంతుణ్ణి. మిగిలిన వాళ్ళందరూ భూమికి భారంగా పుట్టిన వాళ్ళే ***(బలవాన్ సుఖీ చ అహ మేవ, అన్యేతు భూమి భారాయ అవతీర్ణాః )*** '.

ఇవి అసుర మానవుని ఊహలు. అనర్థ దాయకమైన ఆలోచనలు. తమను తాము స్తుతించుకుంటూ, పూజించుకునే ఈ అసుర జనులు లోక కంటకులు. మదాంధులు. సమాజ అభ్యుదయానికి అవరోధాలు.

*అనర్థ హేతువైన ఆత్మస్తుతి ఇంకా ఎలా ఉంటుందో వివరిస్తున్నాడు.*

**ఆ ఢ్యోఽ భిజనవా నస్మి కోఽ న్యోఽ స్తి సదృశో మయా ।**
**యక్ష్యే దాస్యామి మోదిష్య ఇ త్యజ్ఞాన విమోహితాః ॥** 15

***ఆఢ్యః-అభిజనవాన్-అస్మి-కః-అన్యః-అస్తి-సదృశః-మయా***
***యక్ష్యే-దాస్యామి-మోదిష్యే-ఇతి-అజ్ఞాన విమోహితాః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆఢ్యః | = | ఐశ్వర్యవంతుణ్ణి | అస్తి | = | కలదు? |
| అభిజనవాన్ | = | ఉన్నత వంశ సంజాతుణ్ణి | యక్ష్యే | = | యజ్ఞము చేస్తాను |
| అస్మి | = | ఉన్నాను | దాస్యామి | = | దానా లిస్తాను |
| మయా | = | నాతో | మోదిష్యే | = | సంతోషిస్తాను |
| సదృశః | = | సమానుడు | ఇతి | = | అని |
| అన్యః | = | మరొకడు | అజ్ఞానవిమోహితాః | = | అజ్ఞాన మోహితులై |
| కః | = | ఎవడు | | | |

**నేను ఐశ్వర్యవంతుణ్ణి. ఉన్నత వంశంలో పుట్టిన వాణ్ణి. నాతో సమానంగా ఎవ డున్నాడు? యజ్ఞాలు చేస్తాను. దానా లిస్తాను. ఆనందిస్తాను - ఇలా అజ్ఞాన మోహితులై ఉంటారు.**

**వ్యాఖ్య**

కేవలం తనను తాను స్తుతించుకుంటూ పోతే, ఏదో నడమంత్రపు సిరితో ఊగిపోతున్నా డని జనులు భావిస్తారేమో నని, తన నేపథ్యాన్ని కూడా స్తుతించు కుంటాడు. 'నేనే కాదు, మా పూర్వీకులు కూడా సామాన్యులు కారు. మా వంశం, మా జాతి అన్నీ అద్భుత మైనవి, అగ్ర స్థానంలో ఉన్నవే' అంటాడు. 'నేను ఐశ్వర్యవంతుణ్ణి ***(ఆఢ్యః ).*** మా పూర్వీకులు కూడా సంపన్నులే. అలాంటి మహావ్యక్తుల వారసుణ్ణి. సత్కుల ప్రసూతుణ్ణి ***( అభి జనవాన్ ).*** ఈ విషయంలో కూడా నాతో సమానులు లేరు ***( తేనాపి న మమ తుల్యః )*** '.

**సరి ఎవ్వరు?**

'సిరి లోనే కాదు, దేనిలో నైనా నాతో సరి ఎవ్వరు? ***( కోఽ న్యోఽ స్తి సదృశో మయా ).*** చెయ్యు వలసిం దంతా చేసేశాను. చూడవలసిం దంతా చూసేశాను. ఆస్తులు దించుకున్నాను. అంతస్తులు పెంచుకున్నాను. అధికారాలు అనుభవించాను. అడ్డు నిలిచిన వాళ్ళను శాశ్వతంగా తొలగించాను. సుఖాలు అనుభవించాను.

నా ప్రగతినే కాదు, నా కళ్ళ ముందే నా వాళ్ళ ప్రగతిని కూడా చూశాను. ఇక నాతో సరితూగే వాళ్ళెవ్వరు?'

**శ్లో॥ *పశ్చ్యాం గతా యౌవనతశ్చ జాతా దారైశ్చ సంయోగ మితాః ప్రసూతాః ।***
***దృష్ట్వా సుతా స్త త్తనయ ప్రసూతిం ద్రష్టుం పునర్వాంఛతి మేఽ న్తరాత్మా ॥***

'బాల్య మంతా హాయిగా గడిపేశాను. యౌవనంలో భార్యల పొందులో అనేక మంది బిడ్డల్ని పొందాను. వాళ్ళు పెరిగి పెద్దవా ళ్ళయ్యారు. వాళ్ళకీ బిడ్డలు కలిగారు. అలా మనుమలను కూడా చూశాను. వాళ్ళ బిడ్డల్ని కూడా ముద్దాడాలని మనస్సు అభిలషిస్తూ ఉంది.

నా లాంటి జీవితం ఎవరి కుంటుంది? అందుకే నాతో సమానులు లేరు అంటున్నాను. ఏ విషయంలో చూచినా నాకు నేనే సాటి' అంటూ తన అసమాన వైభవానికి కారణాలు చెబుతున్నాడు.

## యజ్ఞ దానాలు

ఆసురీ సంపదను ఆశ్రయించిన ఈ అసుర మానవులు కొన్ని కార్యక్రమాలు చాలా విచిత్రంగా చేస్తారు. అవి జ్ఞాన ప్రధానంగా ఉండవు. ధర్మార్థం కూడా ఉండవు. పేరు ప్రఖ్యాతులను ఆర్జించ డానికే ఉంటాయి. సేవ పేరుతో డబ్బు వెచ్చిస్తారు. కాని, అది సేవ కాదని, ఆర్జనకు పెట్టుబడి అని వారికి క్షుణ్ణంగా తెలుసు.

యజ్ఞ యాగాదులు చేయిస్తారు. యాగాలు నిర్వహించడంలో కూడా తమకు తామే సాటి అని చాటింపు వేయించు కుంటారు. 'నేను కాబట్టి అంత విశేషంగా యజ్ఞాన్ని నిర్వహించ గలిగాను ***(యక్ష్యే)***' అని గొప్పలు చెప్పుకుంటారు. పెట్టే ఖర్చు పదిలక్ష లైతే, వసూళ్ళు ఇరవై లక్షలు. ఊహ కందని వ్యాపారము!

యజ్ఞాలు చేస్తారు. యాగాలు చేస్తారు. సమారాధనలు, సప్తాహాలు; సప్త సప్తాహాలు - ఇలా ఎన్నని? ఎన్నిటికి అవకాశం ఉంటే అన్ని! సామూహిక పూజలు, పారాయణాలు, ఉత్సవాలు, ఊరేగింపులు, ఆరగింపులు, ఆనంద లీలలు - ఎన్నో, ఎన్నెన్నో! - ఇక సత్యనారాయణ వ్రతం ఉండనే ఉంది. అన్నీ వసూళ్ళే. వితరణలే విరబూస్తాయి. వసూళ్ళు దాక్కుంటాయి.

ఇవి కాకుండా, ప్రత్యేకంగా దానా లుంటాయి. 'నా చేతికి ఇచ్చుకోవడమే గాని పుచ్చుకోవడం తెలియదు. దానం చేయడ మంటే నాకు మహానందము. గుప్తంగా దానం చేయడం నా అభిమతం. నా సంతోషానికి ***(స్వాంతః సుఖాయ)*** దానాలు చేస్తాను. ఆనందిస్తాను ***(దాస్యామి : మోదిష్యే హర్షం చ అతిశయం ప్రాప్స్యామి)***. ఇదీ వరుస. చిత్తశుద్ధి కొరవైన వాళ్ళు, సత్త్వగుణానికి నోచుకోని వాళ్ళు చేసే యజ్ఞదానా లన్నీ ఇలాగే ఉంటాయి. వీటిని చెప్పుకొనే అవకాశం మళ్ళీ పదిహేడవ అధ్యాయంలో ఉంది.

యజ్ఞ యాగాదులు, వ్రత దానాదులు శ్రేష్ఠ మైనవి. వరిష్ఠ మైనవి. కాని, వాటి వెనుక మన అంతరంగ మెలా ఉందో, దానిని బట్టే సత్ఫలితా లైనా, దుష్ఫలితా లైనా, శూన్య ఫలితా లైనా! రావణాసురుడు వేదాధ్యయన తత్పరుడు. అద్భుతమైన యజ్ఞాలు నిర్వహించాడు. సత్త్వం లేని కారణంగా దుర్గతిని నివారించుకో లేక పోయాడు. అసుర సంపదను ఆశ్రయించిన వారి కార్యక్రమా లన్నీ అలాగే ఉంటాయి. కారణం, వారు అజ్ఞాన విమోహితులు ***(అజ్ఞాన విమోహితాః)***. అజ్ఞానం చేత మోహితులు కావడం వల్ల వీరు అనేక విధాలైన అవివేక మార్గాలలో చరిస్తూ ఉంటారు.

గోకుల పుణ్యభూమిలో గోపాలుని రమణులూ ఆశ్రయించారు, రాక్షసులూ ఆశ్రయించారు. గోవిందుని సన్నిధానంలో రమణులు తరించి పోయారు. రాక్షసులు అంతరించారు. ఏం చేద్దాం! చేసుకున్న వారికి చేసుకున్నంత!





***ఎత్తుకొనిన యువతుల పుణ్య మెంతో!***
***ఎత్తుకొని ఎగిరిన అసురుని పాప మెంతో!***
***గాలి రాక్షసుని కూల్చావు జాలి లేక***
***నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!***

అని చిన్నికృష్ణ శతకంలో ఒక వెన్నముద్ద.

*ఇలాంటి వారు పొందే గమ్య మేమిటో చెబుతున్నాడు.*

**అనేక చిత్త విభ్రాన్తా మోహజాల సమావృతాః ।**
**ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽ శుచౌ ॥** 16

***అనేక చిత్త విభ్రాంతాః-మోహజాల సమావృతాః***
***ప్రసక్తాః-కామభోగేషు-పతంతి-నరకే-అశుచౌ***

| | | | |
|---|---|---|---|
| అనేకచిత్త విభ్రాంతాః | = అనేకములైన మనోభ్రాంతులు కలవారై | అశుచౌ | = అశుద్ధమైన |
| మోహజాల సమావృతాః | = మోహ జాలముచే చుట్టబడ్డ వాళ్ళు | నరకే | = నరకము నందు |
| కామభోగేషు | = కామభోగముల యందు | పతంతి | = పడతారు |
| ప్రసక్తాః | = అధికాసక్తులై | | |

**అనేక విధాలైన ఆలోచనలతో భ్రాంతి చెందుతారు. మోహ జాలంలో చుట్టబడి ఉంటారు. కామ భోగాల యందే ఆసక్తి కలిగి ఉంటారు. అశుద్ధమైన నరకంలో పడతారు.**

### వ్యాఖ్య

మతులే గతుల్ని నిర్ణయిస్తాయి. బుద్ధిని బట్టే సిద్ధి. అసుర జనుల వ్యర్థమైన ఆలోచనల్ని, అనర్థ మైన ఆచారాలను ఎంతో విస్తారంగా చెప్పుకున్నాం. పూర్వ శ్లోకాలలో మనం చెప్పుకున్న అసుర లక్షణాలలో ఏ ఒక్కటి మనస్సును పట్టుకున్నా, మనిషి మనుగడ విషతుల్య మౌతుందని తెలిసి పోయింది. ఇక అన్నీ ఒక వ్యక్తి చిత్తంలో చేరిపోతే, ఆ తరువాత అతడే మౌతాడో! అలాంటి వారి గతి ఎలా ఉంటుందో! ఎలా ఉంటుంది? నరకం లాగే ఉంటుంది!

చేయ కూడని ఆలోచనలు చేసి మనస్సులను పాడు చేసుకున్న వారు ***(అనేక చిత్త విభ్రాన్తాః)***. మోహం అనే వలలో చిక్కిన వాళ్ళు ***(మోహ జాల సమావృతాః)*** కామభోగాల యందే ఆసక్తి కలిగి విషయాలను ఉపభోగించే వాళ్ళు ***(ప్రసక్తాః కామ భోగేషు)***, అశుద్ధ మైన, అపవిత్ర మైన నరకంలో పడి పోతారు ***(అశుచౌ నరకే పతన్తి)***.

అజ్ఞాన జనితమైన కల్పిత భావాలే మనిషిని సంసార చక్రానికి బంధిస్తాయి. మోహ జాలంలో తగుల్కొనేలా చేస్తాయి. మోహ మంటే ఏదో కాదు. విపరీత బుద్ధియే మోహము ***(విపరీత బుద్ధిః మోహః)***. అది కాని దాని యందు అది అనే భావన. తాను కాని దాని యందు తాను అనే భావన ***(అతస్మిన్ తద్బుద్ధిః ఇత్యర్థః)***. ఇదే మోహ జాలము. జాలము అంటే వల. కప్పేసే స్వభావం కలది. జ్ఞానమును అజ్ఞానము కప్పేస్తుంది. అందుచేతనే జనులు మోహితు లవుతున్నా రని గీత లోనే చెప్పుకున్నాం *( 5 వ అ - 15 వ శ్లో )*.

మోహంలో కూరుకు పోయిన వారు బంధంలో చిక్కు కుంటారు. ఆ బంధమే అజ్ఞానం. జ్ఞానము అజ్ఞానం చేత కప్ప బడుతుంది.

విపరీత జ్ఞానమే మోహము కనుక, ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు చూచే ప్రమాద స్థితి మోహం వల్ల ప్రాప్తిస్తుంది. తానెవరో తనకు తెలియక పోవడమే మోహానికి కారణము. తనకు తాను తెలియడం లేదు అంటే ఆత్మకు సంబంధించిన అజ్ఞానం ఉందని అర్థము. తానెవరో తనకు తెలియ నపుడు, తాను కాని దానిని తానని భ్రమించే ప్రమాదం లేక పోలేదు. అదే బంధము. అజ్ఞానం వల్ల ఏర్పడింది ***( అత్ర అనాత్మని అహ మితి మతిః అస్య పుంసః ఏషః బంధః ప్రాప్తః ).***

వలలో చిక్కిన చేప ఎలా బయట పడలేదో, అజ్ఞానము చేత మోహ జాలంలో చిక్కిన వారు కూడా బయట పడలేరు. మోహ ప్రభావం చేత విషయ భోగాల యందే మనస్సును లగ్నం చేసి ఉంటారు. కోరికల్ని తీర్చుకొనే ప్రయత్నం లోనే ఉంటారు. కోరికలను తీర్చుకో లేరు. అలాగని కోరికల నుండి విడిపడ లేరు. బ్రతుకంతా ఇలా భోగాసక్తి తోనే గడిపేస్తారు కాని, యోగాసక్తిని పొంద లేరు. అందుచేత, చేయ వలసిన కార్యాలను చేయకుండా, చేయ కూడని వాటిని చేస్తూ ప్రాప్తించిన దుష్ఫలితాలను అనుభవించ డానికి నరకాన్ని చేరుతారు.

*అసుర మానవులు ఆత్మ సంభావితులు కనుక అభివృద్ధికి నోచుకోరు. చదవండి.*

**ఆత్మసమ్భావితాః స్తబ్ధా ధన మాన మదాన్వితాః ।**
**యజన్తే నామ యజ్ఞై స్తే దమ్భే నావిధిపూర్వకమ్ ॥** 17

***ఆత్మసంభావితాః-స్తబ్ధాః-ధనమాన మదాన్వితాః***
***యజంతే-నామయజ్ఞైః-తే-దంభేన-అవిధిపూర్వకం***

| | | | |
|---|---|---|---|
| తే | = వారు | దంభేన | = దంభముతో |
| ఆత్మసంభావితాః | = ఆత్మస్తుతి గలవారు | నామయజ్ఞైః | = నామమాత్ర యజ్ఞముల చేత |
| స్తబ్ధాః | = వినయం లేని వారు | అవిధిపూర్వకం | = అశాస్త్రీయంగా |
| ధన మాన మదాన్వితాః | = ధనము కారణంగా మాన మదాన్వితులు | యజంతే | = యజ్ఞ మాచరిస్తారు |

**అర్జునా! అసుర జనులు ఆత్మస్తుతి కల వారు. ధనం ఉందని మదము, అభిమానంతో ఉంటారు. వారు చేసే యజ్ఞాలు పేరుకు మాత్రమే. అంతా దంభమే. అశాస్త్రీయమే.**

**వ్యాఖ్య**

ఆసురీ ప్రవృత్తి కల వారు ఆత్మసంభావితులు. తాము సర్వ సుగుణ సంపన్నుల మని తమను తామే స్తుతించుకొను వారు ఆత్మసంభావితులు. ఇదే ఆత్మస్తుతి. లేని గుణాలు ఉన్నట్లు తమను తాము పొగుడు కుంటూ ఉంటారు. కాని, సత్పురుషుల చేత గుర్తింపు లేని వారుగా ఉంటారు.

అన్నీ తమకే తెలుసని ఆత్మస్తుతి చేసుకుంటూ ఉంటారు. తెలిసిం దేమీ ఉండదు; తెలుసు అనే అహంకారము తప్ప. వారే ఆత్మ సంభావితులు. వారిని వేరొకరు పూజించ నవసరం లేదు. వాళ్ళను వాళ్ళే పూజించు కుంటారు. వాళ్ళే పీట వేసుకుంటారు. వాళ్ళే పూలు తెచ్చుకుంటారు. మంత్రము వారిదే, తంత్రము వారిదే. తీరా చూస్తే వీటన్నిటి వెనుక కుతంత్రమే ఉంటుంది.

వీరి ఆత్మపూజ ఏ స్థాయికి చేరుతుందంటే, పెద్దలను, గురువులను, పూజ్యులను గౌరవించాలన్నా, అభిమానం అడ్డొచ్చి ఇబ్బంది పడుతూ ఉంటారు. ఎవ్వరైనా చూస్తున్నారు అంటే దేవుడికి నమస్కరించాలన్నా





సంశయిస్తారు. అంతా తమకే తెలుసు అనే భ్రాంతిలో ఉంటారు కనుక, ఇతరుల నుండి జ్ఞానమును పొందే అవకాశానికి నోచుకోరు. విశిష్ట గుణాలు తమకే ఉన్నాయని భావించడం చేత గురువుల నుండి జ్ఞానమును పొందే ప్రయత్నం చేయరు. అలా మరొకరి నుండి జ్ఞాన సముపార్జనం చేయడం న్యూనతగా భావిస్తారు. వీరి అహంకార ప్రదర్శనలను చూచిన గురువులు కూడా వీరిని గుర్తించడానికి, వీరికి బోధించడానికి ఇష్ట పడరు ***(ఆత్మ సంభావితాః సర్వ గుణ విశిష్టతయా ఆత్మ నైవ సంభావితాః న సాధుభిః ).***

వీరు ఆత్మస్తుతియే ప్రధానంగా కలిగిన వారు కనుక అహంకారులై ఉంటారు. గర్విత మతులై ఉంటారు. అందుచేత వారు స్తబ్ధులు. స్తబ్ధులు అంటే వినయము లేని వారు. పెద్దల యెడ విధేయత లేని వారు ***(స్తబ్ధాః అప్రణతాత్మానః)*** అని అర్థం. జ్ఞానము వృద్ధి చెందే కొలది వినయం పెరుగుతూ ఉంటే, సత్త్వగుణము ఉచ్ఛస్థితిలో ఉందని అర్థము. జ్ఞానము లేకపోయినా, ఉన్నట్లు అనిపిస్తూ, అహంకారం పెరుగుతూ ఉంది అంటే, సత్త్వగుణము నీచ స్థితికి పడిపోయి, ఒక విధంగా శూన్య స్థితికి చేరి, రజ స్తమో గుణాలు ఉచ్ఛస్థితికి చేరాయని భావము. అసుర జనులు సత్త్వమునకు నోచుకోని కారణంగా ఆత్మసంభావితు లవుతారు. గర్వితులై అవినయంతో ప్రవర్తిస్తూ ఉంటారు. ఆచార విహీనులై ఉంటారు. ఎంత విశిష్టమైన విషయ మైనా, ఇతరులు చెబితే దానిని పట్టించుకోరు. అంతా తమకే తెలుసు అనే అభిప్రాయంలో ఉంటారు కనుక, ఎవరు చెప్పినా వినరు. చెవుడు లేని చెవిటి వాళ్ళు. అభిమాన బధిరాంధక శవాలు. ధనమాన మదాన్వితులు.

మానము అంటే అభిమానము, లేదా గర్వము. మదము అంటే మత్తత. ధనము కారణంగా ఏర్పడిన మానము, మదము గల వారు ధనమాన మదాన్వితులు ***( ధన నిమిత్తః మానః మదశ్చ తాభ్యాం ధనమాన మదాభ్యాం అన్వితాః ).*** వీరి జ్ఞానము యథార్థ జ్ఞానమై ఉంటే, వీరు తప్పక విద్యా వినయ సంపన్నులై ఉండే వారు. కాని, వీరిది మిథ్యాజ్ఞానం కావడం చేత, విద్యా వినయాలకు బదులుగా మానమదాలు చోటు చేసుకున్నాయి.

అభిమాన అహంకారాలు ప్రగతి నిరోధకాలు. ప్రగతి ప్రతిబంధకాలు. అసుర సంపద కల వారిలో ఇవి పూర్ణంగా ఉంటాయి. దైవీ సంపద నాశ్రయించిన కొందరిలో ఈ లక్షణాలు సంస్కార దోషం వల్ల అప్పుడప్పుడు అరుదుగా అగుపించినా, నిర్మూలించ డానికి అనుకూలంగా ఉంటాయి. కాని ఆసురీ సంపద కల వారిలో ఇవి దృఢంగా ఉండి, దుస్సాధ్యంగా, దుర్భేద్యంగా ఉంటాయి.

పూర్వం రాక్షసుల మీద దేవతలు విజయాన్ని సాధించి నపుడు దేవతలు గర్వితులై పరమేశ్వరుని కూడా విస్మరించారు. భగవంతుడు యక్షుని రూపంలో వారి ముందు ప్రత్యక్షమై, వారి గర్వాన్ని నిర్మూలించాడు. వారి లోని వైభవము వారిది కాదని, ఈశ్వర వైభవమే అన్న సత్యాన్ని వారికి సాక్షాత్కరింప చేశాడు. ఈ కథ కేనోపనిషత్తులో ఉంది.

వీరు యజ్ఞ యాగాదులు కూడా చేస్తారు ***( యక్ష్యే )*** అని పూర్వ శ్లోకంలో *(15 వ శ్లోకము)* చెప్ప బడింది కదా! మరి, మానమదాలతో విర్రవీగే వాళ్ళు సాత్త్వికులు ఆచరించే యజ్ఞ యాగాదులను ఎలా ఆచరిస్తున్నారు? అనే శంక ఏర్పడ వచ్చు. దానికి సమాధానం చెబుతున్నాడు. వారు చేసే యజ్ఞాలు పేరుకు మాత్రమే యజ్ఞాలు ***( నామ యజ్ఞైః నామ మాత్రైః యజ్ఞైః ).*** అవి కూడా దంభముతో నిర్వహింప బడుతాయి ***(దంభేన ).*** అవిధి పూర్వక యజ్ఞాలై ఉంటాయి. శాస్త్ర విహిత అంగాలు, విధానాలు లేని యజ్ఞాలను వీరు పేరు ప్రఖ్యాతుల కొరకు ఆచరిస్తారు ***( యజన్తే అవిధి పూర్వకమ్ ).***

*అందుచేత, వీరి పూజా పురస్కారా లన్నీ భగవంతుని దృష్టిలో తిరస్కారాలుగా గుర్తింపబడు తున్నాయి.*

**అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।**
**మామాత్మ పరదేహేషు ప్రద్విష న్తోఽ భ్యసూయకాః ॥** 18

*అహంకారం-బలం-దర్పం-కామం-క్రోధం-చ-సంశ్రితాః*
*మాం-ఆత్మ పరదేహేషు-ప్రద్విషంతః-అభ్యసూయకాః*

| | | | |
|---|---|---|---|
| అహంకారం | = అహంకారము | సంశ్రితాః | = ఆశ్రయించిన వారై |
| బలం | = బలము | ఆత్మ పరదేహేషు | = తమ యందు, ఇతరుల యందు |
| దర్పం | = గర్వము | మాం | = నన్ను |
| కామం | = కామము | అభ్యసూయకాః | = అసూయతో చూస్తారు |
| క్రోధం చ | = క్రోధము | ప్రద్విషంతః | = ద్వేషిస్తున్నారు |

**వారు అహంకారమును, బలమును, గర్వమును, కామమును, క్రోధమును ఆశ్రయించి ఉంటారు. వారి లోను, ఇతరుల లోను ఉన్న నన్ను అసూయతో చూస్తున్నారు. ద్వేషిస్తున్నారు.**

వ్యాఖ్య

ఆసురీ సంపదకు సంబంధించిన వారు అహంకారము, బలము, దర్పము, కామము, క్రోధములను ఆశ్రయించుకొని ఉంటారు.

మొదటిది *అహంకారం.* 'నేను - నేను' అనుకోవడమే అహంకారము *( అహం కరణమ్ అహంకారః ).* ఉన్న వాటిని, లేని వాటిని తన యందు ఆరోపించుకొని, ఈ ఆరోపిత గుణములతో కూడిన తనను, 'నేను - నేను' అని భావించడము ఏదైతే ఉందో అదే అహంకారము *(విద్యమానైః అవిద్యమానైః చ గుణైః ఆత్మని అధ్యారోపితైః విశిష్టమ్ ఆత్మానమ్ అహ మితి మన్యతే).* అదే అవిద్య. దుఃఖభూయిష్ట మైనది. సమస్త దోషాలకు, సర్వ అనర్థాలకు మూల మైనది. పూర్వ శ్లోకాలలో మనం చూచినట్లు తమలో లేని గుణాలను, లక్షణాలను తమలో ఉన్నట్లుగా భావించుకొని, వాటిని ప్రస్తుతించుకుంటూ, తాము గుణవంతుల మని భావించడం కూడా అహంకారమే. నేను ఉన్నత కుల ప్రసూతుణ్ణి. ధర్మరూపుణ్ణి. సర్వశాస్త్ర కోవిదుణ్ణి. ఉత్తమ మైన వాణ్ణి అని చింతించడము అహంకారము క్రిందికే వస్తుంది.

రెండవది *బలము.* ఇతరులను తిరస్కరించ డానికి, పరాభవించ డానికి కారణ మైనది బలము. కామముతో, రాగముతో కూడు కున్నది *( బలమ్ పర అభి భవ నిమిత్తం కామరాగాన్వితమ్ ).* పరులను అవమానించ డానికి కారణమైన దేహగత సామర్థ్యము బలము. ఇది అసుర జనము యొక్క లక్షణము. ఇదే బలము కామము లేని దైనపుడు, రాగ రహిత మైనపుడు, దైవ గుణముగా శోభిస్తుంది. ఆ స్థితిలో బలం భగవంతుని విభూతిగా ప్రశంసింప బడుతుంది. 'అర్జునా! బలవంతులలో కామరాగ వివర్జిత మైన బలము నేనే నని తెలుసుకో' అని గీతాచార్యుడు విజ్ఞానయోగంలో బోధించాడు *(7 వ అ - 11 వ శ్లో).*

మూడవది **దర్పము**. దేని కారణంగా ధర్మాన్ని తిరస్కరించడం, లేదా అతిక్రమించడం జరుగుతూ ఉందో, అట్టి అంతఃకరణ దోషమును దర్పము అంటారు *( దర్పః నామ యస్య ఉద్భవే ధర్మమ్ అతిక్రామతి సోఽ యం అంతఃకరణాశ్రయః దోష విశేషః ).* చిత్తము నందు ధర్మవిరుద్ధమైన దోష విశేషమే దర్పము. ధర్మదూరులై ప్రవర్తించడము, అధర్మాది కార్యాలను నిస్సంశయంగా ఆచరించడము, ధర్మమూర్తులైన మహాత్ముల ఉపదేశాలను తిరస్కరించడము, ప్రభు ధిక్కారము మొదలైన వన్నీ దర్పములే.





నాల్గవది **కామము**. ఇక్కడ కామం అంటే స్త్రీ సంబంధమైన విషయము నందు ఆసక్తి *(కామమ్ స్త్ర్యాది విషయం).* స్త్రీ సంబంధమైన భోగాసక్తి కామము. ఇట్టి విషయము నందు భోగాభిలాష కామము.

అయిదవది **క్రోధము.** ఇష్ట విషయాభిలాష కామ మైంది కనుక, అనిష్ట విషయ ద్వేషము క్రోధ మవుతుంది. *క్రోధం చ* అనెడి పదాలలో ఉన్న 'చ' కారము వల్ల లోభ, మోహ, మద, మాత్సర్యాది బుద్ధి దోషాలన్నీ అన్వయించ బడ్డాయి అని అర్థము. ఇన్ని దోషాలను ఆశ్రయించుకొని ఉన్న అసుర మానవులు తనను ద్వేషిస్తున్నారు అంటున్నాడు భగవంతుడు. భగవంతుని ద్వేషించడ మేమిటి? అయినా అసుర మానవులు పరమేశ్వరుని ఎలా ద్వేషిస్తారు?

ఏ పరమేశ్వరు ణ్ణైతే ఆసురీలు ద్వేషిస్తున్నారో, వారిలో ఉన్నది పరమేశ్వరుడే కదా! అంతే కాదు. తమలో ఏ పరమేశ్వర చైతన్యము ఉందో, ఇతరులలో కూడా అదే పరమేశ్వర చైతన్యము శోభిస్తూ ఉంది కదా! అసుర జనులు పరమేశ్వరుని ద్వేషిస్తున్నారు అంటే, తమ లోను, పరుల లోను దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న ఆత్మ చైతన్యాన్ని ద్వేషిస్తున్నా రని అర్థం *(మాం ఈశ్వరమ్ స్వదేహ పర దేహేషు ప్రద్విషన్తః).* అలా ద్వేషించడము అంటే, తమ దేహాలలో, ఇతరుల దేహాలలో ఉన్న బుద్ధులకు, బుద్ధి వృత్తులకు సాక్షిగా వెల్గొందుతున్న ఈశ్వరుణ్ణే ద్వేషిస్తున్నా రని అర్థం. అలాగే, పరమేశ్వరుడు, పరమేశ్వర జ్ఞానం భిన్నం కానందున, ఈశ్వర జ్ఞానాన్ని తిరస్కరించే వారు, అతిక్రమించే వారు ఈశ్వరుని తిరస్కరించిన వారే అవుతున్నారు. ఇదే భగవ ద్వేషము.

విశ్వంలో ఎటు చూచినా, ఎక్కడ చూచినా ధర్మాలే ఉన్నాయి. ఇదంతా నియతి. నియతి రూపంలో ఉన్నది నియంతే కనుక, ధర్మ రూపంలో ఉన్నది దైవమే. దైవము ధర్మ రూపంలో ఉండే టప్పుడు ధర్మాన్ని అతిక్రమించడము అంటే, ధర్మాన్ని ద్వేషించడమే. ధర్మం దైవం కన్నా వేరుగా లేనందున ధర్మాన్ని దూషించడ మంటే దైవాన్ని దూషించడమే. అంతే కాదు, ధర్మ మార్గాన చరించే వారిని పరాభవించడము అంటే, వారిలో చైతన్య రూపంలో ఉన్న పరమేశ్వరుని, వారు ఆచరించే ధర్మం రూపంలో ఉన్న దైవాన్ని పరాభవించినట్లే. ఈ విధంగా అహంకార, బల, దర్ప, కామ, క్రోధాదులను ఆశ్రయించిన అసుర మానవులు, తమ లోను, ఇతరుల లోను ఉన్న పరమేశ్వరుని ద్వేషిస్తున్నారు. పరమేశ్వరుని ద్వేషిస్తూ, పరమేశ్వరుని మార్గంలో పయనించే వారిపై అసూయ పడుతున్నారు *( తం కుర్వన్తః అభ్యసూయకాః సన్మార్గ స్థానాం గుణేషు అసహ మానాః).* పరమేశ్వరుని ద్వేషిస్తూ, ఈశ్వర భక్తులను అసహ్యించుకొనే ఈ అసుర మానవుల వికృత స్వభావాన్ని ఏడు, తొమ్మిది అధ్యాయాలలో పరమేశ్వరుడే ప్రబోధించాడు *(7 వ అ - 24 వ శ్లో; 9 వ అ - 11, 12 వ శ్లో).*

అహంకార అభిమానాది దుర్గుణాలకు అలవాటు పడిన ఈ అసుర సంజాతము, భక్తులతో చిత్ర విచిత్ర మైన వితండ వాదాలు చేస్తూ ఉంటారు. ఈశ్వరు డంటూ ఉంటే, 'ఆయన నా బుద్ధి వృత్తులకు సాక్షి' అని మీరు చెప్పేది వాస్తవమే అయితే, ఏదీ ప్రస్తుతం నా బుద్ధిలో ఏముందో చెప్ప మనండి. సరే, పోనీ లెండి. పాపం, పరమేశ్వరుడికి తీరిక లేదేమో! మరి, మీరు ఆయన భక్తజనం కదా! ఈశ్వర పరివారం కదా! ఆయన ఏమి చెప్పదలచు కున్నాడో, మీ ద్వారా అయినా చెప్ప మనండి అంటూ కుతర్కాలు చేస్తూ, భక్తులను అవహేళన చేస్తూ, భగవంతుని అవమానిస్తూ మాట్లాడుతూ ఉంటారు. ఇలాంటి వికృత స్వభావులకు సమాధానం వేదం విచిత్రంగా చెప్పింది.

*ఈశ్వరో యది సర్వస్య కారకః కారయాతమామ్ ।*
*అ ద్వేతి వాదినం బ్రూయాత్ సదాఽ ధో యాస్యసి ॥*

'సర్వుల చేత సమస్త కార్యాలు చేయించేది ఈశ్వరుడే అని మీరు చెబుతున్నారు కదా! అయితే, నా చేత ఇప్పుడు చేయించ మనండి, చూద్దాం!' అని వాదించే వితండవాదికి, 'అయ్యా! తమరు ఇలాగే ఉంటే, తమరికి సదా అధోగతే నని ఈశ్వరుడు నీకు చెప్ప మని మాకు చెబుతున్నాడు', అని చమత్కరిస్తూ సమాధాన మిచ్చింది సామవేదము లోని యాస్కశ్రుతి.

ఆసురీ సంపదకు సంబంధించిన మానవుల అసుర లక్షణాలను ఏడవ శ్లోకం నుండి ప్రవాహ రూపంలో వరుసగా పన్నెండు శ్లోకాలలో ప్రసంగించిన భగవానుడు, వాటిని ఇక్కడ, ఈ పద్దెనిమిదవ శ్లోకం వద్ద సమాప్తి చేస్తున్నాడు.

*ఈ విధమైన రాక్షస ప్రవృత్తితో జీవించిన అసుర మానవుల జీవితాల పరిణామా లెలా ఉంటాయి? ఫలితా లెలా ఉంటాయి? వివరిస్తున్నాడు.*

**తా నహం ద్విషతః క్రూరా న్సంసారేషు నరాధమాన్ ।**
**క్షిపా మ్యజస్ర మశుభా నాసురీ ష్వేవ యోనిషు ॥** 19

***తాన్-అహం-ద్విషతః-క్రూరాన్-సంసారేషు-నరాధమాన్***
***క్షిపామి-అజస్రం-అశుభాన్-ఆసురీషు-ఏవ-యోనిషు***

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహం | = | నేను | ఆసురీషు | = | అసుర ప్రవృత్తికి సంబంధించిన |
| ద్విషతః | = | ద్వేషించు వారు | సంసారేషు | = | సంసారమున |
| క్రూరాన్ | = | క్రూరులు | అజస్రం | = | సదా |
| అశుభాన్ | = | అశుభులు | యోనిషు ఏవ | = | యోనుల యందు |
| తాన్ | = | ఆ | క్షిపామి | = | ఉంచు తున్నాను |
| నరాధమాన్ | = | నరాధములను | | | |

**అర్జునా! అసుర మానవులు ద్వేషించే స్వభావం గల నరాధములు. క్రూర స్వభావులు. పాప కార్యాలు చేస్తారు. వీళ్ళను సంసారాలలో నీచ జన్మల లోకి నెట్టేస్తాను.**

**వ్యాఖ్య**

ప్రాణులలో నిరంతరము కర్మలు నడుస్తూ ఉన్నాయి. ప్రపంచమే ఒక కర్మ సముద్రంగా కనిపిస్తూ ఉంది. సముద్రంలో కనిపించే వన్నీ అలలే. ప్రపంచం లోని ప్రాణులలో గోచరించే వన్నీ కర్మలే. చేతలే.

ఎవరి చేతలు వారివి. ఈ విషయంలో మానవులే కాదు, పశుపక్ష్యాది జంతుజాలము కూడా ఉంది. వాటిలో కూడా కర్మలు సాగుతున్నాయి. జంతువులకు చేతులు లేవు; అయినా చేతలు ఉన్నాయి. చిత్తము లేదు; అయినా సహజాతంగా చేతలు సాగి పోతున్నాయి. అందుచేత వాటికి పుణ్యపాపాలు లేవు. పాలు ఇచ్చిన ఆవుకు పుణ్యం రాదు. తన్నిన ఆవుకు పాపము అంటదు. చిత్తము లేని చేతలకు విలువలు నిర్ణయించ లేము.

మానవుల పరిస్థితి వేరు. ఈశ్వరుడు మనుషులకు చేతు లిచ్చాడు. వాటిని ఎలా వినియోగించు కోవాలో నిర్ణయించు కొనేందుకు చిత్తమును కూడా ఇచ్చాడు. చిత్తముతో చింతించి, చేతులతో ఆచరించు అనేది బహుశ ఆ దివ్యాత్ముని సంకల్ప మేమో! ముఖ్యంగా రెండే విషయాల కొరకు మనిషికి చేతు లున్నాయి.

చెయ్యా లనుకున్నది చేతులతో చేసుకో. చేసిన కర్మల ఫలాలను చేతులతో అందుకో. కర్మలు





చేసేందుకు, చేసిన కర్మల ఫలాలను అందుకునేందుకు మనిషికి పరమేశ్వరుడు చేతు లిచ్చాడు. చేసుకున్న వారికి చేసుకున్నంత అనే నియతిని తానే నియమించాడు. నియంతగా, ఫలప్రదాతగా తానే నియతిలో నిండి ఉన్నాడు.

ఎవరు ఏ కర్మ నాచరిస్తే దాని ఫలితాన్ని వారు పొందుతారు. కర్మ అనే కారణం ఉన్నప్పుడు, ఫలం అనే కార్యాన్ని ఎవ్వరూ ఆప లేరు. కార్యకారణాలు అలాగే ఉంటాయి. కర్మల ఫలితాలే జన్మలలో తొంగి చూస్తాయి. కర్మ కారణంగా జన్మఫలం కార్య రూపాన్ని దాల్చుతూ ఉంది.

***కపూయ చరణా అభ్యాశోహ యత్తే కపూయాం యోని మాపద్యేరన్*** - అన్నది వేదం. నిందిత కర్మలు, అంటే గర్హనీయ మైన దుష్టకర్మలు చేసే వారు ***( కపూయ చరణాః )*** శీఘ్రము గానే ***( అభ్యాశోహ )*** నీచమైన యోనుల యందు ***( కపూయాం యోనిం )*** పుడుతారు; లేదా నీచ యోనులను పొందుతారు ***( ఆపద్యేరన్ ).***

ఎవరు ఏ కర్మలు ఆచరిస్తే, ఆ కర్మల ఫలితాలను అనుభవించ డానికి అనుకూలమైన ప్రదేశాలను అందించే యోనుల యందు వారు పుడుతారు. ఇది ధర్మము. ఇది నియతి. నియతి రూపంలో నియంత యొక్క జ్ఞానమే శోభిస్తూ ఉన్నందున, ఫలితాలు ఆ విధంగా అందుతూ ఉన్నాయి. సత్కర్మ లాచరించి నందుకు ఫలితంగా సద్గతి ప్రాప్తిస్తూ ఉంటే, దుష్కర్మ లాచరించి నందుకు ఫలితంగా దుర్గతి ప్రాప్తిస్తూ ఉంది. ***పుణ్యో వై పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన*** - పుణ్యకర్మ చేత పుణ్యాత్మ డవుతాడు. పాపకర్మ చేత పాపాత్మ డవుతాడు అని బృహదారణ్యక శ్రుతి *(3 - 2 - 17)*. ఈ విషయంలో ఉన్న దంతా ధర్మమే. నిష్పాక్షిక మైన ధర్మమే. ఇందులో భగవంతుని పాత్ర ఏముంది, ధర్మానికి శోభ నివ్వడము తప్ప! జీవులకు ప్రాప్తించే కర్మఫల భేదాలకు కారణాలు జీవులకు సంబంధించే ఉన్నాయి. ఈ గుణ దోషాలు పరమేశ్వరునికి ఎలా అంట కడతారు? ధర్మ వ్యవహారాన్ని, నియతి నిర్ణయాలను సాక్షిగా వీక్షించే భగవంతునికి పక్షపాతాన్ని, రాగద్వేషాలను ఎలా ఆపాదిస్తాము? అందుకే ఈ విషయంలో న్యాయ ప్రస్థానమైన బ్రహ్మసూత్రాలు తిరుగు లేని తీర్పు నిచ్చాయి.

సూ॥ **వైషమ్య నైర్ఘృణ్యేన సాపేక్షత్వా త్తథాహి దర్శయతి।** *(2 - 1 - 34)*

పక్షపాతము, అతి క్రూరత్వం, లేదా జాలి లేక పోవడము ***( వైషమ్య నైర్ఘృణ్యే )*** అనేవి పరమేశ్వరునిలో లేవు ***( న )***. కారణం, సృష్టింపబడే జీవుల కర్మల ననుసరించి, కర్మఫలంగా జీవులను సృష్టించడం వలన ***(సాపేక్షత్వాత్ )***.

జీవుల కర్మఫలంగా జన్మలు ప్రాప్తించే టప్పుడు పరమేశ్వరునికి రాగద్వేషాలను, వైషమ్య నైర్ఘృణ్యాలను ఎలా ఆపాదిస్తాము? కనుక, అవి ఈశ్వరుని విషయంలో ప్రసక్తాలు కావు ***( వైషమ్య నైర్ఘృణ్యే న ఈశ్వరస్య ప్రసజ్యేత్)***. సరే. జీవుల కర్మానుసారం జన్మలను ప్రసాదిస్తున్నాడు కనుక పరమేశ్వరునికి వైషమ్య నైర్ఘృణ్యాలు లేవని ఒప్పుకుందాం. మరి, సృష్టి విషయంలో దేనిని అపేక్షించి పరమేశ్వరుడు సృష్టి చేస్తున్నాడు అనే శంక రావచ్చు. దానికి కూడా సమాధానం వినండి.

ఏదో ఒక దానిని అపేక్షించే కదా పరమేశ్వరుడు జగత్తును సృష్టించడం జరిగింది! మరి దేనిని ఆశించి, లేదా అపేక్షించి సృష్టిని నిర్మించాడు? ***కిం అపేక్షత ఇతి చేత్*** - దేనిని ఆశించి సృష్టించాడు అని ప్రశ్నిస్తే ***ధర్మాధర్మ వపేక్షత ఇతి వదామః*** - ధర్మాధర్మాలను అపేక్షిస్తున్నాడు అని చెబుతున్నాం. అలా ధర్మాధర్మాలను ఆశించడము రాగద్వేషాల క్రిందికి వస్తుందా? రాదు. కనుక, ధర్మాధర్మాలను అపేక్షించి సృష్టి నిర్వాకాన్ని సాగిస్తున్న పరమేశ్వరుడు ***( సాపేక్షత్వాత్ )***. జీవులు ఆచరించిన కర్మలకు అనుగుణమైన ఫలితాలను

అందించేందుకు జన్మలను అనుగ్రహిస్తున్నాడు ***( సాపేక్షత్వాత్ ).*** అందుచేత, జీవులకు కర్మఫలాలను ప్రసాదించే విషయంలో పరమేశ్వరునికి రాగద్వేషాది దోషాలు అంటగట్టడం అసంభవం.

కనుక, సృష్టింప బడిన జీవుల ధర్మాచరణమును, కర్మాచరణమును బట్టి సృష్టిలో వైషమ్యాలు గోచరిస్తున్నాయే గాని అది పరమేశ్వరుని అపరాధము కాదు; దోషము కానే కాదు ***( అతః సృజ్యమాన ప్రాణి ధర్మాధర్మాపేక్షయా విషమా సృష్టి రితి న అయం ఈశ్వరస్య అపరాధః ).***

ధాన్యం మొలకెత్తడానికి మేఘం కారణంగా కనిపిస్తూ ఉంది. వరి, గోధుమ, యవలు, జొన్నలు మొదలైన ధాన్యాలు మొలకెత్త డానికి మేఘం సాధారణ కారణంగా కనిపిస్తూ ఉంది. కాని ధాన్యాల లోను, ధాన్యాల లోని గుణాల లోను భేదాలు గోచరించ డానికి ధాన్యాల లోని అసాధారణ శక్తులే కారణం గాని మేఘం కారణం కాదు. ఏయే ధాన్యాలలో ఏయే గుణాలు ఉన్నవో, వాటిని నిర్ణయించేది మేఘం కాదు గదా? అలాగే, ఈశ్వరుడు కూడా జీవుల కర్మఫలాల విషయంలో సాధారణ కారణంగా తెలుస్తూ ఉన్నా, జీవుల లోని వైషమ్యాలకు, జన్మల లోని తారతమ్యాలకు జీవుల అసాధారణ కర్మలే కారణం గాని ఈశ్వరుడు కాదు. కనుక, ఈశ్వరుణ్ణి ధాన్యం విషయంలో మేఘం లాగా అర్థం చేసుకోవాలి ***( ఈశ్వరస్తు పర్జన్య ఇవ ద్రష్టవ్యః ).***

### స్వయంకృత అపరాధాలు

అసుర జీవనానికి అలవాటు పడిన దురదృష్టవంతులు సన్మార్గానికి దూరమైన వాళ్ళు. సాధు ద్వేషులు. దైవ ద్వేషులు. సాధువులను ద్వేషించి, దైవమును దూషించి బ్రతుకును చీకటిమయం చేసుకున్న వాళ్ళు ***(సన్మార్గ ప్రతిపక్ష భూతాన్ సాధు ద్వేషిణః ద్విషతః చ మాం ఈశ్వరం ).***

అసుర మానవులను నరాధములుగా అభివర్ణిస్తున్నాడు. ఉత్తమ మైన మానవ జన్మను పొంది నరోత్తములుగా శోభించ వలసిన వాళ్ళు, నారాయణ స్వరూపులుగా భాసించ వలసిన వాళ్ళు, నరాధములై నరక నివాస యోగ్యు లయ్యారు. ఎందుకని, నరులు నరాధము లయ్యారు? అధర్మ దోషం చేత నరాధము లయ్యారు ***(అధర్మ దోష వత్త్వాత్ ).*** అధర్మ ప్రవర్తనములో రాటు దేలి క్రూరాత్ము లయ్యారు. దారుణ పాపకృత్యాలకు ఒడిగట్టే దుష్టు లయ్యారు ***( క్రూరాన్ ).*** పురుషోత్తము లయ్యే పవిత్ర మార్గాన్ని నిరసించి, అపవిత్ర మైన, క్రూరమైన, అధర్మ మార్గాలలో చరించి పురుషాధము లయ్యారు. అధములు ఏం చేస్తారు? ఏ కర్మ లాచరిస్తారు? అధము లెవరైనా అశుభం వైపే మొగ్గు చూపుతారు. అశుభ కర్మలనే ఆచరిస్తారు ***( అశుభ కర్మ కారిణః ).*** ఇలాంటి పాప కార్యా లాచరించే క్రూరాత్ములను, నరాధములను, అసూయా ద్వేషాలతో సాధుహింసకు, దైవ దూషణానికి పాల్పడే దురాత్ములను, జనన మరణ రూప సంసారములో నీచ యోనుల యందు పడేస్తాను అంటున్నాడు భగవంతుడు.

భావాన్ని బట్టే బ్రతుకు ***( యద్భావం తద్భవతి ).*** ఈ జన్మలో ఎవరు ఎలా ప్రవర్తిస్తారో, ఆ కర్మలకు అనుగుణమైన ఫలాలను పొందే ప్రదేశాల లోనే వాళ్ళు జన్మిస్తారు. నేటి ఆలోచనలే రేపటి ఆకృతులకు ప్రాణం పోస్తాయి. దుష్టులకు ప్రాప్తించేవి దుష్టజన్మలే కదా! నీచ కార్యాలను ఆచరించి నందుకు ఫలితంగా వచ్చేవి నీచ జన్మలే కదా! భగవంతుడు అదే చెబుతున్నాడు.

శునక సూకరాదుల లాగా అపవిత్ర జీవనం గడిపిన వాళ్ళకు మానవజన్మ యొక్క అవసరం ఏముంటుంది? అందుచేత, శునక సూకరాది జన్మల లోనే జన్మించి మిగిలిన అపవిత్ర జీవనాన్ని కొనసాగిస్తారు. సర్ప వ్యాఘ్రా దుల వలె విషపూరితంగా, క్రూరంగా జీవించిన వాళ్ళు, తరువాత జన్మలలో సర్ప వ్యాఘ్రాదుల యోనుల లోనే జన్మిస్తారు.





విచారించి అర్థం చేసుకుంటే, ఇక్కడ భగవంతుడు ఇచ్చిం దేముంది? వాళ్ళే పుచ్చుకున్నారు. నేరం చేసిన వాళ్ళు ఎలాగైతే శిక్షను అనుభవిస్తారో, అలాగే కర్మలను ఆచరించిన వారు తదనుగుణ మైన ఫలాలను పొందుతారు. చేసిన నేరానికి చట్టబద్ధ మైన శిక్షను ఖైది అనుభవించే టప్పుడు, న్యాయాధిపతి శిక్షించిం దేముంది? శిక్షింపబడ వలసిన వాడే శిక్షింపబడు తున్నాడు. కాకపోతే, పరిమితమైన చట్టాలు, పరిమితమైన జ్ఞానం కలిగిన న్యాయాధిపతి విధించే శిక్ష, కొన్ని సమయాలలో దారి తప్పే ప్రమాదం ఉంది. కాని, సర్వజ్ఞుడు అయిన పరమేశ్వరుడు గాని, ఆయన అమలు పరచే ధర్మం గాని అలా పరిమితాలు కానందున జీవులకు అందే ఫలాలలో అంతరాలు చోటు చేసుకొనే అవకాశమే లేదు. ఈ సత్యాన్ని స్థిర పరుస్తూ, ***అజస్రమ్*** అనే పదాన్ని ప్రయోగించడం జరిగింది. ***అజస్రమ్*** అంటే 'సంతతం' అని అర్థము. పాపకర్మలు చేసే వారిని ఎల్లప్పుడూ పాపయోనుల లోనే పడేస్తాను అని భగవంతుడు అంటున్నాడు. అంటే, ఎంత కాలం పాపం చేస్తారో అంత కాలం వాళ్ళను పాప యోనుల లోనే ఉంచుతాను అని అర్థము. కర్మను బట్టే కర్మఫలము. ఈ విధంగా జీవుల నీచోన్నత ప్రస్థానాలకు పరమేశ్వరుడు కారణంగా తెలుస్తూ ఉన్నాడు.

***ఏష ఉహ్యేవ సాధుకర్మ కారయతి తం య మున్నినీషతే,***
***ఏష ఉ ఏవ అసాధు కర్మ కారయతి య మధో నినీషతే ॥***

'పరమేశ్వరుని అనుగ్రహ ప్రసాదమును పొంది ఉన్నతంగా చరింప గోరే వారు సాధు కర్మము ఆచరిస్తున్నారు. ప్రసాద కారణానికి నోచుకోని వారు అధోగతిని పొందగోరి అసాధు కర్మము నాచరిస్తున్నారు' అని వేదమాత ప్రబోధము.

*ఈ విధంగా నీచ జన్మలలో పడిన అసురులు ఆ తరువాత ఏమవుతారు? చెబుతున్నాడు.*

ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని ।
మా మప్రాప్యైవ కౌన్తేయ తతో యా న్త్యధమాం గతిమ్ ॥ 20

***ఆసురీం-యోనిం-ఆపన్నాః-మూఢాః-జన్మని-జన్మని***
***మాం-అప్రాప్య-ఏవ-కౌంతేయ-తతః-యాంతి-అధమాం-గతిం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ | = | అర్జునా! | మాం | = | నన్ను |
| ఆసురీం | = | రాక్షస సంబంధమైన | అప్రాప్య ఏవ | = | పొందకనే |
| యోనిం | = | జన్మము | తతః | = | అంత కంటె |
| ఆపన్నాః | = | పొందిన | అధమాం | = | నీచమైన |
| మూఢాః | = | మూఢులు | గతిం | = | గతిని |
| జన్మని జన్మని | = | ప్రతి జన్మ మందు | యాంతి | = | పొందుతారు |

**అర్జునా! అసుర జన్మమును పొందిన ఈ మూఢులు, ప్రతి జన్మము నందు నన్ను పొందరు సరి కదా, అంత కంటే నీచమైన జన్మల లోకి జారిపోతూ ఉంటారు.**

#### వ్యాఖ్య

అసుర మానవులు పాపాల పుట్టలు. దోషాల కట్టలు. మోసాల గుట్టలు. మోహాల బుట్టలు. చేసిన పాపాలే చేయడంలో దిట్టలు. చేసిన పాపాలు, పాప ఫలితాలు మనిషిని ప్రశాంతంగా ఉండ నివ్వవు. చేసిన పాపాలనే పునః పునః చేయిస్తూ ఉంటాయి. రకరకా లైన పాపాలు చేస్తూ ఉంటే రకరకా లైన పాప ఫలితాలు అందుతూ

ఉంటాయి. ఇలా జననమరణాల సుడిలో పడి భేదరూప కర్మఫలాలను అనుభవించడమే సంసారము (**యద్వా సంస్రియన్తే భుజ్యన్త ఇతి సంసారః**).

ప్రతి జన్మ లోను తమోగుణ ప్రధాను లైన ఈ అసురులు మోహ సాగరంలో పడుతూనే ఉంటారు. వీరిని ప్రస్తుత శ్లోకంలో **మూఢాః**, అంటే అవివేకులు అన్నాడు. అంటే వివేకము లేని వారు (**అవివేకినః**) అని అర్థం. ఏది చెయ్యాలి, ఏది చేయ కూడదు? అనే వివేకము లోపించిన వారు అవివేకులు. వివేకము లేక పోవడం వల్ల ఉన్నతంగా చరించే అవకాశము లేక పోవడము చేత; పూర్వ పాప కార్యాల ఫలంగా ప్రాప్తించిన వాసనల యొక్క ప్రేరణ చేత చేసిన పాపా లనే పునః పునః చేయడము చేత; తమోగుణ ప్రధానులై ఉండటం వల్ల పరమాత్మ కొరకు ప్రయత్నించే అవకాశమే లేక పోవడం చేత (**మాం అప్రాప్య**): ఈ మూడు కారణాల చేత ప్రతి జన్మ యందు (**జన్మని జన్మని**) అధోగతిని పొందుతూ (**అధః గచ్ఛన్తః**) నికృష్ట జన్మల నుండి నికృష్టతర జన్మలకు, నికృష్టతర జన్మల నుండి నికృష్టతమ మైన జన్మలకు మెల్ల మెల్లగా, పై మెట్టు నుండి జారిన రబ్బరు బంతి లాగా, దిగజారి పతనమై పోతారు. వివేకం లేనందున జీవన విధానంలో మార్పును ఆశించ లేరు. మార్పు లేనందున ప్రగతి సాధ్యం కాదు.

**శ్లో॥ *అదత్త దోషేణ భవే ద్దరిద్రం దరిద్ర దోషేణ కరోతి పాపమ్,***
***పాప దవశ్యం నరకం ప్రయాతి పునర్దరిద్రీ పున రేవ పాపీ॥***

పాప యోను లందు పడిన ఈ దురాచారు లైన దుష్టులు, సుడిగుండంలో పడిన క్రిముల లాగా పరిభ్రమిస్తారే గాని బయట పడి తరించే ప్రయత్నం చేయలేరు అంటూ, వారి సమగ్ర చరిత్రను ఈ ఒక్క శ్లోకంలో శాస్త్రం సంక్షిప్తం చేసింది.

సత్కార్యము చేసే సదవకాశం లోపించిన దోషం చేత భౌతికం గాను, భావం లోను దారిద్ర్యం ప్రాప్తిస్తుంది. దరిద్ర దోషం చేత మనిషి పాపాచరణంలో కూరుకు పోతాడు. పాపాలు చేయడం వల్ల తప్పక నరకాన్ని పొందుతాడు. నరకానుభవం తరువాత తిరిగి దరిద్రుడుగా జన్మిస్తాడు. తిరిగి పాపాచరణం ప్రారంభిస్తాడు. ఇది వలయం. విషవలయం. సంసార విషవలయం. ఆసురీ సంపద నాశ్రయించిన వారి సంసార చక్ర భ్రమణం.

*మరి దీనికి తరుణోపాయం ఉందా, లేదా? ఉంటే, అదేమిటి? చెబుతున్నాడు.*

**త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః।**
**కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేత త్త్రయం త్యజేత్॥** **21**

***త్రివిధం-నరకస్య-ఇదం-ద్వారం-నాశనం-ఆత్మనః***
***కామః-క్రోధః-తథా-లోభః-తస్మాత్-ఏతత్-త్రయం-త్యజేత్***

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆత్మనః | = | తనకు | క్రోధః | = | క్రోధము |
| నాశనం | = | వినాశ మైనది | తథా | = | అటులనే |
| నరకస్య | = | నరకమునకు | లోభః | = | లోభము |
| ద్వారం | = | ద్వార మైనది | తస్మాత్ | = | అందువలన |
| ఇదం | = | ఇది | ఏతత్ | = | ఈ |
| త్రివిధం | = | మూడు విధములు | త్రయం | = | మూడింటిని |
| కామః | = | కామము | త్యజేత్ | = | విడిచి పెట్టాలి |





**అర్జునా! కామము, క్రోధము, లోభము అనేవి నరకానికి మూడు ద్వారాలు. వినాశాన్ని కలిగించే వీటిని తప్పక త్యజించాలి.**

**వ్యాఖ్య**

అసుర సంపద అనంతంగా కనిపిస్తూ ఉంది. ఇన్ని అసుర లక్షణాలను జయించేది ఎలా? అనంత శాఖలుగా విస్తరించినట్లు అసుర గుణాలు చెప్ప బడ్డాయి. మానవుని ఆయుర్దాయ మేమో అతి స్వల్పము. పైగా అనిశ్చితము. అలాంటప్పుడు ఈ అనంత సంపదను పరిహరించడం సాధ్యమా? అనే శంక ఎవరి కైనా కలుగు తుంది. దానికి పరిష్కారంగా ఆ సముదయ రూపాన్ని సంక్షేపం చేసి సముచితార్థాన్ని ఈ శ్లోకంలో అందిస్తున్నాడు (***సర్వస్యాః ఆసుర్యాః సంపదః సంక్షేపః అయమ్ ఉచ్యతే***). సమస్త అసుర లక్షణా లన్నీ ఈ మూడిటిలో అంతర్గతాలు అంటూ కామక్రోధ లోభాలను సముదితార్థంగా చెబుతున్నాడు.

అసుర సంపదకు సంబంధించిన వాళ్ళు నరకంలో ప్రవేశిస్తారు అని పూర్వ శ్లోకంలో చెప్పుకున్నాం. నరక సౌధంలో ప్రవేశించ డానికి మూడు ద్వారా లున్నాయి. అవే కామ, క్రోధ, లోభములు. అవి ఆత్మ నాశకాలు (***త్రివిధం త్రిప్రకారం నరకస్య ప్రాప్తౌ ఇదం ద్వారం, నాశనమ్ ఆత్మనః***).

ఈ మూడు ద్వారాలు నరకం లోకి అనుమతిస్తాయి. ప్రవేశాన్ని కల్పిస్తాయి. మూడూ వినాశ హేతువులే. వీటిలో పాదం మోపితే బ్రతుకు పాడైనట్లే. ఏ ద్వారంలో కాలు పెట్టినా నరకాగ్నిలో పడి బూడిద కావలసిందే. దుఃఖానుభవాన్ని పొంద వలసిందే. బ్రతుకు బాధల నిలయం కావలసిందే. జీవితము ఇలా నశిస్తూ ఉంది కనుకనే ఆత్మనాశము అంటున్నాడు భగవంతుడు (***యత్ ద్వారం ప్రవిశన్నేవ నశ్యతి ఆత్మా***).

రజోగుణము నుండి పుట్టిన కామక్రోధాలు మనిషికి ప్రబల శత్రువు లని మూడవ అధ్యాయం కర్మ యోగం లోనే భగవంతుడు హెచ్చరించాడు (*3 వ అ - 37 వ శ్లో*). అసుర మానవులు కామక్రోధాలను ఆశ్రయించుకొని ఉంటారు కనుక, వారు కామక్రోధ పరాయణు లని ప్రస్తుత అధ్యాయం లోనే జ్ఞాపకం చేశాడు (*16 వ అ - 12 వ శ్లో*). కాకపోతే, ఇక్కడ కామక్రోధాలకు లోభాన్ని జత చేశాడు. అంతే. ఆ రెండు ఉంటే మూడవది ఉండి తీరుతుంది. అందుకే అక్కడ ప్రత్యేకించి చెప్ప లేదు. ఉగ్రవాదులు రహస్య స్థావరాలను ఏర్పరచుకొని భయంకరమైన దాడులను ఎలా నిర్వహిస్తారో, అలాగే ఉగ్ర కర్మలను పురికొల్పే కామ క్రోధాలు కూడా మనస్సుపై ఆగంతుక దాడులను నిర్వహించి ఆత్మహానిని కలిగిస్తాయి.

అనంతంగా గోచరిస్తున్న అసుర లక్షణాలను సంక్షేపించి కామక్రోధ లోభాలుగా చెబుతున్నాడు.

**కామక్రోధ లోభాలు**

కామక్రోధ లోభాలు మూడూ నరక ద్వారాలు. ఈ మూడు ద్వారాలలో క్రోధం మధ్య ద్వారంగా ఉంది అనేది గమనించ దగిన విషయం. ఇది దేహళీ దీప న్యాయ పరిధిలో ఉంది. క్రోధం ఇటు కామానికి తోడై ఉంటుంది. అటు లోభానికి తోడై ఉంటుంది. అందుకనే, అనుకూలంగా మధ్యలో చేరి పోయింది.

నాకు అది కావాలి అనే ఇచ్ఛ కామం. కామం విజృంభించి నపుడు మనిషికి రెండవ ఆలోచన ఉండదు. కళ్ళున్నా మనిషి గ్రుడ్డి వాడు అయ్యేది కామం ఆవరించి నపుడే. కామ వాంఛ తీరనపుడు, అలా తీరక పోవడానికి ప్రతిబంధకాలను సృష్టించిన వారిపై కలిగేది ఏదో అదే క్రోధము.

కామం ద్వారా సాధించింది ఏదైనా ఇష్టపడి సాధించు కున్నదే. కనుక దానిని వదులు కోవడానికి మనస్సు అంగీకరించదు. ఒకవేళ ఏ కారణం చేత నైనా అది బలవంతంగా దూరం చేయ బడుతూ ఉంటే, దానికి కారణమైన వారిపై క్రోధం తీవ్ర రూపాన్ని దాల్చుతుంది.

అది నాకు కావాలి అనే ఇచ్ఛ కామం. అలా ఆశించింది రాకపోతే కలిగేది క్రోధం. ఒకవేళ ఆశించింది వస్తే అది నాకే ఉండాలి. నా నుండి దూరం కాకూడదు అనేది లోభం. అలా నాకే ఉండాలి అనుకున్నది పోయినా, లేదా పోతూ ఉన్నా కలిగేది క్రోధం. కామలోభాలు అసంతృప్తికి లోనై నపుడు వాటిని ఉపశమింప చేసే కార్యక్రమంలో ఉద్యమించేది క్రోధం. అగ్ని స్వరూపము. నిప్పు లేకుండానే తగల బెడుతుంది.

ఈ మూడిటిని విశ్లేషించి, విచారించి అర్థం చెప్పుకుంటే, మళ్ళీ వీటిని సంక్షిప్తం చేసి ఒక్కటి చెయ్యొచ్చు. అదే కామము. క్రోధ లోభాలు రెండూ కామాన్నే ఆశ్రయించి ఉంటాయి. కామాన్ని నిగ్రహిస్తే క్రోధం పడగ విప్పదు. లోభం కాటు వేయదు. కామించింది వికటిస్తేనే కదా క్రోధం వికృత రూపాన్ని దాల్చేది! కామం కుప్ప పోస్తేనే కదా లోభం కాపలా కాసేది! కనుక, కామం ఒక్కటి ఉద్యోగాన్ని విరమిస్తే చాలు, క్రోధం ఉద్యమాన్ని విరమిస్తుంది. లోభం ఉదాసీనంగా పడి ఉంటుంది. కనుక కామ జయమే ప్రధానము. దీనిని ఒక్క దానిని జయిస్తే మూడిటిని జయించిన వాళ్ళే అవుతారు.

**కామ జయము**

కామాన్ని జయించడం అనుకున్నంత సులభ సాధ్యం కాదు. దానిని తీసి దూరంగా పడేయడానికి అది మన కన్నా వేరుగా లేదు. అదే మనం అన్నంతగా పెనవేసుకొని ఉంది. పరిశీలించి చూస్తే, మనస్సులో అదొక్కటే ఉంది. ఎలా ఉంది అంటే, మనస్సు రూపం లోనే ఉంది. మనస్సుతో మనస్సును లేకుండా చేసుకో గలమా? కామం కూడా అంతే. మనస్సే కామంగా, కామమే మనస్సుగా మారి పోయిన దశలో కామాన్ని మనస్సు జయించడం అనే దానిని ఎలా ఊహించ గలం? మరి, కామాన్ని జయించ లేనపుడు, కామ పూరితమైన చిత్తము పరమాత్మ వైపుకు ఎలా సాగుతుంది?

**శ్లో॥** *యజ్జీవతో నైవ మనోరథానా మన్తోఽస్తి విజ్ఞాత మిదం మాయాఽద్య ।*
*మనోరథాసక్తి పరస్య చిత్తం న జాయతే వై పరమార్థ సఙ్గి ॥*

'బ్రతికి ఉన్నంత వరకు కోరికలు మనిషిని విడిచి పెట్టవని నా కిప్పుడు బాగా తెలిసి వచ్చింది. ఎవరి మనస్సు కోరికలలో కూరుకు పోయిందో, వారి మనస్సుకు పరమార్థ విషయము నందు ఆసక్తి కలగదు. ఏం చెయ్యాలి?' అంటూ దిక్కు తోచని స్థితిని విష్ణుపురాణం - సౌభర్యాఖ్యానము ఆవిష్కరించింది. ఈ ఆవిష్కర ణలు ఆవేదన చెందడానికి కాదు. నిరాశా నిస్పృహలలో నిశ్చేష్టులు కావడానికీ కాదు. అనర్థాన్ని గుర్తించి, దాని నుండి బయటపడే మార్గాన్ని అన్వేషించ డానికి. కామ జయానికి ప్రయత్నించ డానికి.

కామాన్ని 'ప్రథమ మల్ల నిబర్హణ న్యాయ' పరిధిలో జయించాలి. అంటే, మల్ల యుద్ధములో ఎవడు అగ్ర స్థానంలో ఉన్నాడో, ప్రథమ శ్రేణిలో గుర్తింపు పొందాడో, వాణ్ణి జయిస్తే, దేశంలో ఉన్న యోధు లందరినీ జయించి నట్లే. దీనినే 'ప్రథమ మల్ల నిబర్హణ న్యాయము' లేదా 'ప్రధాన మల్ల నిబర్హణ న్యాయము' అంటారు. త్రివిధ నరక ద్వారా లైన కామక్రోధ లోభాలలో అగ్రస్థానం కామానిదే కనుక, కామాన్ని జయిస్తే మూడిటిని జయించినట్లే. నరక ద్వారాలను మూసేసి నట్లే.

కామం అసుర మానవులలో ఉంది. అంటే, దైవ మానవులలో కామం లేదా? వాళ్ళల్లో కూడా ఉంది. కాకపోతే, అసుర జనుల లోని కామం బంధ హేతువు అవుతూ ఉంది. దైవ జనుల లోని కామం మోక్ష హేతువు అవుతూ ఉంది. కారణాన్ని పరిశీలిస్తే, అసుర సంపదలో కామం ధర్మానికి విరుద్ధంగా ఉంది. దైవ సంపదలో కామం ధర్మానికి అవిరుద్ధంగా ఉంది. ఈ కారణం చేత కామం ఒకరికి బంధహేతువు. మరొకరికి మోక్ష హేతువు. ***ధర్మాఽవిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ!*** - 'అర్జునా! ధర్మానికి విరుద్ధం కాని కామము





నేనే అని తెలుసుకో!' అన్నాడు గీతాచార్యుడు *(7వ అ - 11 వ శ్లో)*. సర్వ అనర్థాలకు కారణమైన, సర్వ బంధహేతు వైన కామాన్ని అవగాహనతో త్యజించాలి. అది ఊహించి నంత సులభమైన కార్యం కాదు. కాని, పవిత్రమైన ప్రయత్నాలు తప్పకుండా ఫలిస్తాయి. కాకపోతే, సమయం కొంత ఎక్కువ పట్ట వచ్చు. బహు కాల వాసనలు కదా! బహుకాల ప్రయత్నాల తోనే వశిస్తాయి. అంతేకాని, వశించక పోవడ మనేది ఉండదు. ఈ విషయంలో మన ప్రయత్నాలు విచార రూపంలో, ఆచార రూపంలో దృఢంగా సాగాలి. పరమేశ్వరుని అనుగ్రహం తోడు కావాలి. కనుక, భగవంతుని దయను పొందడానికి అలౌకిక కర్మలైన పూజ, జప, ధ్యాన, స్వాధ్యాయాలను ప్రారంభించాలి. సూర్యునికి అభిముఖంగా పయనించే వారి నీడ ముందుకు రాలేదు. వెనుక బడి పోతుంది. ఆదిత్యునికి అభిముఖంగా పయనించి ఛాయను వెనుక పడేసినట్లు, పరమేశ్వరుని ముందు పెట్టుకొని మాయను, మాయామయ మైన గుణాలు సృష్టించిన కామాదులను వెనుకకు నెట్టేయాలి. మన కృషి భగవత్కృప రెండూ కలిస్తే కామక్రోధ లోభాలు అదృశ్య మవుతాయి. మోక్ష మార్గము సుస్పష్ట మవుతుంది.

*రోగాలతో దేహము నిండిపోయె*
*భోగాలతో మనసు మండిపోయె*
*యోగ మెపుడు యోగ్యు డగుట ఎపుడు?*
*నీ అడుగుల కడ పడి ఉందు నీలకంఠా!*

అని నీలకంఠ శతకంలో ఒక విబూది పండు.

భగవ త్ప్రార్థన నిత్యమూ సాగేటట్లు చూసుకోవాలి. కామక్రోధ లోభాలు బ్రతుకును ఎలా కృంగ దీస్తాయో నిరంతరము చింతన చెయ్యాలి. అవి ఎలా అనర్థ దాయకమో ఆలోచిస్తూ ఉండాలి. మెల్లమెల్లగా పూజ, ప్రార్థన, ముఖ్యంగా భగవన్నామ సంకీర్తనము మొదలైన పవిత్ర సాధనలను క్రమం తప్పకుండా ఆచరిస్తూ ఉండాలి. దుర్జన సాంగత్యాన్ని లేకుండా చేసుకోవాలి. సత్పురుష సాంగత్యాన్ని పవిత్రంగా కొనసాగించాలి. ఒక దశలో అనూహ్యమైన పరిణామాన్ని, అద్భుతమైన మార్పును మన జీవితాలలో మనం చూడ వచ్చు. కామం కరిగి పోతూ ఉంటే, ధర్మజ్యోతి దేదీప్యమాన మవుతూ ఉంటుంది. ఒక దశలో కామక్రోధ లోభాలు మనకు తెలియకుండానే మనకు దూరమై పోతాయి. ఆ క్షణంలో మనం మోక్ష మార్గంలో ప్రధాన రహదారిపై ఉంటాము. ఈ విధంగా అనర్థ దాయకాలు, బంధ హేతువులు, అజ్ఞాన రూపాలు అయిన కామక్రోధ లోభాలను పరిత్యజించాలి ***( కామాది త్రయం ఏతత్ త్యజేత్ ).***

*కామాది త్రయాన్ని పరిత్యజించడం అనే పవిత్ర ఆశయాన్ని స్తుతిస్తున్నాడు* ***( త్యాగ స్తుతి రియమ్ ).***

ఏతై ర్విముక్తః కౌన్తేయ తమోద్వారై స్త్రిభి ర్నరః ।
ఆచర త్యాత్మనః శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్ ॥ 22

*ఏతైః-విముక్తః-కౌంతేయ-తమోద్వారైః-త్రిభిః-నరః*
*ఆచరతి-ఆత్మనః-శ్రేయః-తతః-యాతి-పరాం-గతిం*

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ | = | అర్జునా! | విముక్తః | = | విడువబడిన |
| తమోద్వారైః | = | అజ్ఞాన ద్వారములైన | నరః | = | నరుడు |
| ఏతైః | = | ఈ | ఆత్మనః | = | తనకు |
| త్రిభిః | = | మూడింటి చేతను | శ్రేయః | = | శ్రేయస్సు |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆచరతి | = | కలిగించు కుంటున్నాడు | గతిం | = | మోక్షమును |
| తతః | = | అందువల్ల | యాతి | = | పొందుతున్నాడు |
| పరాం | = | పరమమైన | | | |

**అర్జునా! కామక్రోధ లోభాలు అజ్ఞాన ద్వారాలు. వాటి నుండి విడి పడిన వాడు శ్రేయస్సును అందుకుంటాడు. అందువల్ల, ఉత్తమ గతి అయిన మోక్షాన్ని పొందుతాడు.**

**వ్యాఖ్య**

కామక్రోధ లోభాలు నరక ద్వారాలు. తమో ద్వారాలు. తమస్సు అంటే చీకటి. అజ్ఞానము. తమస్సు లోకి ప్రవేశించాలన్నా ఇవే ద్వారాలు. తమస్సు నుండి బయట పడాలన్నా ఇవే ద్వారాలు. పాపకార్యాలు చేసి కొందరు ఈ చీకట్ల లోకి ప్రవేశిస్తూ ఉంటే, ఇప్పటికే ప్రవేశించి ఉన్న వారు ఈ అజ్ఞాన చీకట్ల నుండి ఎలా బయట పడాలో తెలియక పరితపిస్తున్నారు.

**చీకటి ముసిరిన చింతల నడుమ**
**ఆడిన ఆటలు చాలవా?**
**మృత్యు పాశము వెంట నున్నది**
**సత్య మార్గమును గన లేవా?**
**తెర పడిందా తనువే లేదు**
**మర్మము నెరిగి సాగిపో**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా *(39)*.

కామక్రోధ లోభాలనే నరక ద్వారాల లోకి ప్రవేశిస్తే ఆత్మకు విఘాతం కలుగుతుంది అన్నాడు ***(ఆత్మనః నాశనం)***. కామక్రోధ లోభాలనే నరక ద్వారాల నుండి బయట పడితే ఆత్మ శ్రేయస్సును పొందడం జరుగుతుంది అని ప్రస్తుత శ్లోకంలో చెబుతున్నాడు ***(ఆత్మనః శ్రేయః)***. శ్రేయో మార్గములో చరించడానికి పూర్వం ఏవి ప్రతిబంధకాలుగా ఉన్నవో, వాటి నుండి నరుడు ***(నరః)*** విముక్తుడు కావడం చేత, పూర్వం ఆచరించ లేని వాటిని ఇక ఆచరిస్తాడు అని అర్థము. అలా ఆచరించడం వల్ల ఉత్తమ గతిని, అంటే మోక్షమును పొందుతాడు ***( తదాచరణాత్ యాతి పరాంగతిమ్ మోక్షం అపి ఇతి )***. ముక్తుడు అనకుండా 'వి'ముక్తుడు అనడం చేత, కామాది త్రయమే కాకుండా, వాటికి కారణమైన అజ్ఞానము నుండి కూడా విముక్తు డౌతాడని అర్థము.

ప్రస్తుత శ్లోకంలో నరక ద్వారా లైన కామక్రోధలోభాల నుండి విముక్తుడై, నరుడు శ్రేయస్సును పొందు తాడు అంటూ నరుడు ***(నరః)*** అనే పదాన్ని ఉపయోగించడము వెనుక గీతాచార్యుని భావం సాగర మంత అగాధం గాను, గంభీరం గాను ఉంది.

***నరః*** అంటే నరుడు. ***నరీయతే ఇతి నరః*** - ఎవడైతే నశించడో వాడే నరుడు. నశించడు అంటే అనంతుడు అని అర్థము. మరి, జీవుడైన నరుడు అనంతు డైతే, దేవుడు ఎవరు? అతడూ అనంతుడే. మరి రెండు అనంతాలు ఉంటాయా? ఉండవు. ఉండ లేవు. జీవుడూ అనంతుడే. దేవుడూ అనంతుడే. అనంతము ఏకము, అద్వితీయము. కనుక జీవుడే దేవుడు. దేవుడే జీవుడు. జీవుడు అనంతుడు కనుక నరుడు ***(నరః)***.





దేవుడు కూడా అనంతుడు కనుక అతడూ నరుడే ***(నరః)***. ఇద్దరూ నరులే. కాదు నరుడే. ఇద్దరూ నారాయణులే. కాదు నారాయణుడే. విష్ణుసహస్రనామంలో భగవంతుడికి నరుడు ***(నరః)*** అనే నామం కూడా ఉంది *(246)*.

***నయతీతి నరః ప్రోక్తః పరమాత్మా సనాతనః ఇతి వ్యాస వచనాత్*** - జీవులను నడిపించే వాడు కనుక భగవంతుడు నరుడు. సనాతనుడైన నారాయణుడే నరుడు అని వ్యాస ప్రోక్తము అని భాష్యంలో ఆచార్యుల వారు ఉటంకించారు.

నరుడు నారాయణుడే కనుక, తనను తాను పొందడము కష్ట మేమీ కాదు. వస్తువు ఉన్నదే. ఉన్న దానిని తెలుసుకోవడం కష్టమా? కాకపోతే ప్రమాణం కావాలి. అంతే. ప్రమాణం లభించిన వారికి మోక్షము కరతలా మలకము. ప్రమాణ వ్యతిరేకులకు మోక్షము అంద నంత దూరము. విషయం అర్థమైతే మోక్ష మంత సులభము మరొకటి లేదు. కారణం, అది నీ స్వరూపమే కనుక.

***శ్లో॥ ఆయాస స్తావత్ అత్యల్పః ఫలం ముక్తి రిహైవ తు***
***తథాఽపి పరమా ద్వైతం నైవ వాంఛంతి మానవాః***

శ్రమ చాలా అల్పము. ఇక ఫలమా? ఇక్కడే, ఇప్పుడే అందుతుంది. అయినా మానవులు అద్వయ స్వరూప మైన మోక్షాన్ని ఎందుకనో కోరుకోరు!

*అసుర సంపదను త్యజించాలన్నా, శ్రేయస్సును పొందాలన్నా, శాస్త్రాన్ని అనుసరిస్తేనే సాధ్య పడుతుంది. మరో విధంగా సాధ్య పడదు. శాస్త్రమే ప్రమాణం కనుక, శాస్త్ర విధిని గ్రహించి బ్రతుకు విధానాన్ని సరి చేసుకోమని ప్రబోధిస్తూ అధ్యాయాన్ని సమాప్తం చేస్తున్నాడు.*

**య శ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః ।**
**న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥** 23

***యః-శాస్త్రవిధిం-ఉత్సృజ్య-వర్తతే-కామకారతః***
***న-సః-సిద్ధిం-అవాప్నోతి-న-సుఖం-న-పరాం-గతిం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = | ఎవడు | న అవాప్నోతి | = | పొందడు |
| శాస్త్రవిధిం | = | శాస్త్రవిధిని | సుఖం | = | సుఖము |
| ఉత్సృజ్య | = | విడిచి | న | = | పొందడు |
| కామకారతః | = | తన ఇష్టానుసారము | పరాం | = | ఉత్తమమైన |
| వర్తతే | = | ప్రవర్తిస్తున్నాడో | గతిం | = | మోక్షము |
| సః | = | వాడు | న | = | పొందడు |
| సిద్ధిం | = | సిద్ధిని | | | |

**అర్జునా! శాస్త్ర ప్రమాణాన్ని విడిచి ఇష్టానుసారం ప్రవర్తించే వాడు సిద్ధిని పొందడు. సుఖాన్ని పొందడు. మోక్షాన్ని పొంద లేడు.**

**తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ ।**
**జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మ కర్తు మిహార్హసి ॥** 24

**తస్మాత్-శాస్త్రం-ప్రమాణం-తే-కార్యాకార్య వ్యవస్థితౌ**
**జ్ఞాత్వా-శాస్త్రవిధానోక్తం-కర్మ-కర్తుం-ఇహ-అర్హసి**

| | | | |
|---|---|---|---|
| తస్మాత్ | = అందువలన | కర్మ | = కర్మను |
| తే | = నీకు | జ్ఞాత్వా | = తెలుసుకొని |
| కార్యాకార్యవ్యవస్థితౌ | = కార్యాకార్య నిర్ణయము నందు | ఇహ | = ఇక్కడ |
| శాస్త్రం | = శాస్త్రము | కర్తుం | = చేయుటకు |
| ప్రమాణం | = ప్రమాణము | అర్హసి | = తగుదువు |
| శాస్త్రవిధానోక్తం | = శాస్త్రము చెప్పిన విధంగా | | |

**అర్జునా! ఏ కార్యం యుక్తం, ఏ కార్యం అయుక్తం అనే విషయంలో నీకు శాస్త్రమే ప్రమాణము. శాస్త్ర విధి ననుసరించి ఇక్కడ నువ్వు కార్యాలను ఆచరించ వచ్చు.**

**వ్యాఖ్య**

ఆత్మ హానిని (*నాశనం ఆత్మనః*) కలిగించే నరక ద్వారాలు కామక్రోధ లోభాలు. పతన హేతువు లైన ఈ మూడిటిని త్యజించాలి. నిజమే. మరి, ఈ మూడు ఎక్క డున్నాయి? మన లోనే ఉన్నాయి. మన స్వభావంలో భాగమై ఉన్నాయి. మనం ఇష్ట పడ బట్టే కదా అవి మన స్వభావంగా మారి పోయాయి! అలాంటి వాటిని త్యజించడం సాధ్యమా? త్యజించడము సాధ్యమయ్యే టట్లైతే, ఇంత కాలం ఎందుకని త్యజించ లేక పోయాము? మనకు మనంగా త్యజించ లేక పోవడానికి కారణం ఒక్కటే. ఎలా త్యజించాలో తెలియక పోవడము. జ్ఞానం లేక పోవడము. జ్ఞానం లేని కారణంగా అసుర సంపదను విడిచిపెట్ట లేకపోయిన మనం, జ్ఞానం కలిగితే త్యజించ గలం. మరి, ఆ జ్ఞానం ఎలా ప్రాప్తిస్తుంది? శాస్త్రం ద్వారా ప్రాప్తిస్తుంది. కనుక, అసుర సంపదను త్యాగం చేయా లంటే శాస్త్రమే కారణమై ఉంది.

అలాగే శ్రేయస్సును పొందాలంటే (*ఆత్మనః శ్రేయః*) కూడా శాస్త్రాన్నే అనుసరించాలి. ఏది శ్రేయస్సో, ఏది కాదో మనకే తెలిసే అవకాశం లేదు. అలా మనకే తెలిసే అవకాశం ఉంటే, ఇంత కాలం శ్రేయో మార్గాన్ని ఎందుకని అనుసరించలేక పోయాము? దారి తప్పిన వ్యక్తిని దారి తెలిసిన వాడు దారిలో పెట్టగలడు గాని, దారి తప్పిన వాడే దారిలో ఎలా పడగలడు? అలా పడటానికి ప్రమాణ మేమిటి? కనుక, అసుర సంపదను విడిచి పెట్టి ఆత్మ వినాశాన్ని తొలగించుకోవా లనుకున్నా, దైవ సంపదను ఆశ్రయించి, ఆత్మ శ్రేయస్సును పొందా లనుకున్నా శాస్త్రమే హేతువుగా ఉంది. శాస్త్ర ప్రమాణంతో ఈ రెండిటిని సాధించ వచ్చు. మరో విధంగా అవకాశం లేదు (*శాస్త్ర ప్రమాణాత్ ఉభయం కర్తుం శక్యం, న అన్యథా*).

ధర్మాన్ని ఆచరించా లంటే ధర్మం తెలిసి ఉండాలి. ఏది ధర్మం? ఎవరి ధర్మం వారిదే నని ఈ రోజుల్లో మాట్లాడుతూ ఉన్నారు. ఎవరి ధర్మం వారిదే కనుక, ఎవరి ఇష్టానుసారం వారు స్వేచ్ఛా విహారం చెయ్యవచ్చు అని అర్థము. అలా గతంలో చేయబట్టే కదా అనర్థాలను కొని తెచ్చుకున్నాం. మళ్ళీ అదే స్వేచ్ఛా ప్రవర్తనమా? ఇలా ఎందుకని మాట్లాడుతాడో తెలుసా? జ్ఞానం లేక పోవడం చేత. ఎవరి ధర్మం వారిది అని ఎందుకంటున్నా డంటే, ధర్మ మంటే ఏమిటో తెలియక పోవడం చేత. ఇష్టాయిష్టాలకు, ధర్మాధర్మాలకు తేడా తెలియక పోవడం చేత. ఈ కారణంగా ఎవరి ఇష్టం వారిది అనడానికి బదులు, ఎవరి ధర్మం వారిది అంటున్నాడు. ఇష్టాయిష్టాలకు శాస్త్రం అవసరం లేదు. ధర్మాధర్మాల విషయంలో శాస్త్రమే ప్రమాణం.





**శాస్త్ర హేతుత్వాత్ ధర్మాధర్మ విజ్ఞానస్య**

ఏది ధర్మమో, ఏది అధర్మమో, ఏవి సత్కర్మలో, ఏవి దుష్కర్మలో తెలియా లంటే వేద శాస్త్రమే ప్రమాణము అని శ్రీ శంకరాచార్యస్వామి బ్రహ్మసూత్ర భాష్యంలో విస్పష్టం చేశారు (బ్రహ్మసూత్రములు ; *3 - 1 - 15*).

ఏవి సత్కర్మలు? వాటిని ఎలా ఆచరించాలి? ఏవి దుష్కర్మలు? వాటిని ఎలా త్యజించాలి? ఏవి ప్రగతి హేతువులు? ఏవి పతన కారణాలు? వీటన్నిటికీ సమాధానాలు బుద్ధి నుండి పుట్టవు. శాస్త్రం లోనే అగుపిస్తాయి. ఏది భోజ్యమో, ఏది త్యాజ్యమో శాస్త్రమే చెప్పాలి. అలాంటప్పుడు ఎవడైతే శాస్త్రాన్ని విడిచి పెట్టి (*యః శాస్త్ర విధిం ఉత్సృజ్య*) కామ ప్రేరణం చేత స్వేచ్ఛాచరణం సాగిస్తాడో (*వర్తతే కామ కారతః*). అట్టి వాడు సిద్ధిని పొందడు (*నస సిద్ధిం అవాప్నోతి*). సుఖమును పొందడు (*న సుఖం అవాప్నోతి*). మోక్షమునూ పొందడు (*న పరాంగతిం అవాప్నోతి*).

శాస్త్రవిధి అంటే విధి నిషేధాల యందు జ్ఞానము అని అర్థము. ఏది కర్తవ్యము? ఏది అకర్తవ్యము అనే జ్ఞానము (*కర్తవ్యా కర్తవ్య జ్ఞాన కారణం*). దేనిని ఆచరించాలి, దేనిని ఆచరించ కూడదు అనే విధి నిషేధాలకు సంబంధించిన జ్ఞానము (*విధి ప్రతిషేధాఖ్యమ్*).

ఈ జ్ఞానము వ్యక్తి తనకు తానుగా పొందే అవకాశం లేనందున, శాస్త్రమే కారణమైంది. అలాంటి శాస్త్రాన్ని విడిచిపెట్టి (*ఉత్సృజ్య త్యక్త్వా*), కామ ప్రేరణతో వర్తించేవాడు (*వర్తతే కామ కారతః కామ ప్రయుక్తః*) పురుషార్థ సిద్ధికి యోగ్యత్వాన్ని పొంద లేడు (*న సః సిద్ధిం పురుషార్థ యోగ్యతామ్ ఆప్నోతి*). పురుషార్థం విషయంలో యోగ్యత లేని వాడు శ్రేయస్సును ఎలా సాధిస్తాడు?

రోగం ఉందని రోగి ఏది తింటే అది ఔషధ మౌతుందా? ఏదంటే అది ఆరగించి, కొని తెచ్చుకున్న రోగాన్ని, ఏదంటే అది తిని పోగొట్టుకునే అవకాశం ఉందా? రోగి తనకు తానుగా రోగాన్ని పోగొట్టుకో లేడు కనుక, వైద్య విధి ననుసరించి వర్తించాలి. అంటే, వైద్యుడు చెప్పినట్లు వినాలి. ఎందుకని? వైద్యుడికి వైద్యశాస్త్ర జ్ఞానం ఉంది కనుక. శాస్త్ర జ్ఞానమే రక్షిస్తుంది. వ్యక్తిగతంగా అశాస్త్రీయ విధానాలను అవలంబిస్తే హాని కలుగుతుంది (*నాశనం ఆత్మనః*).

తనకు తోచిందే న్యాయం, తాను మెచ్చిందే ధర్మం అనుకొని దుర్యోధనుడు వినాశాన్ని కొనితెచ్చు కున్నాడు. మనస్సు చెప్పినట్లు కాకుండా శాస్త్ర మార్గాన చరించి పాండవులు ప్రాతఃస్మరణీయు లయ్యారు. మనకు జ్ఞానాన్ని ప్రసాదించి మన ఉన్నతిని కాంక్షించే శాస్త్రాన్ని ఎట్టి పరిస్థితుల లోను త్యజించ కూడదు. అతిక్రమించ కూడదు. అతిక్రమిస్తే ఏమవుతుంది? అతిక్రమించ డానికి క్షణం చాలు. దాని దుర్భర ఫలితాన్ని అనుభవించ డానికి ఒక్క సంవత్సరం పట్టింది.

లక్ష్మణ రేఖ ఉందా, లేదా? అనే చర్చ ఇక్కడ అప్రస్తుతం. అదలా ఉంచి వాస్తవాన్ని గ్రహించండి. 'వదినా! నువ్వు శాసించినట్లు అన్న కొరకు నేను వెళ్తున్నా. నువ్వు జాగ్రత్తగా ఉండు. ఈ గీత దాటకు' అని చెప్పి లక్ష్మణుడు రాముని అన్వేషిస్తూ పోతే, ఆప్తవాక్యాన్ని అతిక్రమించి గీతను దాటడం వల్లే కదా సీతమ్మ ఆపదల పాలైంది! లంకలో ఒక వార్షికం విషాదాన్ని అనుభవించ వలసి వచ్చింది! శాస్త్రాలు అనుసరించడాని కున్నాయే గాని అతిక్రమించ డానికి కాదు.

మతి చెప్పినట్లు విని దుర్గతిని కొని తెచ్చుకున్నాం. శ్రుతి చెప్పినట్లు ఆచరించి సద్గతి కొరకు ప్రయత్నించాలి. మతి మాయలో పడేస్తుంది. శ్రుతి మహిమలో ఊరేగిస్తుంది. చీకటిలో నడచి పోయే వాడి చేతిలో దీపం ఉండాలి. అజ్ఞాన చీకటిలో చరించే మానవుని చిత్తంలో శాస్త్ర దీపం వెలుగుతూ ఉండాలి.

**మతి గల వాడే మానవుడు**
**మతి పతి యైతే వానరుడు**
**అంతా మతి యైతే శ్రుతి ఎందుకు?**
**శ్రుతి ఉంటేనే యతి ముందుకు**
**మాయలే మతికి రాస్తాలు**
**మహిమలు శ్రుతికి నేస్తాలు**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

***వేదాః స్థానాని విద్యానాం*** - వేదాలు విద్యాస్థానాలు, జ్ఞాన నిలయాలు అన్నది యాజ్ఞవల్క్య స్మృతి. కర్తవ్య మేమిటి, అకర్తవ్య మేమిటి అనే విషయంలో శాస్త్రమే మనకు ప్రమాణము. వివిధ పురుషార్థాలను ఎలా సాధించు కోవాలో, ఆ మార్గా లన్నిటినీ సుబోధకం చేస్తుంది శాస్త్రం ***( పురుషార్థోపదేశత్వాత్ శ్రుతీనామ్ )*** అన్నారు తైత్తిరీయోపనిష ద్భాష్యంలో శ్రీ శంకరాచార్యస్వామి.

అందుచేత శాస్త్రవిధిని అనుసరించి, కర్తవ్యాన్ని ఆచరిస్తూ పోవాలి ***( జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం )***. విధి అంటే విధానము. శాస్త్రం చేత చెప్పబడింది శాస్త్రవిధి లేదా శాస్త్ర విధానము ***( విధిః విధానమ్, శాస్త్రేణ విధానమ్ శాస్త్ర విధానమ్ )***. దేవతలకు సైతము లభ్యం కాని కర్మాధికారం మానవులకే ఉంది. ఈ సత్యాన్ని స్పష్టం చేయడానికే ***ఇహ*** పద ప్రయోగము ***( ఇహ ఇతి కర్మాధికార భూమి ప్రదర్శనార్థమ్ )***. భూలోకం లోనే కర్మాధి కారం ఉంది కనుక, శాస్త్రోక్త విధి ననుసరించి, కర్తవ్యాన్ని నిర్వహించి, శ్రేయస్సును పొందమని ఉపదేశిస్తూ దైవాసుర సంపద్విభాగ యోగాన్ని భగవంతుడు సమాప్తం చేశాడు.

**ఓం తత్ సత్**

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
దైవాసుర సంపద్విభాగయోగో నామ షోడశోఽధ్యాయః

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు దైవాసుర సంపద్విభాగ యోగ మనే పదహారవ అధ్యాయము.**





# చైతన్య భగవద్గీత

## అథ సప్తదశోఽధ్యాయః - పదిహేడవ అధ్యాయము

## శ్రద్ధాత్రయ విభాగ యోగః - శ్రద్ధాత్రయ విభాగ యోగము

**ప్రమాణ విషయం**

ఎవరు దేనిని పొందా లనుకున్నా, దానికి సంబంధించిన జ్ఞానం వారికి ఉండాలి. ఉంటుంది. అప్పుడే దానిని పొంద గలరు.

వారు పొందాలి అనుకున్న దొకటి ఉండి, దానికి సంబంధించిన జ్ఞానము వారికి లేనపుడు, సాధారణంగా స్నేహితుడో, బంధువో లేదా మరొకరో చెప్పే ఆప్తవాక్యము మీద విశ్వాస ముంచి, వస్తు ప్రాప్తికి యత్నిస్తూ ఉంటారు. లోకంలో వ్యవహారా లన్నీ ఇలాగే ఉంటాయి.

స్వబుద్ధికి జ్ఞానం లేక పోవడం వల్లనే కదా, పరబుద్ధిని ఆశ్రయించడం జరిగింది? తన జ్ఞానం మీద తనకే విశ్వాసం లేక పోవడం చేత పరులను విశ్వసించడం జరిగింది. వారి మీద కూడా విశ్వాసం లేనట్లైతే, వస్తు ప్రాప్తికి ప్రయత్నం చేయలేడు కదా! ***( లోకేఽపి ఆప్తవాక్యే విశ్వాస అభావే, నైవ తదనుసారేణ ప్రవర్తతే పురుషః )***. లోకంలో ఏ కార్య ప్రాప్తి కైనా, తన జ్ఞానం మీద గాని, లేదా పరుల జ్ఞానం మీద గాని ఆధారపడే ప్రయత్నాలు సాగుతూ ఉంటాయి. కాని, ఈ రెండు ఆధారాలూ కొన్ని సమయాలలో ఆదా చేయడానికి ఉపకరించక పోవచ్చు. అలాంటి పరిస్థితులలో వారి మాటలు, ఊహలు ప్రశ్నార్థకంగా, సంశయాత్మకంగా, పరిశీలనాత్మకంగా విన పడుతూ ఉంటాయి.

'నాకు తెలియక అలా చేసేశాను. అలా చేయకుండా ఉంటే బాగుండేది' - ఈ మాటల వెనుక స్వబుద్ధి అజ్ఞానాన్ని ప్రత్యక్షంగా అంగీకరించడమే జరుగుతూ ఉంది.

'అతనికి అనుభవ ముందని విశ్వసించాను. వాళ్ళకు బాగా తెలుసని అభిప్రాయ పడ్డాను. పాపం! వాళ్ళ తప్పు కూడా లేదు. వాళ్ళకు తోచింది వాళ్ళు చెప్పారు. తెలియనిది ఎవరైనా ఎలా చెబుతారు? నాకే ప్రాప్తం లేదు' - ఈ మాటల వెనుక పరులకు లేని జ్ఞానముతో పాటు, వారి జ్ఞానం విషయంలో తన కున్న అజ్ఞానమును కూడా స్పష్టంగా అంగీకరించడమే జరిగింది.

సామాన్యమైన లౌకిక విషయ వ్యవహారాలే ఇలా ఉండే టప్పుడు, అతీంద్రియ విషయమైన ఆత్మ తత్త్వము నందు మన తలపులు, తర్కాలు, పరుల బుద్ధికి సంబంధించిన ఊహలు ఎంత వరకు సహకరిస్తాయి? వాటి విషయం చెప్పడానికి ఏముంది? ***( కి ముత అతీంద్రియే శాస్త్రార్థే ? )***.

మనపై మనకు విశ్వాసం ఉండాలి. పరులపై కూడా విశ్వాసం ఉంచ వచ్చు. తప్పు లేదు. కాని, బ్రహ్మ జ్ఞానము విషయంలో మన విశ్వాసము పరులపై కాదు, ప్రమాణంపై ఉండాలి. ప్రమను, లేదా జ్ఞానమును కలిగించేది ప్రమాణము కనుక ***(ప్రమాకరణం ప్రమాణం)***. శాస్త్ర ప్రమాణంపై ప్రగాఢమైన విశ్వాసం ఉండాలి. దానినే శ్రద్ధ అంటారు. దేని చేత బ్రహ్మజ్ఞానము పొంద బడుతూ ఉందో, అదే శ్రద్ధ అన్నారు సత్పురుషులు ***('యయా వస్తూపలభ్యతే సా శ్రద్ధా' - ఇతి సద్భిః కథితా। )***. ఎవరికి శ్రద్ధ ఉంటుందో వారు జ్ఞానాన్ని పొందుతారు అని భగవంతుడు గీత - నాల్గవ అధ్యాయం లోనే ప్రబోధించాడు ***( శ్రద్ధావాన్ లభతే జ్ఞానం;*** 4 వ అ - 39వ శ్లో).